# భారతి

మాస పత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

డిశెంబరు 1977

సంపుటము : 54 సంచిక : 12

విడిపత్రిక వెల రూపాయిన్నర

# వెలుగుతో పరుగు పందెం

పెట్టుబడి నాణెం ఎగరవేస్తే...
బొమ్మా-బొరుసా అనే సందేహంలేదు. బొమ్మే పడుతుంది.
నీ చిన్న పరిశ్రమ కూడా లాభిస్తుంది ?
పట్టణాల్లో మరచక్రాలు, పొగ గొట్టాలు విజృంభిస్తున్నాయి.
పల్లె పట్టుల్లో పెరటి చెట్లులాంటి లఘుపరిశ్రమలు పలిస్తున్నాయి.
బాపూ అన్నట్టు పారిశ్రామిక భాగ్యోదయానికి గ్రామాలే ఆటపట్టులు.
రెండుదశాబ్దాల మనచరిత్ర పారిశ్రామిక విప్లవాన్ని చవిచూచింది.
రాష్ట్ర వ్యాప్తంగా చిన్నతరహా పరిశ్రమలకు చేయూత లభిస్తూంది.
**1977** మార్చి మాసాంతానికి **21** జిల్లాల్లోనూ రూ. **23.28** కోట్లు వెచ్చించి రమారమి **3520** యూనిట్లకు ప్రభుత్వం అనుమతించింది.

స్వయం ఉపాధి పథకాల్లో దిగ్విజయ సాధనలో దేశంలోకల్లా మన తెలుగు గడ్డముందు వరసన వుంది. యీ పథకాల బాగోగులు ప్రభుత్వ శాఖలన్నీ పర్యవేక్షిస్తుంటాయి. రూ. **420.70** లక్షలు వ్యయంతో యీ యేట **1858** యూనిట్లు వెలిశాయట.

**1956**లో రాష్ట్రావతరణ నాటికి రూ. **48** కోట్ల పెట్టుబడితో **45** మధ్యతరహా చిన్నతరహా పరిశ్రమలుండేవి.

మరిప్పుడో **248** భారీవీ, సన్నకారువీ ఉన్నాయి. వీటికి రూ. **225** కోట్లు వ్యయం.

రాష్ట్ర ఆర్థిక జీవనంలో నవోదయం. ఈ నవోదయపు వెలుగులతో మన ప్రజలు పరుగు పందెంలో పాల్గొంటున్నారు.

*డైరెక్టర్, సమాచార పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*

22/77-78/2



# విషయానుక్రమణిక

## డిశంబరు 1977





# నువ్వూ - నేను

కే ఎ స్వీ

ఈ అర్ధరాత్రి నీ రూపాన్ని నా గుండెకు గుచ్చుతోంది.
స్మృతి గీపెడుతోంది కీచురాయై.
నీ కనుచూపు చీకటై ఆవరించింది.
ఎంతసేపు మౌన సంభాషణ ?
ఎన్ని యుగాలదీ వేదన ?

* * *

నిదుర కొరకు కనురెప్పలు మూతపడవు, మగత విడవు.
కల — రాదు.

* * *

నవ్వుకుంటాను కన్నీళ్ళతో.
రోదిస్తాను ఆనందంగా.
నువ్వు తాకి వెళ్ళిన ఈ గుండెతలుపులు
ఇంకెవరి కరస్పర్శకీ తెరుచుకోవు.
నువ్వో అబద్ధానివి. నా ఆత్మ
ముఖం చూసుకునే అద్దానివి.
నువ్వు — నేను తిరిగిన బాటలేని మలుపువి.

* * *

నా భయాలకి నువ్వు ఓదార్పు.
నీ రూపం నాకు జలదరింపు.
ఎన్ని వినీల సముద్రాల అగాధ రహస్యాలు
— నీ కళ్ళ వెనుక !
నీ కనురెప్పలక్రింద మరణమే
నన్ను నేను కలుసుకునే మహాప్రస్థానం.

* * *

అందని నువ్వే అందం.
నీకోసం నా రక్తఘోష. నీ మందహాసం
నా ఉన్మత్తత.
నీ భ్రుకుటి ముడి నా పాలిటి
అధఃపాతాళ పతనం.

* * *

కొసలులేని దారం కాలం
ముడేసింది నిన్నూ నన్నూ, బిగిసింది
ఉచ్చు.
నీలోకి నేను మరణిస్తాను.

* * *

నువ్వో చిన్నపిల్లవి, నేనో కుర్రాణ్ణి.
పిచుకగూళ్ళు కట్టుకుందాం
ఏటొడ్డుకెళ్దాం — రా !

కానుగలు పూశాయి, స్మృతులు రాలేయి.
తడి ఇసుక మంచితనంలా మెరుస్తోంది.
రా ! పాపా—పిచుకగూళ్ళు కట్టుకుందాం —
పారిజాతాలతో నీపేరూ నాపేరూ రాసుకుందాం.
చెరపొద్దని గాలిని బ్రతిమిలాడుకుందాం...

గుండె పుస్తకం పేజీలు విడదీసి
కాగితం పడవలు చేసుకుందాం...
అలలమీద గుండెలు వెళ్తూండగా
ఆనందంగా తిలకిద్దాం —

రా — పాపా —
నువ్వూ — నేనూ ...

# ఊహాపోహాలు

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

ఊహ !
సౌందర్యాన్వేషణలో
ఆలోచనా స్రవంతికి అందాలబాట !
అపోహ !
దురూహనుండి పుట్టిన బ్రదుకుపాలిటవేట !
ఊహ !
అతి సుందరమైనది
ఆరోగ్యప్రదమైనది
అపోహ
అతి భయంకరమైనది
అనర్థదాయకమైనది
ఊహ
పాలకడలిపై రాజహంస !
అపోహ
బ్రదుకు కడలిలో చిత్రహింస
ఊహ సురలోకాన్ని సృష్టిస్తుంది
అపోహ నరక లోకంలో చుట్టేస్తుంది !
అందుకే —
ఊహల్లో విహరించడం సరదా
అపోహల్లో నలగడము
జీవిత గమనానికే పరదా !
ఊహిస్తే —
ఊర్వశి మేనక తిలోత్తమ
ఆదిగాగల సౌందర్యవతులు
ఊడిగం చేస్తున్న నీ సతులు !
అపోహల స్మృతి శ్రుతులు
అనవరతము నిన్నను వేష్టించిన
యమభటులు, భీతావహులు !
ఊహాపోహలు
జీవితంలోఉంటే ఊరుగాయ
లేకుంటే వేపకాయ !
వెలుగు చీకట్ల సమ్మిళితం కాలం.
ఊహాపోహల కలగలపు జీవితం
అసలు సృష్టి రహస్యమే ద్వంద్వం.
వెలుగు విలువ చీకటి మూలాన
బ్రదుకు అందం అపోహవీడిన సమయాన !

---

# వెల్లికిల పడ్డాను !

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

వెల్లికిల పడ్డాను !
ఎక్కడ ?
ఆరుబయట చిమ్మచీకట్లో!
ఎందుకు ?
అంతకంటే చేసేదిలేక —
ఆరోజు పొద్దు పొడిచింది.
ఆరోజు మాత్రమేనా ? — రోజూ !
దావి తీరే అంత !
ప్రొద్దు పొడుపుతో గుండెల్ని గుబులు తొలిచింది.
బ్రదుకు పోరే యింత!

గుండెల్లో గుబులా ! ఎందుకు ?
ఆరోజు గడవడమెలా ? — అని.
రోజు గడవడమా ? ఎందుకు గడవదు ?
రోజు గడవకుండా ఎప్పుడాగింది ?
పోనీ ఎవరికోసం ఆగింది ? —
నీకోసం ఆగడానికి!
అదీ నిజమే ! —

ఆరోజు గడచిపోయింది.
అందుకే వెల్లికిలపడ్డాను !
ఆరుబయట వెల్లికిలపడి
అనంతాకాశాన్ని విలోకిస్తుంటే

ఆరబోసినట్లున్న రతనాలు
అనంతాకాశాన తారకలు !

అనుక్షణం నా మానసాకాశాన
ఆవిర్భవిస్తున్న అనంత కోటి కోరికలు !

ఆ రతనాలు అందవు
ఈ కోరికలు తీరవు !
అందని తారకలను, తీరని కోరికలను

తీరికగా తీర్చి మూటగట్టి
తలక్రిందికి దిండుగా చక్కదిద్ది
ఆలోచనా ప్రవంతికి అడ్డుకట్టలు తెంపితే —

మళ్ళీ వినీల గగన సదృశ మహాంభోనిధి
సహజ గంభీరంగా సాక్షాత్కరించింది.
ఆ మహాంభోనిధిని మహోత్తుంగ తరంగాలు
నా హృదయాంబుధిని కోర్కెల విస్ఫులింగాలు

ఆ తరంగాలు ఆగవు !
ఈ కోర్కెలు సాగవు !
నేను సామాన్యుణ్ణి !
అందుకే వెల్లికిల పడ్డాను !

# నేనం??

"సత్యప్రభ"

నిప్పును మింగేయాలని కసి వచ్చింది.
కానీ— అదే నన్ను మింగేసి తనలో కలిపేసుకుంది.
నీటిని మసి చేయాలని ఆవేశం తెచ్చుకున్నా,
ఈలోపు నేనే మసిగామారి దానిలో కరిగిపోయా.
నింగికి హద్దులు వెతకాలని ఆశపడ్డాను,
నా ఆశ నిరాశగామారి నన్ను చూసి కిసుక్కున నవ్వింది.
కాలానికి కళ్ళెం వేయాలని కలలు కన్నాను,
నా కలలు కన్నీటిగా మారాయి, అవి ఫలించకముందే
నేనేమో కాలగర్భంలో కలిసిపోయా.
అయినా—పేదవాడి కన్నీళ్ళు కాలానికి కళ్ళెం వేస్తాయా ?
దిక్కుల్ని కలిపేయాలని వెర్రి ఊహపుట్టింది
ఆ ఊహ ఊహగానే మిగిలి నన్ను వెక్కిరించింది.

గాలిని బంధించయాలని పాశాన్ని అల్లాను
అంతకుముందే యమపాశం నన్ను చుట్టేసింది.
మనస్సును గుచ్చి గుచ్చి చూడాలని కళ్ళుచించుకున్నాను.
నేను చూడకముందే అది చంద్రుణ్ని చేరిపోయింది.
ఆత్మను చంపేయాలని అనుకోబోయా... ...
అంతలో 'నేను' ఉన్నాననిపించింది.

నాకేం చేయాలో తెలీలేదు
ఏంచేయటానికీ అశక్తుణ్ణి

మిధ్యా జగత్తులో — అద్వైతపు వీథుల్లో
చిక్కని చీకట్లో — నిశ్శబ్దపు అగాధాల్లో
అనంత శూన్యంలో
'నేను' నేనుగా మిగిలిపోయా.

శ్రీ కాకుమాను తారానాథ్

# డాక్టరు. భీమారావ్ అంబేద్కర్

(చిరుత్రప్రాయంలో అనేక అవమానాలకు, బాధలకు గురియైన ఒక వ్యధిత హృదయం సామాజిక అసమానతను కూకటి వ్రేళ్లతో పెకలించేందుకు నడుంకట్టింది. సమాజంలోని అట్టడుగు వ్యక్తులను మహావీరులుగా తయారుచేసింది. మహోద్యమాలను నడిపించింది. స్వాతంత్ర్య సంపాదనానంతరము, ఈ దేశపు రాజ్యాంగ రచనా భారాన్నంతా మోసింది. హిందూధర్మ సరిధులను విస్తరింప జేసి, మూఢ హిందూ సమాజానికి, "షాక్"నే కాక వెలుగును కూడా ప్రసాదించింది. అదే వ్యధిత హృదయపు బాధాపూరిత జ్వాలల భగభగల్లో, సరిగ్గా అర్ధశతాబ్దికి పూర్వం "మనుస్మృతి" దగ్ధం చేయబడింది. ఆ అభినవ మనువు డాక్టర్. భీమారావ్ అంబేద్కర్ జీవితంలోని కొన్ని ఘట్టాల నిక్కడ పరామర్శించటం జరుగుతున్నది.)

లోకమాన్య తిలక్, కార్వే, పరంజపే మొదలైనవారిని కన్న కొంకణ ప్రాంతంలోని రత్నగిరి జిల్లాలో, మందనగాడ్ పట్టణానికి దగ్గరున్న అంబావాడెకి చెందినవారు సక్‌పాల్ వంశస్థులు. అస్పృశ్యులుగా ఎంచబడే మెహర్ కులానికి చెందిన రాంజీ సక్‌పాల్, భీమాబాయి దంపతుల 14వ సంతానమే భీమారావు 1891 ఏప్రిల్ 14వ తేదీన జన్మించాడు. రిటైరయిన తరువాత తండ్రి సతారా చేరాడు. కొద్దిరోజులకే తల్లి మరణించింది. అప్పటికి భీమారావ్ వయస్సు ఆరుసంవత్సరాలు మాత్రమే.

రాంజీ తన సంతానాన్ని చాలా శిక్షణతో పెంచాడు. ప్రతి దినమూ రామాయణ, మహాభారతాలు, మోరోపంత్, ముక్తేశ్వర్, తుకారాంల భజన గీతాలు పిల్లలు వినవలసిందే. రాంజీకి మద్యం గిట్టదు. శాకాహారి.

రెండు మూడు సంఘటనలు, భీముని చిరుతహృదయంమీద చెరగని ముద్రలువేశాయి. పాఠశాలలో చదివే రోజుల్లో, భీమారావ్, అన్న, మేనల్లుళ్లతో కలిసి, వాళ్ల ఇంటికి నడివేసవిలో బయలు దేరారు. వీళ్ల ఉత్తరం చేరక, మామ స్టేషనుకు రాలేదు. చాలా సేపు చూచి, ఒక బండివానిని బ్రతిమిలాడి, గోరేగాముకు బయలు దేరారు. దారిలో వీళ్ళు మెహర్ కులానికి చెందినవారని తెలిసిన బండివాడు మొహాయించి దిగిపొమ్మన్నాడు. అతనిని బ్రతిమిలాడి, ఇబ్బడిమొత్తం మిచ్చేటట్లు, భీమారావ్ అన్న బండి తోలేటట్లు, బండి అతను క్రిందనే నడిచేటట్లు అంగీకారం కుదిరింది. సాయంకాలంనుంచి అర్ధరాత్రిదాకా దప్పికతో బాధపడుతూ, ఈ పిల్లలు ప్రయాణం చేయవలసి వచ్చింది. దారిలో ఎవ్వరూ మెహర్‌లకు మంచినీళ్లివ్వరు. తరువాత ఒకసారి భీమారావ్ రోడ్డుమీద పంపులో మంచినీరు త్రాగుతుంటే, అతని కులం తెలుసుకుని దేహశుద్ధి చేశారు. ఈ రెండు సంఘటనలతో భీమారావ్‌కు కులమంటే ఏమిటో, తన కులమేమిటో అర్ధమయింది.

తరువాత రాంజీ బొంబాయి రావటం, భీమారావ్ మరాఠా హైస్కూలు, ఎల్ఫిన్‌స్టన్ హైస్కూలులలో జేరటం జరిగింది. అధ్యాపకులు సంస్కృత తరగతిలో ప్రవేశాన్ని నిషేధించడంతో, తమకిష్టం లేకపోయినా పర్షియన్ చదవవలసి వచ్చింది. మెట్రిక్యులేషన్ పరీక్ష పాసు కావటంతోనే, 16వ ఏట వివాహం జరిగింది. ఇంటర్ చదువుకు ఎల్ఫిన్‌స్టన్ కళాశాలలో జేరాడు. ఆ ప్రాంతంలోనే, 1906లో, ఆక్స్‌ఫర్డ్‌లో చదువు ముగించుకు వచ్చిన కర్మవీర్ వి. ఆర్. షిండే డిప్రెస్డ్ క్లాసెస్ మిషన్ ఆఫ్ ఇండియాను స్థాపించాడు. ఇంటర్ పరీక్షలలో నెగ్గినా ఆర్థిక దుస్థితివలన చదువు ఆగిపోయే పరిస్థితి ఏర్పడింది. బరోడా మహారాజా శాయాజీరావ్ గైక్వాడ్ నెలకు 25 రూపాయలు ఉపకార వేతన మిచ్చాడు. ఈవిధంగా 1912లో బి. ఎ. పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు.

ఒక్క పదిహేను రోజులు బరోడా స్టేట్‌లో ఉద్యోగం చేయటంతోనే, తండ్రి అనారోగ్య వార్తతో తిరిగి వచ్చేటప్పటికి తండ్రి ప్రాణం విడిచాడు. అయినా అంబేద్కర్‌లోని విద్యాపేక్ష, జ్ఞానతృష్ణ తిరిగి అతనిని ఉద్యోగంలో చేరనీయలేదు. అప్పుడే బరోడా మహారాజా కొంతమంది విద్యార్థులను విదేశాలకు పంప బోతున్నట్లు తెలిసి, మహారాజాను కలిసి తన కోరిక తెలుపుకున్నాడు. అలా సంపాదించిన సహకారంతో, తిరిగి వచ్చిన తరువాత పది సంవత్సరాలు బరోడా రాజ్యంలో పనిచేసే షరతుతో, 1913 జులైలో న్యూయార్కు చేరాడు. కొలంబియా విశ్వవిద్యాలయ విద్యార్థి అయ్యాడు.

అక్కడ కాలాన్ని ఎంతమాత్రం వృధాచేయకుండా రోజుకు 18 గంటలు పనిచేయసాగాడు. 1915లో ఎం. ఎ. డిగ్రీని, 1916లో పి. హెచ్. డి డిగ్రీని సంపాదించాడు. ఎనిమిది సంవత్సరాల తరువాత ఈ వ్యాసం "ది ఇవల్యూషన్ ఆఫ్ ప్రావిన్షియల్ ఫయినాన్స్ ఇన్ ఇండియా" అనే పేరుతో, ప్రకటించబడి, బరోడా మహారాజాకు అంకితమీయబడింది.

కొలంబియా విశ్వ విద్యాలయం నుంచి తనదృష్టిని లండన్ వైపు మరల్చాడు. 1916 జూన్‌లో లండన్‌చేరి "లా" లోనూ, 'లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ పొలిటికల్ సైన్సు' లో

ఎకనమిక్స్ చదివేందుకు ప్రారంభించాడు. 'డాక్టర్ ఆఫ్ సైన్సెస్' కోసం శ్రమించటం మొదలు పెట్టాడు. కాని ఇంతలోకే స్కాలర్ షిప్ అయిపోయినందువలన తిరిగి రావలసి వచ్చింది. అంబేద్కర్ విద్యా తృష్ణకు ఇది పెద్ద దెబ్బ. కాని ప్రొ. ఎడ్విన్ కానన్ యొక్క సిఫార్సుతో నాలుగు సంవత్సరాలలోగా తిరిగి వచ్చి చదువు పూర్తి చేసే షరతుతో అనుమతి సంపాదించి, 1917 ఏప్రిల్‌లో 'డాక్టర్ అంబేద్కర్' బొంబాయి తిరిగి వచ్చాడు. ఆ రోజుల్లో ఒక మహర్ విద్యార్థి 26 సంవత్సరాల వయస్సులో విదేశీ డిగ్రీతో రావటం నిజంగా అపూర్వ సంఘటనే.

మొదటి షరతు ప్రకారం మహరాజా మిలిటరీ కార్యదర్శిగా నియమింపబడ్డాడు. తిరిగి ఆయనను నాటి సమాజం వేలెత్తి చూపసాగింది. జవానులు కూడా ఆఫీసుకాగితాలను ఎత్తిపడేశేవారు, ఆయనకు ఆఫీసులో త్రాగటానికి నీరు లభ్యమయ్యేదికాదు, ఉండేందుకు నివాసం లేదు. ఈపరిస్థితులలో 1917 సంవత్సరాంతానికి తిరిగి బొంబాయి చేరుకున్నాడు.

1918 మార్చి చివరి వారంలో, బొంబాయిలో, డిప్రెస్‌డ్ క్లాసెస్ మిషను సొసైటీ ఆధ్వర్యాన మొదటి అఖిల భారత సమావేశం జరిగింది. బరోడా మహారాజా శాయాజీరావ్ గైక్వాడ్ దాని కధ్యక్షత వహించాడు. కాని అంబేద్కర్ దీనికి దూరంగా ఉన్నాడు. ఇక జీవనం సంగతి ఏమిటి? పార్శీ విద్యార్థులకు ట్యూటర్‌గానూ, ఒక పార్శీ పెద్దమనిషికి ఉత్తర ప్రత్యుత్తరాలు, లెక్కలు చూసి పెట్టటం వగైరాలతో కాలక్షేపం మొదలయింది. 1918 నవంబరులో సిండెహామ్ కాలేజి ఆఫ్ కామర్సు అండ్ ఎకనమిక్సులో అర్థిక శాస్త్రాచార్యుడుగా జేరాడు.

ఈ రోజులలో ఇంకో మహాపురుషుడు, కొల్హాపూర్ మహారాజా, సాహూ మహరాజ్‌తో పరిచయ మేర్పడింది. ఆ రోజులలో అస్పృశ్యతా నిరోధానికి తీవ్ర కృషి చేస్తున్నవారిలో మహారాష్ట్రలో ఈయన అగ్రగణ్యుడు. అస్పృశ్యులను తన సిబ్బందిగా నియమించటం, న్యాయవాదులుగా పనిచేసేందుకు సనదు లివ్వటం, వారి విద్యాభివృద్ధికి తీవ్రమైన కృషి చేయటం ఆయన కార్యక్రమాలు. మహారాజా పట్టపు ఏనుగు మావటీడు హరిజనుడు.

మహారాజా సహాయంతో 1920 జనవరిలో 'మూకనాయక్' అనే పేరుతో ఒక పక్ష పత్రికను స్థాపించాడు. సంపాదకుడుగా అంబేద్కర్ పేరైతే లేదుగాని దాని స్ఫూర్తి ప్రదాత ఆయనే.

ఈ పరిస్థితులలో 1920 మేలో నాగపూర్‌లో సాహూ మహరాజ్ అధ్యక్షతన ఒక అఖిల భారత సమావేశం జరిగింది. ఇది హరిజనులచేతనే ఏర్పాటుచేయబడిన సమావేశము. సవర్ణహిందువుల చేత స్థాపింపబడిన ఏ సంస్థ అయినాసరే, హరిజనుల మనస్సును గ్రహించలేదని అంబేద్కర్ అభిప్రాయము. అతికష్టంమీద తాను జన్మించిన మహర్‌లలో గల పద్దెనిమిది శాఖల వారందరి మధ్యా సహపంక్తి భోజనాన్ని ఏర్పాటు చేయగలిగాడు. ఆరోజు లలాంటివి!

ఈ రోజులలో అంబేద్కర్ గృహజీవితం కష్టాలతో నిండి వుంది. భార్య రమాబాయి పరమ సాధ్వి, భక్తురాలు. చనిపోయిన బావగారి కుటుంబ బాధ్యతకూడా అంబేద్కర్ దంపతులదే. ఆయన అమెరికాలో ఉన్నప్పుడు ఒక కుమారుడు రమేష్ జన్మించటం, మరణించటం జరిగింది. తిరిగి వచ్చిన తరువాత, రెండవ కుమారుడు గంగాధరుడు అలాగే అయ్యాడు. మూడవ కుమారుడు యశ్వంత్ కూడా అనారోగ్యంతో బాధపడుతున్నాడు.

ఈ పరిస్థితులలో సాహూ మహారాజ్‌వద్ద 5000 రూపాయలు అప్పు తీసుకుని 1920 జులైలో తిరిగి అంబేద్కర్ లండన్ బయలుదేరాడు. సెప్టెంబరు నుంచి లండన్ మ్యూజియంలో తీవ్ర అధ్యయనం ప్రారంభమయింది. 1921 జూన్‌లో ఎం. యస్. సి. డిగ్రీని సంపాదించి, 1922 అక్టోబరులో యింకొక పరిశోధనా వ్యాసం ''ది ప్రాబ్లెమ్ ఆఫ్ ది రుపీ'' లండన్ విశ్వ విద్యాలయానికి సమర్పించాడు. న్యాయశాస్త్రంలో పట్టా లభ్యమయింది. తరువాత జర్మనీలోని బాన్ విశ్వ విద్యాలయంలో ఒక సంవత్సరం చదివాడు. పరిశోధనా వ్యాసంలోని భాష, భావాలు లండన్ ప్రభువులకు నచ్చలేదు. కుటుంబ పరిస్థితులూ అంతంత మాత్రంగా ఉండటంతో 1923 ఏప్రిల్‌లో తిరిగి బొంబాయి వచ్చేశాడు. తిరిగి తన వ్యాసాన్ని లండన్ విశ్వ విద్యాలయానికి సమర్పిస్తే వారు 'డాక్టర్ ఆఫ్ సైన్సు' ప్రధానం చేశారు. 1923 డిశంబరులో దీనినికూడా కొలంబియా వ్యాసాన్ని ప్రచురించిన లండన్ సంస్థ పి.యస్. కింగ్ అండ్ సన్స్ వారే ప్రచురించారు.

ఈ విధంగా 32సంవత్సరాల అంబేద్కర్ బార్–ఎట్–లా, కొలంబియా విశ్వ విద్యాలయపు పి. హెచ్‌డి, లండన్ విశ్వ విద్యాలయపు డి. యస్‌సి. మరియు బాన్ విశ్వ విద్యాలయపు విద్యార్థి. అయినా ఈ దేశంలో అస్పృశ్యుడు, ఆఫీసుల్లో జవానులు కూడా గౌరవించరు, సహాధ్యాయులు సరేసరి.

అంబేద్కర్ జీవితంలోని ప్రథమ ఘట్టమిది.

## 2

యస్. కె. బోలె ప్రముఖ సాంఘిక సంస్కర్త, బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు. ఆర్యసమాజికుల అధ్వర్యాన జరిగిన వర్ణాంతర సహపంక్తి భోజనంలో పాల్గొన్నందుకు తన భండారీ కులస్థులు బహిష్కరిస్తామన్నా జంకని ధీరుడు. ఇది జరిగింది 1906 లో. 1923 ఆగష్టు 4 న ఆయన కౌన్సిల్‌లో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. ఏమని ? అస్పృశ్యులు కూడా బహిరంగ స్థలాలలోని మంచినీటి సౌకర్యాలను, బావులను,ధర్మశాలలను, పాఠశాలలను, న్యాయస్థానాలను, ఔషధాలయాలను వాడుకోవచ్చుని. ఈ తీర్మానానికే సంతోషించిన దళిత వర్గాలు ఆనాడు బోలెకు సన్మానం జరిపి ఒక బంగారు పతకాన్ని బహూకరించారు.

1924 సంవత్సరము ఈ దేశపు సంస్కరణోద్యమంలో చాలా ప్రాముఖ్యం కలిగినది. అండమాన్‌లో పన్నెండు సంవత్సరాలు కఠిన నరకాన్ని అనుభవించిన తరువాత విడుదల పొందిన వీరసావర్కార్, 1924 జనవరిలో మహారాష్ట్రలోని రత్నగిరిలో నిర్బంధవాసానికి వచ్చాడు. 1924 ఫిబ్రవరిలోనే మహాత్మాగాంధీ విడుదలయ్యారు. అనారోగ్యకారణంగా ఈ విడుదల జరిగింది. రాజకీయాలలోపాల్గొన కూడదని ఆంక్ష ఉండటంతో తన దృష్టిని పూర్తిగా సాంఘిక సంస్కరణవైపు మరల్చాడు సావర్కార్. గాంధీజీ కూడా ఈ సమస్యను గురించి ఆలోచించసాగాడు. అంబేద్కర్ కూడా ఈ సమస్యను ఒక ఉద్యమంగా రూపొందించటానికి ఆలోచనలు మొదలు పెట్టాడు.

దానికి ప్రారంభంగా 1924 మార్చిలో బొంబాయిలో ఒక సమావేశం జరిపాడు. దాని నిర్ణయాల అనుసారంగా జులైలో 'బహిష్కృత హితకారిణి సభ' రిజిష్టరు అయింది. దానికి సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ అధ్యక్షుడైతే, అంబేద్కర్ మేనేజింగు కమిటీ అధ్యక్షుడు. 1925 లో షోలాపూర్‌లో దళిత వర్గాల విద్యార్థుల కొక హాస్టలును స్థాపించారు. సభ మార్గదర్శకత్వంతో విద్యార్థులకు 'సరస్వతీ విలాస' మనే మాస పత్రిక ప్రారంభించారు.

రామస్వామి నాయకర్ అధ్వర్యాన తిరువాన్కూర్‌లోని వైకంలో హరిజనులకు నిషేధింపబడిన ఒక రోడ్డు ఉపయోగానికై సత్యాగ్రహం జరిపి దానిని సాధించారు అక్కడివారు. 1926 లో మద్రాసులో మురుగేశన్ అనే ఒక అస్పృశ్యుడు తెగించి ఒక హిందూ దేవాలయంలోనికి జొరబడితే, అతనిని దేవాలయాన్ని అపవిత్రం చేశాడనే నేరారోపణతో శిక్షించటం జరిగింది. అప్పుడే జరిగిన ఇంకొక సంఘటనతో న్యాయవాదిగా అంబేద్కర్ ప్రతిష్ఠ పెరిగింది. బ్రాహ్మణులే దేశాన్ని నాశనం చేశారని ఒక కరపత్రాన్ని ప్రచురించి నందుకుగాను, పూనాలోని బ్రాహ్మణులు, ముగ్గురు బ్రాహ్మణేతర నాయకులు బాగ్డే, కేశవరావ్‌జాదవ్, దినకరరావు జవాల్కర్‌లమీద కేసు పెట్టారు. యల్. బి. భోపత్కర్ వారి న్యాయవాది. పూనా సెషన్స్ జడ్జి ముందు దానిలో వాదించి తన క్లయింట్లను బయట వేశాడు. దానితో అంబేద్కర్ పేరు ప్రతిష్ఠలు పెరిగాయి.

బోలే తీర్మానం ప్రకారం మహద్ పురపాలక సంఘం పట్టణంలోని చౌదరీ చెరువును హరిజనుల ఉపయోగానికి అనుమతిస్తూ తీర్మానించింది. అయితే అది తీర్మానంగానే ఉండిపోయింది. ఈ పరిస్థితులలో కొలాబాజిల్లా దళితవర్గాల మహాసభలు 1927లో మహద్‌లో మార్చి 19, 20 లలో జరగాలని నిశ్చయింపబడింది. భారీ ప్రయత్నాలు చేశారు. మహారాష్ట్ర, గుజరాత్‌లనుండి సుమారు పదివేలమంది ప్రజలు, అనేకమంది నాయకులు హాజరయ్యారు. మొదటిరోజు కొంతమంది సవర్ణ హిందూ నాయకులు కూడా హాజరై, అనేక తీర్మానాలను బలపరుస్తూ మాట్లాడారు. ఆ రాత్రి విషయ నిర్ణయ సంఘ సమావేశంలో, మరుసటిరోజున, పురపాలక సంఘ తీర్మానం ప్రకారం చౌదరీ చెరువులోని నీరును తీసుకోవాలని నిర్ణయించారు.

మార్చి 20 తేదీన అంబేద్కర్ నాయకత్వంక్రింద, సభా సదులంతా నాల్గువరసలలో, చెరువువైపు బయలుదేరారు. అది నిజంగా దేశ చరిత్రలోనే అపూర్వదృశ్యము. దేశంలో అనేక రాజకీయ ఉద్యమాలు నడిచాయి, ఊరేగింపులూ జరిగాయి, కాని సాంఘిక సమానతకోసము ఇంత భారీఎత్తున, ఇలాంటి ధృఢ నిశ్చయంతో, అలాంటి నేతృత్వంక్రింద జరిగిన మొదటి ఊరేగింపు బహుశా అదేనేమో! అంబేద్కర్ చెరువునుంచి నీరు తీసుకున్నాడు, తరువాత పదివేలజనమూ ఆ చెరువునుంచి నీరు స్వీకరించారు. తరువాత అంతా తిరిగి తమ సభాస్థలికి చేరారు సభాస్థలి పేరు స్థానిక దైవము వీరేశ్వరుని పేరే, ''వీరేశ్వరనగర్.''

కాని ఒక గంటలో సభాసదులు, వీరేశ్వరాలయంలోనికికూడా ప్రవేశించబోతున్నారని ఒక పుకారు పట్టణంలో వ్యాపించింది. దానితో ఉద్రిక్తులైన కొంతమంది కర్రలతో సభాస్థలి వీరేశ్వర నగర్‌మీద దండయాత్ర చేశారు. అప్పటికే చాలామంది సభాస్థలిని వదిలివేయటం జరిగింది. ఉన్న కొద్దిమందిని కొట్టడం జరిగింది. ఈ వార్త దావానంలా పట్టణంలో వ్యాపించింది. అంబేద్కర్ ఉంటున్న రహదారి బంగాళా దగ్గరకు వందమంది ప్రతినిధులుదాకా జేరి తమ నాయకుని ఆజ్ఞకోసం వేచి ఉన్నారు. సాయంకాలం 4 గంటలకు పోలీసువారు కూడా వచ్చారు. పట్టణాన్ని అదుపు ఆజ్ఞలలోకి తెస్తే, తనవారిని తాను శాంతి పరుస్తానని మాట ఇచ్చాడు. ఈ అవాంఛిత సంఘటన వలన 23మార్చిదాకా పట్టణంలోనే ఉండి, తన విచారణ పూర్తిచేసుకుని తిరిగి బొంబాయి వెళ్లిపోయాడు అంబేద్కర్.

ఈ దాడి జరిపినవారిలో అయిదుగురికి జూన్‌లో నాలుగు మాసాల కఠినశిక్ష విధింపబడిందనేది తరువాత సంగతి.

ఈ సంఘటన అంబేద్కర్ జీవితాన్ని, ఆయన దృక్కోణాన్ని, భారతజాతి భవిష్యత్ చరిత్రనే మార్చివేసిన మహత్తర ఘటన అయింది. బెంగాల్ విభజన, సూరత్ కాంగ్రెసులో లోకమాన్యుని పాత్ర, సావర్కార్ సాగించిన మొదటి విదేశీ వస్త్ర దహనకాండ, ముజఫర్‌పూర్‌లో ఖుదీరాంబోస్ విసిరిన బాంబు, గాంధీ దండి యాత్ర—ఈ సంఘటనలు దేశచరిత్రలో ఎలాంటి ప్రభావాన్ని కలిగించాయో, సాంఘికరంగంలో వీటన్నింటికన్నా మిన్నయైన ప్రభావాన్ని ఈ సంఘటన కలిగించిందంటాడు అంబేద్కర్ చరిత్రకారుడు ధనంజయకీర్.

బొంబాయి రాష్ట్రంలోని గ్రామగ్రామాన, బోలె తీర్మానాన్ని అమలు జరిపి తీరాలని సభలు జరిగాయి. పూనాలోని బహిరంగ సభలో ప్రముఖ న్యాయవాది యల్. బి. భోపత్కర్ ప్రసంగించాడు. ముస్లింలు, క్రైస్తవులు తాకితే అంటుపడని మహద్ చెరువును, ఆ పట్టణంలోని సవర్ణ హిందువులు, అంబేద్కర్ ఆయన అనుయాయులు మైలపరచిన పాపానికి గోమయము, గోమూత్రాలతో శుద్ధిచేశారు.

ఈ సమయంలో తన దృక్పథాన్ని వివరించేందుకు ఒక పత్రిక అవశ్యకత ఎంతైనా ఉందని గుర్తించిన అంబేద్కర్ 1927 ఏప్రిల్‌లో "బహిష్కృత భారతి" అనే మరాఠీ పక్ష పత్రికను ప్రారంభించాడు. జులైలో ఆ పత్రికలో ఒక సంపాదకీయం వ్రాస్తూ, తిలక్ గనుక అస్పృశ్యుడుగా జన్మించి ఉండి వట్లయితే "స్వరాజ్యం నా జన్మహక్కని అనిఉండడు, అస్పృశ్యతా నివారణే నా ధ్యేయం, నా జన్మహక్కని ప్రకటించి" ఉండేవాడని వ్రాశాడంటే, అంబేద్కర్ ఎంతగా చలించాడో మన కర్ధమవుతుంది.

1927లో ఛత్రపతి శివాజీ మహారాజు త్రిశత జన్మ జయంతి ఉత్సవాలు మహారాష్ట్రమంతా జరుపబడ్డాయి. కొలాబా జిల్లాలోని బదలాపూర్‌లో జరిగే ఉత్సవాలకు, అంబేద్కర్‌ను సాదరంగా ఆహ్వానించాడు బ్రాహ్మణుడైన పలాయశాస్త్రి. ఆ ఉత్సవాలలో ప్రసంగిస్తూ—పీష్వాల సామ్రాజ్య పతనానికి ముఖ్యకారణము వారు అస్పృశ్యతను పాటించటమేనని స్పష్టం చేశారు.

మహద్ చెరువును శుద్ధి చేశారన్న వార్త అంబేద్కర్ హృదయాన్ని కెలుకుతూ ఉంది. మతంకోసం మానవులా, లేక మానవులకోసం మతమా అన్న ప్రశ్నను ప్రజల ముందుంచుతూ, తమను పట్టించుకోని హిందూమతంలో తాము భాగమా కాదా అన్నదే తమ ప్రశ్న అన్నాడు. ఇంతలో చెరువును అందరూ ఉపయోగించుకోవచ్చు అన్న తమ తీర్మానాన్ని మహద్ పురపాలక సంఘము 1927 ఆగస్టులో ఉపసంహరించుకుంది. ఇది అంబేద్కర్‌కు ఒక ఛాలెంజి. గీతా సిద్ధాంతాన్ని ఆమోదిస్తూ, అంతిమాశయం ధర్మబద్ధమైనపుడు తాము జరిపే సమరంకూడా ధర్మయుక్తమవుతుందనీ, డిసెంబరులో సత్యాగ్రహానికి పూనుకుంటామనీ ప్రకటించాడు. ఇతరుల మనస్సుకు బాధ కలిగించటమే హింస అయితే, గాంధీజీ సత్యాగ్రహం కూడా హింసావాదమే నన్నాడు. నిజమైన సిద్ధాంత మేమిటంటే "ది లా షుడ్ బి నాన్‌వయలెన్స్ వెనెవర్ పాసిబల్; వయలెన్స్ వెనెవర్ నెససరీ" అంటాడు. అస్పృశ్యత అనేది అస్పృశ్యులను, హిందువులనూ, చివరకు జాతినంతనూ నాశనం చేసిందంటాడు.

ఈ రోజులలోనే లోకమాన్యతిలక్ కుమారుడు శ్రీధరపంత్ తిలక్‌తో అంబేద్కర్‌కు స్నేహం ఏర్పడింది. శ్రీధరపంత్, తిలక్ యొక్క గైక్వాడ్‌వాడ లోని ఒక సమావేశంలో అస్పృశ్యబాలకుల భజనలు ఏర్పాటు చేశాడు. అంబేద్కర్‌ను స్వయంగా ఆహ్వానించి తేనేటివిందు ఏర్పాటుచేశాడు.

మహద్ సత్యాగ్రహంతో పాటే, అమరావతి లోని అంబాదేవి ఆలయప్రవేశానికి నిశ్చయించారు. ఆ దేవాలయ ధర్మకర్తలకు నోటీసిస్తే, ఎన్నాళ్ళబట్టో వస్తున్న ఆచారాన్ని ధిక్కరించలేమని వారు ఆగష్టు 21న సమాధానం వ్రాశారు. ఆ సందర్భంలో అంబేద్కర్ నవంబరులో అమరావతిపోయి ఒక బహిరంగసభలో ప్రసంగించాడు. ఆసభలో స్పష్టంగా ఈవిధంగా ప్రకటిస్తాడు: "హిందుత్వమనేది ఎంత సవర్ణహిందువుల సొత్తో, అంతా అస్పృశులని పిలువబడే హిందువులసొత్తుకూడా. ఈ భావనకు అస్పృశ్యులైన వాల్మీకి, చొక్కామేళుడు, రోహిదాసుడు, బ్రాహ్మణుడైన వశిష్ఠుడు, క్షత్రియుడైన కృష్ణుడు, వైశ్యుడైన హర్షుడు, శూద్రుడైన తుకారాం అంతా దోహదకారులే......ఈ తర్పణ ఫలితమైన హిందూత్వ భావన, ఆ భావనాఫలితంగా నిర్మించబడిన ఈ దేవాలయమూ, అందరికీ అందుబాటులో ఉండాల్సిందే." అంబాదేవి దేవాలయ ధర్మకర్తల అధ్యక్షుడైన ఖపర్డే విజ్ఞప్తి మీద ఈ ఉద్యమాన్ని మూడునెలల వరకు వాయిదా వేయటానికి, ఎట్టకేలకు, ఈసమావేశం అంగీకరిస్తుంది.

ఈలోపుగా మహద్‌హిందువులు వీరేశ్వరదేవాలయంలో సమావేశమై సమాలోచనలు జరిపి, అంబేద్కర్, ఆయన అనుయాయుల మీద కోర్టులో దావావేసి, చెరువులో ప్రవేశించకుండా ఇంజక్షన్ ఆర్డరు పొందుతారు. ఈవిధంగా అంబేద్కర్‌కు ఇప్పుడు న్యాయస్థానాలలోకూడా పోరాడవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఇది జరిగింది డిసెంబరు 14న.

ఒకవైపున మహద్‌లో సభకై ఏర్పాట్లన్నీ ప్రారంభమయాయి. ఒక ముస్లింకుచెందిన స్థలంలో సభాస్థలి ఏర్పాటు చేయబడింది. అవసరమైన సంబారాలన్నీ బయటినుంచి తీసుకు రాబడ్డాయి. ప్రతినిధులు, ప్రేక్షకులు తండోపతండాలుగా రాసాగారు. రెండువందలమంది అనుయాయులతో, మహద్‌కు అయిదుమైళ్లలో గల దాసగావ్‌లో దిగిన అంబేద్కర్‌కు ఘన స్వాగతం లభించింది. మూడువేలమందితో కూడిన ఆ ఊరేగింపు, 'శివాజీ మహరాజ్‌కు జై' అనే నినాదంతో సభాస్థలిలో ప్రవేశించింది. సాయంకాలం 4న్నరకు సభప్రారంభమయింది.

అనేక తీర్మానాలు ఆమోదింపబడ్డాయి. కాని అన్నిటిలో అతి ముఖ్యమైనది 'మనుస్మృతి' మీద దండయాత్ర. శూద్రులు వేదాన్ని చదివినా, విన్నా సీసంపోయాలన్న ఆ గ్రంథంమీద తీవ్ర విమర్శలు చేయబడ్డాయి. సహస్రబుధే, రాజభోజ్, ఖొరాట్ లు తమ ప్రసంగాలలో నిప్పులు కురిపించారు. సభాసదులలో ఆవేశం తారాస్థాయికి చేరింది. కేవలం ఉపన్యాసాలతో తృప్తిపడకుండా, సభాప్రాంగణం ముందు రాత్రి 9గంటలకు 'మనుస్మృతి' నుంచి దానిని దహించారు.

ఇలా, డిసెంబరు 25, 1927 ఈ దేశపు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన రోజు. హిందూధర్మానికి అధునాతన మనువుగా రూపొందే అంబేద్కర్, సరిగ్గా నేటికి అర్ధశతాబ్ది ముందు 'మనుస్మృతి'ని దహించాడు. సవర్ణహిందూ భారత ఈవార్తతో మొదలంటా చలించిపోయింది.

మరుసటి రోజు తిరిగి సభ జరిగింది. దానిలో చెరువు విషయమై ప్రసంగాలు, సత్యాగ్రహం విషయం చర్చించబడింది. పన్నెండుమంది నాయకులు సత్యాగ్రహాన్ని సమర్థిస్తే, కేవలం నల్గురు వ్యతిరేకించారు. మధ్యాహ్న సమయానికి మహారాష్ట్ర

బ్రాహ్మణ నాయకులు, జేధే, జవాల్కర్‌లు సభాస్థలికి వచ్చేసారు. వారుకూడా సత్యాగ్రహాన్ని సమర్థించారు. సత్యాగ్రహానికి వాలంటీర్ల పేర్లను నమోదుచేసుకోవటానికి మొదలుపెడితే నాల్గు వేలపేర్లు కొద్ది సమయంలోనే నమోదు అయ్యాయి. ఈ నిర్ణయం జిల్లా మేజిస్ట్రేటుకు తెలియచేశారు.

జిల్లామేజిస్ట్రేటు లౌక్యంగా, లెజిస్లేటివ్ కౌన్సిల్ తీర్మానం ప్రకారం వారికి సర్వహక్కులూ ఉన్నా, కోర్టు ఇన్‌జక్షన్ ఉత్తరువు ఉందనీ, దానిని ఉల్లంఘించటం భావ్యం కాదనీ, గతసంవత్సరం వారిమీద దండయాత్ర జరిపిన వారు కోర్టుచేత శిక్షింపబడ్డారనీ గుర్తు చేశాడు. దీనిమీద జవాల్కర్, ఘటాగేలు సత్యాగ్రహాన్ని సమర్థించి, అయితే దానిని కొద్దిరోజులు వాయిదావేయాలని కోరారు. రాత్రి 7 గంటలదాకా ఉపన్యాసకులు మాట్లాడుతూనే ఉన్నారు.

రాత్రి ప్రముఖులంతా సమావేశమయ్యారు. దీర్ఘంగా చర్చించిన అనంతరం, సత్యాగ్రహాన్ని వాయిదా వేయాలనీ, అయితే అంతా ఊరేగింపుగా చెరువు వద్దకు నడవాలనీ తీర్మానించారు. కాని ఆవేశాలతో కుతకుత ఉడుకుతూ, సత్యాగ్రహానికి ఉవ్విళ్లూరుతున్న సభాసదులకు దీనిని వినిపించేదెవరు? ఆ బాధ్యత అంబేద్కర్‌కే అప్పగింపబడింది. మరుసటిరోజు అతినెమ్మదిగా తన ప్రసంగాన్ని ప్రారంభించి,ఎలాగోలా ప్రతినిధులను ఒప్పించగలిగాడు అంబేద్కర్. తరువాత ప్రతినిధులంతా ఊరేగింపుగా చెరువువద్దకు పోయి తిరిగి వచ్చారు. అవాంఛనీయ సంఘటనలేవీ జరగలేదు.

మహద్‌లో ఈవిధంగా సాంఘికస్వాతంత్ర్య శంఖారావాన్ని అంబేద్కర్ పూరించితే, అదే వారంలో మద్రాసులో సమావేశమైన భారత జాతీయకాంగ్రెసు స్వాతంత్ర్యాన్ని కోరుతూ తీర్మానించింది.

తరువాత 1938లో ఒక పాత్రికేయుడు టి.వి.పార్వతేతో ప్రసంగిస్తూ, అంబేద్కర్ ఇలాఅంటాడు: "మనుస్మృతి దహనం కావాలనిచేసిందే. అది ఆలోచించి తీసుకున్న తీవ్రచర్య. సవర్ణ హిందువుల దృష్టిని బలవంతాన ఆకర్షించటానికి మధ్యమధ్య అలాంటి తీవ్రచర్యలు అవసరమవుతాయి. నీవు తలుపుమీద బాదందే, ఎవ్వరూ తలుపులు తెరవరు. దీనిని బట్టి మనువు కేవలం మూర్ఖుడనీ, సాంఘికశాస్త్రవేత్త కాదనీ అనుకోగూడదు. 'మనుస్మృతి' లోని అన్నిభాగాలు నిందనీయాలు కావు........"

ఈ విధంగా అంబేద్కర్ జీవితంలోని రెండవఘట్టము, ముగిసింది.

## 3

1929లో జలగాన్‌లో జరిగిన ఒకసమావేశంలో మాట్లాడుతూ, అంబేద్కర్, ఏమతమైనా తమలను మానవులుగా భావించి అందరితో సమానంగాచూసి సమానావకాశాలు కల్పించేటట్లుంటే, దానిలో చేరండని అస్పృశ్యులకు సలహా ఇచ్చాడు. దీనిమీద నాసిక్ దగ్గరగల కొన్నికుటుంబాలు ఇస్లాంమతాన్ని స్వీకరించ దలిస్తే ఇంకా కొన్నాళ్లు ఆగిచూడండని సలహా ఇచ్చాడు.

1930 మార్చిలో మహాత్ముడు దండిసత్యాగ్రహాన్ని ప్రారంభించాడు.

దానికి సరిగ్గా పదిరోజులుముందు, అదేమాసంలో సాంఘిక స్వాతంత్ర్య సమరసత్యాగ్రహ మార్గదర్శనానికి అంగీకరించాడు అంబేద్కర్. నాసిక్‌లోని కాలారాం దేవాలయంలోని శ్రీరాముని అర్చించేందుకు తమకు అనుమతి నియ్యకపోతే సత్యాగ్రహం తప్పదన్నారు. మార్చి 2న నాసిక్‌లో సత్యాగ్రహ సమితి అధ్వర్యాన పదిహేను వేల మంది సత్యాగ్రహులు సమావేశమయ్యారు. వీరిలో అయిదువందల మంది స్త్రీలు సుమా! నాలుగుబారులు తీరి ఈ సత్యాగ్రహులు దేవాలయాన్ని సమీపించేటప్పటికి దాని తలుపులు మూసివేయబడ్డాయి. దానితో మార్చి 3నుంచి నిజమైన 'సత్యాగ్రహసమరం' ప్రారంభమయింది.

మొదటి దళము 125 మంది పురుషులు, 25 మంది స్త్రీలు నాలుగు ద్వారాల వద్దా బైఠాయించారు. భజన కార్యక్రమాలు మొదలయ్యాయి. దేవాలయం సర్వులకూ మూసివేయబడింది. సుమారు నెలరోజుల పాటి సత్యాగ్రహం సాగింది. ఇంతలో ఏప్రిల్ 9వ తేదీ వచ్చింది; శ్రీరామనవమి, రాములవారి ఊరేగింపు దినము. సరే. ఉభయులూ రథాన్ని లాగాలని ఒక రాజీ కుదిరింది. ఉభయులూ సమావేశమయ్యారు. కాని ముందే కూడబలుక్కున్న విధంగా, సవర్ణ హిందువులు గబగబా రథాన్ని లాక్కుపోయారు. తెగించి ముందుకుదూకిన భండారీ యువకుడు క్రాడేకర్ అధ్వర్యాన రథంమీద కొంతమంది ఎగబడ్డారు. దాంతో ఉభయ వర్గాలకు కొట్లాట ప్రారంభమయింది. క్రాడేకర్ దెబ్బలుతిని నేలకూలాడు. అంబేద్కర్‌కు కూడా స్వల్పంగా దెబ్బలు తగిలాయి.

ఇంత జరిగినా నాసిక్ సత్యాగ్రహం ఆగిపోలేదు. హిందూ నాయకులు డాక్టరు. మూంజీ, డాక్టరు. కుర్తకోటి శంకరాచార్యుల సలహాలు సవర్ణహిందువులకు నచ్చలేదు. బిర్లాకూడా అంబేద్కర్‌ను ఏప్రిల్‌లో చూచాడు. అయినా ఏమీ జరగలేదు. దాదాపు ఒక సంవత్సరం పాటు ఈ ప్రముఖ దేవాలయము మూసివేయబడిందంటేను, ఈ ఉద్యమం అయిదు సంవత్సరాలు 1935 అక్టోబరుదాకా సాగిందంటేను ఆ ఉద్యమ తీవ్రతను మనం అంచనా వేసుకోవచ్చు.

ఇంతలో రెండవ రౌండ్ టేబిల్ సమావేశ సన్నాహాలు దేశంలో మొదలయ్యాయి. దాని సందర్భంగా మహాత్ముని కలిశాడు అంబేద్కర్. ఈ కలయిక 1931 ఆగష్టు 14 న జరిగింది. ఆ సమావేశంలో ఏ దేశంలో లేదా ఏ మతంలో తమను కుక్కల కన్నా, పిల్లులకన్నా హీనంగా చూస్తున్నారో, ఆ దేశాన్ని గురించి తానే విధంగానూ భావించలేనని చెపుతూ, ఆవేశంతో అంబేద్కర్, "గాంధీజీ ఐ హావ్ నో హోమ్ లాండ్" అని నిష్కర్షగా అన్నాడు.

అదే మాసంలో రౌండ్ టేబిల్ సమావేశాల నిమిత్తం లండన్ చేరుకున్నాడు. అప్పటికి మహద్ సబ్‌కోర్టులో సవర్ణ హిందువులు ఓడిపోయారు. దానిమీద రాణా జిల్లాకోర్టుకు అప్పీలుకు పోయారు. తాను లండన్‌లో ఉన్నా, రాణా జిల్లా జడ్జి తీర్పును గురించే తన అనుయాయులకు ఉత్తరాలు వ్రాస్తుండేవాడు.

తిరిగి 1932 మేలో లండన్‌పోయి బ్రిటిష్ అధికారులను కలిశాడు. ఆయన బ్రిటన్‌లో ఉండగానే కమ్యూనల్ అవార్డు ప్రకటించబడింది. దాని ప్రకారం అస్పృశ్యులకు ప్రత్యేక స్థానాలు లభించాయి. దీనిమీద ఎరవాడ జైల్‌లో ఉన్న గాంధీజీ ఆమరణ నిరాహార దీక్షను ప్రకటించాడు. దేశంలో తీవ్రమైన చర్యలు ప్రారంభమయ్యాయి, అంబేద్కర్‌మీద తీవ్రమైన వ్యతిరేక ప్రచారం మొదలయింది. అయినా, ''మహాత్మాస్ హావ్ కమ్ అండ్ మహాత్మాస్ హావ్ గాన్. బట్ ది అన్‌టచబుల్స్ హావ్ రిమెయిన్డ్ ఏస్ అన్‌టచబుల్స్'' అని అతి ఘాటుగా ఒక ప్రకటన చేశాడు అంబేద్కర్. ఎట్టకేలకు అనేకమంది నాయకుల జోక్యం ఫలితంగా, దీర్ఘమైన చర్చల అనంతరం, 1932 సెప్టెంబరు 24 చరిత్ర ప్రసిద్ధిచెందిన 'పూనా పాక్ట్' మీద సంతకాలు జరిగాయి. దీనిమీద దళిత వర్గాల తరఫున అంబేద్కర్, సవర్ణ హిందువుల తరఫున పండిట్ మదనమోహన్ మాలవీయా వగైరాలు సంతకాలు పెట్టారు.

అప్పటికి 1930 లో నాసిక్‌లో అంబేద్కర్‌చేత మొదలుపెట్టబడిన సత్యాగ్రహం, 1931 నవంబరులో గురువాయూర్‌లో కేలప్పన్‌చేత మొదలు పెట్టబడిన సత్యాగ్రహమూ– రెండూ కూడా కాంగ్రెసువారిచేత నిర్లక్ష్యం చేయబడ్డాయి. దీనితో కేలప్పన్ తాను 1932 సెప్టెంబరు 21 నుంచి నిరశనవ్రతాన్ని ప్రారంభిస్తానన్నాడు. కాని దానిమీద మహాత్ముడు ఒక్క మూడు నెలలు ఆగమనీ, అనుకున్న విధంగా జరగకపోతే, తానుకూడా 1933 జనవరి 1 నుంచి కేలప్పన్‌తో కలుస్తానని బెదిరించాడు. అలాగే అంబేద్కర్ కూడా, కేలప్పన్ జీవితం చాలా విలువ కలదనీ, అది దేవాలయ ప్రవేశం కంటె అస్పృశ్యులకు చాలా విలువ కలదని అంటూ బెదిరించాడు.

1933 వచ్చింది. అయినా ఏమీ చలనం కలగలేదు. ఎవరి ఉత్సవాలలో ముస్లింలు కొన్ని హక్కులను వంశపారంపర్యంగా అనుభవిస్తున్నారో, ఆ జామొరిన్ కూడా గురువాయూర్ దేవాలయాన్ని హరిజనులకు తెరిచేందుకు అంగీకరించలేదు. గాంధీజీ పొన్నై తాలూకాలో దీని విషయంమీద అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ని తెలుసుకోవాలన్నారు. వారు సుముఖంగానే తీర్పు ఇచ్చారు. అయినా జామొరిన్ లొంగలేదు.

అప్పుడే సెంట్రల్ అసెంబ్లీలో రంగ అయ్యర్ అస్పృశ్యతా నివారణ బిల్‌ను ప్రవేశపెట్టాడు. అలాంటి బిల్లులే రాజా, గయా ప్రసాదసింగ్, బి. సి. మిత్రాల చేతకూడా ప్రవేశపెట్టబడ్డాయి. బొంబాయి కౌన్సిల్‌లో తరువాత బోలె కూడా అలాంటి బిల్లే ప్రవేశపెట్టాడు.

గాంధీజీ, తన నిరశనవ్రతాన్ని వాయిదావేస్తూ, ఈ బిల్లుల మీద గవర్నర్ జనరల్ ఏమంటాడో చూడాలని అన్నారు. ఈ పరిస్థితులలో అంబేద్కర్ 1933 జనవరి 23 న లండన్ నుంచి భారతదేశమొచ్చాడు. తరువాత ఎరవాడ జెయిల్‌లో తిరిగి గాంధీజీని కలుసుకున్నాడు.

గాంధీజీ స్థాపించిన ''హరిజన'' పత్రిక మొదటి సంచికకు, 1933 ఫిబ్రవరి 11 న ఒక సందేశమిస్తూ ఇలా చెప్పాడు :

"The outcaste is a byproduct of the caste system. There will be outcastes as long as there are castes. Nothing can emanicipate the outcaste except the destruction of caste system. Nothing can help Hindus and ensure their survival in the coming struggle except the purging of Hindu faith of this odious and vicious dogma."

ఫిబ్రవరి 12న ఎట్టకేలకు అప్పుడు తీవ్రంగా చర్చించబడుతున్న దేవాలయ ప్రవేశ బిల్లులమీద ఒక ప్రకటన చేశాడు. ''భారతీయులకూ, కుక్కలకూ అనుమతిలేదు'' అని ప్రకటన ఒక క్లబ్బు ముందు ఉంటే ఏవిధంగా ఆత్మగౌరవంకల భారతీయుడెవ్వడూ ఆ క్లబ్బులో తనకు ప్రవేశం కావాలని కోరడో, అదేవిధంగా, తాము ప్రవేశించగూడదు అని చెప్పబడే దేవాలయాలలోనికి నిజంగా తాము ప్రవేశాన్ని కోరగూడదనీ, అది సవర్ణ హిందువులే తేల్చుకోవలసిన ప్రశ్న అంటాడు. ఇంకా ఈ విధంగా చెప్పాడు :

" If Hindu religion is to be their religion, it must become a religion, of social equality Then it must recognise them as nationals but not as aliens. If Hindu religion is to be the religion of social equality, then, an amendment of its code to provide temple entry is not enough. What is required is to purge it of the doctrine of Chaturvarnya. This is the root cause of all inequality and is also the parent of the caste system and untouchability which are merely other forms of inequality. Unless it is done, the depressed classes will reject not only the temple entry but also the Hindu faith. For to accept the temple entry and be content with it is to compromise with the evil, and to barter away the sacredness of human personality that dwells in them."

ఇదే రోజులలో ఇంకొక విచిత్ర సంఘటన జరిగింది. బ్రిటిష్ ప్రభుత్వంచేత నిర్దాక్షిణ్యంగా రత్నగిరిలో నిర్బంధింపబడిన వినాయక సావర్కార్ సరిగ్గా ఇదే సాంఘిక సమస్యలమీద, హిందూ

సంఘటన అనే విస్తృత పరిధిలో పనిచేస్తున్నాడు. ఆయన ప్రోత్సాహంతో, రత్నగిరిలో సేట్ భాగోజీకర్, పతితపావన ఆలయాన్ని నిర్మించాడు దానికి ప్రారంభం చేయమంటూ సావర్కార్ అంబేద్కర్‌ను ఆహ్వానించాడు. దురదృష్టవశాత్తు ఆ తేదీలు వీలుకాక పోవటంతో అంబేద్కర్ దానికి పోలేక సావర్కార్‌కు తన కృతజ్ఞతలు తెలిపాడు.

ఈ రోజులలోనే బొంబాయిలోని ఒక మరాఠీ దినపత్రిక అంబేద్కర్‌కు ''బ్రహ్మద్వేషి'' అనే బిరుదును ప్రసాదించింది.

1933 మార్చి 24న రంగయ్యర్ తన బిల్లును ప్రవేశపెట్టాడు. బ్రిటిష్ ప్రభుత్వానికి దీనిమీద అనుమానాలొచ్చాయి. దీనిద్వారా దళితవర్గాలను తమమీద ఉసికొల్పటానికి ప్రయత్నం జరుగుతున్నదని భావించింది. కాంగ్రెసువారూ దీనికి సుముఖంగా లేరు. ఈవిధంగా ఆ బిల్లు తనంతట తనే మరణించింది. ఆ ప్రహసనము దానితో ముగిసింది.

1933 ఏప్రిల్‌లో అంబేద్కర్ లండన్‌పోయి తిరిగి వచ్చేస్తాడు. ఈవిధమైన నిరంతరశ్రమ ఆయన ఆరోగ్యాన్ని దెబ్బతీసింది. కొద్దిరోజులు బోర్డిలోనూ, తరువాత మహబలేశ్వర్‌లోనూ విశ్రాంతి తీసుకుంటాడు. 1934 డిశెంబరులో బ్రిటిష్ పార్లమెంటులో ఇండియా బిల్లు ప్రవేశపెట్టబడుతుంది. ఆ విషయాలనూ, చర్చలనూ తీవ్ర ఆసక్తితో పరిశీలిస్తుండగా, ఆయన వ్యక్తిగత జీవితానికి తీవ్రఆఘాతం తగిలింది.

గత పది సంవత్సరాలుగా ఆయన భార్య ఆరోగ్యం బాగుండటంలేదు. నిరంతర కార్యవ్యగ్రతతో ఆయన ఆ విషయం పెద్దగా పట్టించుకోలేక పోయాడు. ఒకసారి ఆమెను గాలిమార్పుకోసం ధార్వార్ తీసుకుపోయాడు. ఏదో కొద్దిమార్పు కనపడింది, కాని తృప్తికరమైన మార్పురాలేదు. అప్పటికే ముగ్గురు కుమారులను, ఒక కుమార్తెను పోగొట్టుకునుంది ఆ తల్లి. 1935 మే 27న. అంబేద్కర్‌యొక్క 44వ ఏట ఆమె అంబేద్కర్ జీవితంనుంచి శాశ్వతంగా నిష్క్రమించింది. స్వగృహమైన ''రాజగృహ''లో నివసిస్తున్నా, ఆమెకు తన చిన్నతనపు జీవితం మరుపురాలేదు. ఆమెకు సర్వస్వమూ తన స్వామే, ఆయనకోసం, ఆయన ఆరోగ్యంకోసం, ఆయన భద్రతకోసమే కలవరిస్తుండేది. నిరంతర ప్రార్థనలు, శనివారం ఉపవాసాలతో జీవితాన్ని గడిపింది. జీవితంలో పండరిపూర్ దర్శిద్దామన్న ఆకాంక్షతో తపించింది. కాని అస్పృశ్యులవటంవలన తమకు ప్రవేశార్హత ఉండదన్న కఠోరసత్యం అంబేద్కర్‌కు తెలుసు. ఆమె కోరిక తీర్చేందుకు తన ఆత్మగౌరవంతో రాజీపడలేక పోయాడు, అంబేద్కర్. ''మనలను దగ్గరకు రానియ్యని ఆ పండరిపూర్ ఎందుకు? మన నిస్వార్థ జీవితంతో, దళితవర్గాల సముద్ధరణతో మనమింకొక పండరిపూర్‌ను నిర్మిద్దాం'' అనేవాడు అంబేద్కర్.

ఈ దుస్సంఘటన తరువాత నాలుగు రోజులలో గవర్నమెంటు లా కాలేజి ప్రిన్సిపాల్‌గా నియమితుడయ్యాడు. ముందు జిల్లా జడ్జి పదవిని అంగీకరిస్తే, తరువాత హైకోర్టు జడ్జిని చేస్తానున్న ఆశకూడా ఆయన ముందుంచబడింది.

ఈ పరిస్థితులలో 1935 అక్టోబరులో యోలాలో ఒక సమావేశం ఏర్పాటు చేయబడింది. దీనికి మధ్యప్రాంతాలనుంచీ, హైదరాబాద్ నుంచి కూడా ప్రతినిధులు వచ్చారు. మొత్తం పది వేలమంది ప్రతినిధులు చేరారు.

అప్పటికి సుమారు పది సంవత్సరాలనుంచి హిందూసమాజ దృక్పథంలో మార్పు తేవాలనీ, తనవారికి మంచినీళ్ళుత్రాగే హక్కులన్నా కల్పిద్దామనీ, కష్టపడుతున్నాడు అంబేద్కర్. కాని ఫలితం లేకపోయింది. మహద్ ఆందోళన ఆయనకు తీరని వ్యధను కల్పించింది. ఆ సమావేశాలు కావటంతోనే హిందూమతాన్ని వదిలివేద్దామన్న భావన ఆయనలో కలిగింది. మహద్ చెరువు దావా నిమిత్తము అనేకసార్లు మహద్ పోవలసివచ్చింది. ఒకసారి వర్షాకాలంలో దారిలో నదిపొంగి, రెండురోజులు ఆగిపోవలసి వచ్చింది. కారు ఆగినచోట అస్పృశ్యుల నివాసాలేమీ లేకపోవటంతో ఆయనకు నివాసమూలేదు, ఆహారమూలేదు. తిరిగి వచ్చిన తరువాత భవనంలో గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుని ఎంతకూ బయటికి రాకపోతే, బొలేబోటి స్నేహితులు, అనుచరులు బ్రతిమలాడి బయటికి తీసుకువచ్చి ఆయనను శాంతపరచవలసి వచ్చింది.

ఇలా మహద్‌నుంచి ఆయనలో తీవ్రమథనము ప్రారంభమై అలా అంతర్గతంగా కొనసాగుతూవచ్చింది. ఎన్నివిజ్ఞప్తులకు లొంగని ఈ సమాజం, ఎన్ని కార్యక్రమాలకు చలించని ఈ సమాజం, నన్నుముట్టుకోకు నామాలకాకి అనే ఈ సమాజం, విధర్మీయులకు సమానత్వాన్ని, ఔన్నత్యాన్ని అంటగట్టి, స్వధర్మీయులను పంక్తిబాహ్యులుగా, దేవాలయ ప్రవేశానికి అనర్హులుగా ఎంచే ఈ సమాజం — దీనిని ఎలా సంస్కరించటం ? ఏదో అంతు తెలియని, ఊహకందని భవిష్యత్‌లో ఈ సమాజం మారబోతుందనే నమ్మకం కాని ధైర్యంతో, లక్షలాది సోదరులను ఈ కూపంలో ఉంచవలసిందేనా ?

వీటన్నిటి ఫలితమే యోలాలో ఆయన ఉపన్యాసము, వెలువరించిన దృఢాభిప్రాయము.

యోలాలో ఆయన గంటన్నర సేపు ప్రసంగించాడు. సాంఘిక, ఆర్థిక, విద్యావిషయక, రాజకీయ రంగాలలో ఇంతవరకు జరిగిన కృషిని,ఆందోళనను సమీక్షించి,ముఖ్యంగా కాలారామ్ దేవాలయప్రవేశోద్యమాన్ని ప్రస్తావించి, బహుశాతాముఇంతవరకుధనాన్ని, కాలాన్ని వృధా చేశామేమో అనిపిస్తుందన్నాడు. కాలారామ్ సత్యాగ్రహాన్ని విరమించమని కోరుతూ, బహుశా ఈ పరిస్థితుల్లో హిందూ మతాన్ని వదలివేసి ఇంకో మతాన్ని స్వీకరించటం అవసరమేమో తీవ్రంగా ఆలోచించమన్నాడు. చాలా బాధతో గంభీరంగా చివరికి ఒక ప్రకటన చేశాడు. ఐ సాలెమ్‌లీ ఎష్యూర్ యూ దట్ ఐ విల్ నాట్ డై ఏస్ ఎ హిందూ.''

అంబేద్కర్ యొక్క ఈ నిర్ణయం విన్న తరువాత, ఆ సమ్మేళనం మతం మార్పిడి విషయం తీవ్రంగా ఆలోచించమని తీర్మానించింది.

**ఈ విధంగా** అంబేద్కర్ జీవితంలో **మూడవ ఘట్టము ముగిసింది.**

## 4

ఈ వార్త తెలిసిన వెంటనే ముస్లిం ఇండియా తరఫున కె.ఎల్.గూబా ఎం.ఎల్.ఎ.ఒక టెలిగ్రామిస్తూ తాము అంబేద్కర్‌ను స్వాగతిస్తున్నామన్నాడు. మెథడిస్ట్ ఎపిస్కోపల్ చర్చికి చెందిన బ్రెంటన్‌బాడ్లీ క్రైస్తవుల తరఫున సుస్వాగతం పలికాడు. వారణాశి లోని మహాబోధి సొసైటీ తరఫున కూడా ఆహ్వానమందింది. సావర్కార్ కూడా ఒక ప్రకటన చేస్తూ, ఏ మతంలో నైనా సరే, తర్కానికి లొంగకుండా నమ్మకం మీద ఆధారపడేది కొంత భాగముంటుందనీ, కాబట్టి అంబేద్కర్ తర్కానికి వ్యతిరేకంగాని సిద్ధాంతాల మీద ఆధారపడిన మతంలోకి మారాలి సుమా, అన్నాడు.

బొంబాయి తిరిగి వచ్చిన తరువాత, గోవాలో శుద్ధి ఉద్యమాన్ని సాగిస్తున్న మసూర్కర్ మహరాజ్ అంబేద్కర్‌ను కలిశాడు. ఆయనతోటి సంభాషణలో తన బాధను వెల్లడించాడు. తానింకా పది సంవత్సరాలు ఆగమన్నా ఆగగలననీ, ఈలోపుగా పూనాలో ప్రముఖ హిందువుగా పేరుబడ్డ దళితవర్గ నాయకుడు సకత్‌ను శంకరాచార్య పీఠం మీద ప్రతిష్ఠించి, పూనాలోని ఒక వంద చిత్పవన బ్రాహ్మణ కుటుంబాలు ఆయన పాదాల మీద పడితేతప్ప, వారిలో పరివర్తన వచ్చిందని తాను నమ్మలేనని వ్యంగ్యంగా అన్నాడు.

తరువాత తనను కలవవచ్చిన ఒక ప్రతినిధి వర్గంతో మాట్లాడుతూ, కొంతమంది వలె సమాజమనుగడకు మతం అనవసరమని తాను భావించటంలేదనీ, ''మనుస్మృతి'' లో వర్ణించినట్లు ధర్మం సమాజ మనుగడకు మూలమనీ, స్మృత్యాధార భావాన్ని తొలగించందే హిందూమతాన్ని సంస్కరించటం అసంభవమనీ భావిస్తున్నానన్నాడు.

1936 జనవరిలో పూనాలో జరిగిన యువసభలో మాట్లాడుతూ, తాము ఇస్లాంలోకి మారినంత మాత్రాన నవాబులమవుతామనీ, లేదా క్రైస్తవులయినంత మాత్రాన పోపుల మవుతామనీ ఎంతమాత్రం అనుకోవటం లేదనీ, తమ స్వయంకృషి ఏ పరిస్థితులలోనూ తప్పదని హెచ్చరించాడు.

అయితే అంబేద్కర్ మొదటి నుంచీ హిందూధర్మ విరోధా? కానేకాదు. కొంత మంది తమర్ స్త్రీలు ఇస్లాం మతాన్ని స్వీకరిస్తే బాధపడ్డాడు. ఎంతవరకయితే, సవర్ణ హిందువులు అస్పృశ్యులను కూడా హిందువులని పిలుస్తారో, అంతవరకూ అందరి హక్కులు సమానమన్నాడు. తమ రక్తంతో హిందూ ధర్మాన్ని క్షాళితం చేస్తామన్నాడు. హిందూ మిషనరీల పట్ల గోవా ప్రభుత్వ దమననీతిని వ్యతిరేకిస్తూ పంపిన టెలిగ్రాంలో సంతకంపెట్టాడు. రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు సందర్భంగా మైనారిటీల కమిటీ సమర్పించిన నివేదికలో దళిత వర్గాలను ప్రొటెస్టెంటు హిందువులుగా గుర్తించాలని కోరాడు. అన్నిటికీ మించి పూనా ఒడంబడికలో సంతకం పెట్టాడు. అంబేద్కర్ చిత్తశుద్ధిని గుర్తించటానికి ఇంకా ఏం ఋజువులు కావాలి ?

ఈ ఉద్యమం ఫలితంగా కొన్ని ధోరణులు వ్యక్తమయ్యాయి. అంబేద్కర్ కులస్థులైన మహార్‌ల నుంచి, అల్ప సంఖ్యాకులైన తమరులు క్రమేణా దూరం కాజొచ్చారు. సవర్ణ హిందువులలో, తీవ్రంగా సంస్కరణలకు ప్రయత్నిస్తున్న వారందరిలో ఒక విధమైన నిస్పృహ, వ్యతిరేకత ప్రారంభమయింది పిరికివాళ్లలాగా రంగాన్ని వదిలి పారిపోగూడదనీ, హిందూధర్మ పునరుద్ధరణకు అవతరించిన అవతార స్వరూపుడే అంబేద్కర్ అనీ నొక్కి వక్కాణించారు.

1936 జనవరి నుంచి లాహోర్‌లోని జాట్‌పాట్ తోడక్ మండల్ వారి వార్షిక సమావేశానికి అధ్యక్షోపన్యాసం తయారు చేయటంలో మునిగిపోయాడు. కొన్ని కారణాల వలన అది జరగ లేదు కాని చివరకు అంబేద్కర్ యొక్క ప్రతిభాపూర్వక వ్యాసం ''ఎన్‌హిలేషన్ ఆఫ్‌కాస్ట్'' అనే పేరుతో ప్రచురించబడి దేశంలో పెద్ద దుమారాన్నే లేపింది.

1936 జూన్‌లో డాక్టరు. మూంజీ ద్వారా శిఖ్ఖు మతాన్ని స్వీకరించేందుకు కొన్ని సంప్రదింపులు సాగాయి. డాక్టరు. మూంజీ ఈ విషయాన్ని గురించి ఇంకొక నాయకుడు రాజాకు వ్రాశాడు అంబేద్కర్‌మీది అసూయతతో, గాంధీజీ ప్రోద్బలంతో, రాజా తనకూ మూంజీకి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రకటించటంతో కొన్ని సమస్యలేర్పడి, ఆ ప్రయత్నం సఫలం కాలేదు.

కాని అంబేద్కర్ యొక్క నిర్ణయం కొన్ని సత్ఫలితాలకు దారితీసింది. మైసూరు ప్రభుత్వం దసరాదర్బారులో హరిజనులకు ప్రవేశాన్నిచ్చింది. తిరువాన్కూరు ప్రభుత్వం, సర్ సి. పి. ప్రధానిత్వంలో, ప్రభుత్వాధీనంలో గల 1600 దేవాలయాలను హరిజనులకు తెరిచింది. ఈ సమస్యకు పరిష్కారం రెండు మూడు తరాలవరకూ ఆరాధనా స్థలాలను మూసివేయటమనే ప్రకటించిన జవహరలాల్ నెహ్రూ కూడా, ఈ మార్పుల పట్ల హర్షాన్ని వ్యక్తం చేశాడు.

శిఖ్ఖుమతం విషయమై, అంబేద్కర్ రెండు ముఖ్యమైన ప్రకటనలను చేశాడు. ఆ ప్రకటనలను చూస్తే హిందూసమాజం ఆయనను ఎంత గౌరవహీనంగా చూసినప్పటికీ, ఆయన ఆ సమాజంపట్ల తనబాధ్యతను ఎలా విస్మరించలేదో తెలియజేస్తాయి. 1936జులై 24నాటి ప్రకటనలో, దళితవర్గాలు ఇస్లాంమతాన్నో,

క్రైస్తవ మతాన్నో స్వీకరిస్తే, వారు హిందూమతం నుంచే కాకుండా హిందూసంస్కృతి నుంచే బయటకి పోతారని, శిఖ్కులైతే హిందూసంస్కృతి నుంచి బయటికిపోరని, వీరంతా ముస్లింలయితే ముస్లింల ఆధిక్యత పెరుగుతుందనీ, క్రైస్తవులయితే అది బ్రిటిష్ వారికి సహాయకారి అవుతుందనీ, ఈ దేశపు మంచిని మనస్సులో ఉంచుకునే దళితవర్గాలు శిఖ్కులుగా మారాలన్నాడు.[1]

రాజా ఉత్తరాలను పత్రికలకివ్వటాన్ని గురించి వ్రస్తావిస్తూ 1936 ఆగష్టు 8 నాటి ఒక ప్రకటనలో తాను హిందువుల భవిష్యత్తును గుర్తించికూడా బాధపడుతున్నాను కాబట్టే శిఖ్కు మతాన్ని నిర్ణయించటం జరిగిందంటాడు.[2]

ఈ ఆగష్టులోనే ఇండిపెండెంటు లేబరుపార్టీని స్థాపించటం, 1937 ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికల్లో 17 మంది అభ్యర్థులకు 15మంది ఎన్నిక కావటం జరిగింది.

బొంబాయి శాసనమండలిలో, స్థానికసంస్థల చట్టంలో అస్పృశ్యులను "హరిజను" లని నిర్వచించటంపట్ల వ్యతిరేకతను చూపుతూ, వీరొక్కరే హరియొక్క జనులయితే, సవర్ణహిందువులు భూతజనులా అని ప్రశ్నిస్తాడు.

1945లో కలకత్తాపోయి, రైల్వేఆఫీసరు జాదవ్ఇంట్లో భోజనం చేస్తాడు. దాని ఫలితంగా మరుసటిరోజు ఆయన వంటవాడు, నౌకరులు ఆయన ఇంట్లో పనిచేయటానికి నిరాకరిస్తారు. ఇప్పుడు అంబేద్కర్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో లా మెంబరు సుమా!

కాలచక్రంలో అనేక సంవత్సరాలు గడిచాయి. భారతదేశానికి స్వతంత్రం రావటం, రాజ్యాంగసభ సభ్యుడుగా విశేషశ్రమ చేసి రాజ్యాంగాన్ని రచించటం, అంబేద్కర్ శేషజీవితంలో ముఖ్యఘట్టాలు. అలాగే తన 56వ ఏట సారస్వతబ్రాహ్మణ కుటుంబానికి చెందిన కుమారి శారదాకబీర్‌ను వివాహమాడాడు. అలాగే స్వాతంత్ర్య సంపాదనానంతరము నాలుగు సంవత్సరాల తరవాత 1951 అక్టోబరు 11న మంత్రిపదవికి రాజీనామా చేశాడు.

1954నుంచి బౌద్ధంపట్ల విశేష ఆసక్తిని చూపటం ప్రారంభించాడు. ఎన్నికలలో ఆయన షెడ్యూల్డుకాస్ట్ ఫెడరేషన్ పూర్తిగా దెబ్బతింది. 1955ఆగష్టు27న ఫెడరేషన్ వర్కింగ్ కమిటీ సమావేశమై ప్రజా ప్రాతినిధ్యరంగంలో షెడ్యూల్డుకులాలకు ప్రత్యేక ప్రాతినిధ్యము ఇక అనవసరము అనే తీర్మానాన్ని ఆమోదించింది.

1956మేలో బొంబాయిలో ప్రసంగిస్తూ ఆ సంవత్సరం, బుద్ధజయంతి ఉత్సవాలలో తాను బౌద్ధమతం స్వీకరిస్తానని ప్రకటించాడు. బౌద్ధంయొక్క అహింసాతత్వాన్ని విమర్శిస్తూ వ్యాసాలు వ్రాసిన సావర్కార్‌ను దుయ్యబట్టి, బైబిల్ గాథ లోని మోజెస్ తన ప్రజలను ఎలా ఈజిప్టునుంచి పాలస్తీనుకు నడిపాడో, అలాగే తాను తన ప్రజలను స్వాతంత్ర్యం వైపు నడిపితీరతానని చెప్పాడు.

ఈలోపుగా ఆయన ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింది. తను అనుకున్న కార్యాన్ని సాధించలేక పోతానేమోనని విపరీతంగా బాధపడ సాగాడు. ముఖ్యంగా తాను వ్రాద్దామనుకున్న మూడుపుస్తకాలు "ది బుద్ధా ఎండ్ కార్ల్ మార్క్స్", "రివల్యూషన్ ఎండ్ కౌంటర్ రివల్యూషన్ ఇన్ ఇండియా", మరియు ది రిడిల్ ఆఫ్ హిందూయిసమ్"గురించిన బాధ మొదలయింది. అప్పటికే "ది బుద్ధా ఎండ్ హిస్ ధమ్మ" ముద్రణ మొదలయింది.

1956అక్టోబర్ 14న ఉదయం 9, 11 గంటల మధ్య అంబేద్కర్ బౌద్ధమత స్వీకార మహోత్సవం నిర్ణయింపబడింది. గోరఖ్‌పూర్ జిల్లాలోని కుషినారాలో గల భిఖ్కుచంద్రామణిని తనకు దీక్ష ఇవ్వవలసిందిగా ఆహ్వానించాడు. తాను అక్టోబరు 11 నాటికల్లా నాగపూర్ చేరాడు. నాగపూర్‌లోని శ్రద్ధానందపేటలో గల 14 ఎకరాల స్థలం దీక్షాభూమిగా నిర్ణయింపబడింది.

13వతేదీ సాయంకాలం విలేఖరుల సమావేశంలో మాట్లాడుతూ తనది మహాయానమూ, హీనాయానమూ కాని నవయానమని చెప్పాడు. మీరెందుకు బౌద్ధమతాన్ని స్వీకరిస్తున్నారని అడిగిన ప్రశ్నకు కోపంగా, తానెందుకు హిందూధర్మాన్ని వదిలి బయటికి పోతున్నాడన్న ప్రశ్నను తమ తాతతండ్రులకు వెయ్యమని సమాధానం చెప్పాడు. తాను మహాత్మాజీతో అనేక విషయాలలో భేదించినా, తాను మతం మారదల్చుకున్నప్పుడు మట్టుకు దేశానికి చాలా తక్కువ ప్రమాదకారి అయిన దానినే చూచుకుంటానని మాట ఇచ్చాననీ, బౌద్ధం భారతీయ సంస్కృతిలో భాగమనీ, ఈదేశం చరిత్ర సంస్కృతులు తన మార్పిడి వల్ల దెబ్బతినకుండా చూచాననీ అన్నాడు.[3]

14ఉదయాన నిర్ణీతసమయంలో 83 సంవత్సరాల మహాస్థవిర చంద్రామణి, తన నల్గురి శిష్యులసహాయంతో, త్రిశరణములు "ధర్మం శరణం గచ్ఛామి, బుద్ధం శరణం గచ్ఛామి, సంఘంశరణం గచ్ఛామి"పంచశీలనూ ప్రవచించిపాలిమంత్రయుక్తంగాఅంబేద్కర్‌కు బౌద్ధమతదీక్షను ప్రసాదించాడు. 'హిందూమతాన్ని నేను వదిలివేస్తున్నాను' అన్నప్పుడు, 65సంవత్సరాల అంబేద్కర్ కంఠం గాద్గదికమయింది.

అంబేద్కర్‌తోపాటు బౌద్ధ మతాన్ని స్వీకరించిన వారితో నాగపూర్ హైకోర్టు భూతపూర్వ ముఖ్య న్యాయమూర్తి ఎం. బి. నియోగి కూడా ఉన్నాడు.

ప్రముఖుడైన ఏ భారతీయ నాయకుని నుంచీ ఆనాడు అభినందన సందేశాలు రాలేదు. పండిత నెహ్రూ దృష్టిలో భారతీయ తత్వశాస్త్రానికి, మతానికి, ప్రజాస్వామ్యానికి అసంగతాలేమీ లేవు. హిందూమతం బౌద్ధానికి వ్యతిరేకంగా నిలవలేదు, దాదాపుగా దానిని తనలో ఇముడ్చుకుంది. రాధాకృష్ణ పండితుని దృష్టిలో శుద్ధమైన హిందూమతమే బౌద్ధము. సావర్కార్ ఒక ప్రకటనచేస్తూ బౌద్ధ అంబేద్కర్ హిందూ అంబేద్కర్ సుమా అని ప్రకటించాడు.

మహాస్థవిర చంద్రమణి ఒక కరపత్రాన్ని వేస్తూ హిందూమతము, బౌద్ధమతమూ ఒకే వృక్షంయొక్క వివిధ శాఖలని వర్ణించాడు.

ఈ విధంగా పరిపూర్ణమైన ఆత్మ తృప్తితో, 1956 డిశంబరు 6 వ తేదీనాటి ఉదయం బాబాసాహెబ్ నిద్ర నుండి లేవ లేదు. ఆ మహామహుని ప్రాణవాయువులు బుద్ధభగవానునిలో లీన మయాయి.

హిందువుగా జన్మించిన అంబేద్కర్ హిందువుగా మాత్రం మరణించలేదు సుమా!

ఆయన జీవితంలోని అంతిమ ఘట్టమిది.

## 5

అంబేద్కర్ వ్యక్తిత్వాన్ని అంచనా కట్టటం అంత తేలికైన పనికాదు. విపరీతమైన శ్రమతో పైకి వచ్చిన వ్యక్తి. వడ్డించిన విస్తరికాదు ఆయన జీవితం, అనేక దెబ్బలుతిని బొప్పెలు కట్టిన జీవితమది. కాబట్టే వాక్కు అతికఠినంగా కనపడేది. ముఖ్యంగా తన విమర్శకులపట్ల, రాజకీయ ప్రతిద్వందుల పట్లా కఠోర వాక్ప్రయోగం జరపటానికి, అవతలి వారి వ్యక్తిత్వం ఎంతమాత్రం ఆయనను భయపెట్టేది కాదు. మహాత్ముణ్ణే ఆయన ఖాతరుచేయ లేదంటే మిగతావారి విషయం లెక్కేమిటి? అయితే అది శతాబ్దాల తరబడి ఆరళ్లుపెట్టబడిన సోదరుల ఆక్రందనగా అర్థంచేసుకుంటే అందులో మనకు అసంబద్ధత కనపడదు.

ఎంతమంది మహానుభావులు ఆ రంగంలో పనిచేసినా, వారి రక్తంలో నుంచి పుట్టిన మహానుభావుడు అంబేద్కర్. కాబట్టే, ధనంజయకీర్ వర్ణించినట్లు గాంధీజీ విజ్ఞప్తులు సవర్ణహిందువుల హృదయాలను కదిలిస్తే, సావర్కార్ ప్రచారాలు వారిలో బౌద్ధిక పరివర్తనకు, హృదయానికి ముల్లులలాగా గుచ్చుకోటానికి కారణ భూతమయితే, అంబేద్కర్ జీవితం, ధోరణి సరాసరి అస్పృశ్యులనే స్పృశించింది. ఇతరుల ఉద్యమాలు కేవలం చర్మానికే పరిమిత మయితే, అంబేద్కర్ ఉద్యమాలు సరాసరి వారి గుండెలనే పిండి వేశాయి.

సంకుచిత రాజకీయ వాదులకు అంబేద్కర్ జీవితమొక 'పొలిటికల్ ఫెయిల్యూర్' కారణం. ఆయన రాజకీయ పక్షం అధి కారంలోకి రాలేకపోయింది. కాని స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే దేశంలో పరిఢవిల్లిన సమన్వయ భావన, ఆయన శక్తిసామర్థ్యాలను దేశ ప్రజలకు వినియోగపడేటట్లు చేసింది.

అస్పృశ్యులకు నాయకుడుగా రూపొంది బయలుదేరిన అంబే ద్కర్, స్వాతంత్ర్య సంపాదనానంతరము, యావద్భారత నాయకు డుగా, రాజ్యాంగ రచనా ధురంధరుడుగా, మన ప్రజాస్వామిక గణ తంత్ర రాజ్య నౌకకు నిర్మాత అయ్యాడు. ఈ రెండు రంగాల్లో ఏదిగొప్ప అనేది ఎవరూ తేల్చలేని చిక్కు ప్రశ్నగానే మిగులుతుంది.

వారి తరువాత, హరిజన నాయకులలో ఎవ్వరూ వారి స్థానాన్ని ఆక్రమించలేక పోయారు. దేశంలోనే మన రాజకీయ జీవితంలో రానురాను అలాంటి పండిత రాజకీయ వాదులు కరు వయ్యారనీ, ఇప్పుడున్న వారంతా కార్యవాదులయిన రా జ కీ య వాదులే, లేదా డివిడెండ్ రాజకీయ మాత్రమే ననీ అంటాడు అంబే ద్కర్ జీవిత రచయిత శ్రీ ధనంజయకీర్.

ఏది ఏమైనా భారతీయ హృదయాల్లో శాశ్వత స్థానాన్ని సంపాదించుకున్న మహామహుడు అంబేద్కర్, హిందూ ధర్మ పరి రక్షకులైన అధునాతనుల్లో అగ్రగణ్యుడు.

(ఈ దీర్ఘ వ్యాసంలో అంబేద్కర్ జీవితంలోని కేవలం ఒక రంగాన్నే స్వల్పంగా పరామర్శించటం జరిగింది. దీనికి పూర్తి ఆధారము శ్రీ ధనంజయకీర్ వ్రాసిన "డా. అంబేద్కర్ – లైఫ్ ఎండ్ మిషన్" (పాపులర్ ప్రకాషన్, బొంబాయి వారి ప్రచురణ 1971 – మూడవ ఎడిషన్) గ్రంథం. అంబేద్కర్ విషయంలో అది సర్వస్వమనే చెప్పవచ్చు. అధోజ్ఞాపికలలో ఇచ్చిన పత్రికా ప్రకటనలు కూడా దానిలోనివే. డిప్రెస్డ్ క్లాసెస్, అన్‌టచబుల్స్ అన్న మాటలను దళిత వర్గాలు, అస్పృశ్యులు అని అనువదించడం జరిగింది. అంతకంటె సూటి అనువాదం నాకు తోచక అలా చేయటం జరిగిందని మనవి.)

# అ ధో జ్ఞా పి క లు

1. The second question is, looking at all these alternative faiths puerly from the standpoint of Hindus, which is the best - Islam, Christianity or Sikhism? Obviously Sikhism is the best. If the Depressed Classes join Islam or Christianity, they not only go out of Hindu religion, but they also go out of the Hindu Culture. On the other hand, if they become Sikhs they remain within the Hindu Culture. This is no means a small advantage to the Hindus."

"What the consequenfes of conversion will be to the country as a whole" he continued, "is well worth bearing in mind. Conversion to Islam or Christianity will denationalise the Depressed Classes. If they go over to Islam, the number of Muslims would be doubled; and the danger of Muslim domination also becomes real. If they go over to Christianity, the numerical strength of the Christians becomes five to six crores. It will help to strengthen the hold of Britian on the country. On

the other hand, if they enbrace Sikhism, they will not only hot harm the destiny of the country but they will help the destiny of the country. They will not be denationalised. On the contrary, they will be a help in the political advancement of the country. Thus it is in the interests of the country that the Depressed Classes, if they are to change their faith, should go over to Sikhism" (The Times of India 24th July, 1936 quoted in keer, page 280.,

2. "The move for conversion to Sikhism has been approved by a number of prominent Hindus, including Shankaracharya Dr. Kurthakoti. In fact it is they who took the iniative and pressed it on me. If I have gone to the length of considering it an alternative, it is because I felt certain amount of responsibility for the fate of the Hindus." (The Times of India, 8th August, 1936 quoted in Keer, page 281.)

3. "I will choose only the least harmful way for the country. And that is the greatest benefit I am conferring on the country by embracing Buddhism; for Buddhism is a part and parcel of Bharateeya Culture. I have taken care that conversion will not harm the tradition or the culture and history of this land." (Keer, page 498.)

# జనం మేడలు

## శ్రీ సి. హెచ్. మధు

అక్షర ప్రపంచం మీద
రమ్యమైన భవంతులు నిర్మిస్తున్నాను.

ఒక్కరాయి దెబ్బతో
చెల్లా చెదురయ్యే
గాజు భవంతులు కావివి.

పునాదుల నుండి
పదాల రాళ్లతో –
ఇటుకల వాక్యాలతో –
నిర్మించిన అందమైన భవంతుల మధ్య
నే నెక్కడా కనిపించను.

భవంతుల శిల్పం
ఎంతో గొప్పది
దానికి చరిత్రవుంది
జనం చేసిన శిల్పం

ఇటుకల వస్తువుంది
చూడు
అదికూడా ఎంతోమేలుది.

ఆ ఇటుకల మధ్య
జనం కష్టాలుంటాయి.

శైలిలా పూత పూస్తున్న
సిమెంటు చూడు –
అది ఎంతో మెత్తగా –
కన్నీళ్లు తుడిస్తే –
రాపిడి తగులనంత మెత్తగా
ఈ భవంతుల మధ్య
నేను లేననే చింత నాకు లేదు.

ఇవి ఎవడో ఒకడు
కూల గొడుతాడనే బాధ నాకు లేదు.

ఇవి ప్రేమ కలాపాలకు
భోగ విలాసాలకు
కేంద్రం కాదు.
భవంతి మీద నాపేరు లేదనే
బాధ నాకు లేదు.

అడవుల మధ్య
కొండల మధ్య
నిలబెడుతున్న
ఈ కవితా భవంతుల –
రేపు పొద్దున
జనం ఆక్రమించుకుంటారని
నాకు తెల్సు.

శ్రీ విక్రాల శేషాచార్యులు

# సంస్కృతాంధ్రములలో ఛందశ్శాస్త్ర యతులు

## ౧. యతి స్వరూపము :-

గురువులు అని చెప్పఁబడు దీర్ఘాక్షరములు కొన్ని, లఘువులు అని చెప్పఁబడు హ్రస్వాక్షరములు కొన్ని కూర్పఁగా నేర్పడిన వివిధ గణముల యోగముచేత వివిధ పద్యము లేర్పడుచున్నవి. ఆ పద్యము నాలుగు భాగములు కలిగియుండును. ఆ పద్యభాగమునే 'పాదము' అని నుడివెదరు. పాదము అనఁగా నాలగవ వంతు అని యర్థము. ని. శ్లో॥ ''భాగస్తురీయఙ్ఘ పాదస్స్యాత్''అని యమరము. ఈ పాదములు శ్లోకమునందు లేక పద్యమునందు విశ్రమస్థానములే యని సంస్కృత లాక్షణికులయొక్క అభిప్రాయము. కొన్ని(పెద్ద) శ్లోకములయొక్క పాద మధ్యము నందు రెండు కాని లేక మూడు కాని విశ్రమ స్థానములుండును. ఈ విశ్రమ స్థానమునకే ''యతి'' అని పేరు. యతి అనఁగా సూ ''యతి ర్వి చ్ఛేదః'' అను (పింగళ ఛ్ఛందస్సు ౬ వ అధ్యాయము ౧ వ సూత్రము) లక్షణముచేత పాద మధ్యములో కొన్ని యక్షరములు, పాదాంతమును శ్లోకములో విరామ స్థానములు. అందుకనే పెద్దలు శ్లో॥ ''విరామ విశ్రమాద్యాస్తు పర్యాయాః ఖ్యాయతే ర్మతాః'' అని, ఆంధ్రములో – తే॥ ''విరతి, విశ్రాంతి, విశ్రామ, విశ్రమములు। శ్రాంతి, విరమణ, విరమ, విరామ, యతులు, । ననఁగ నివి తొమ్మిదియు వళి కాఖ్యలయ్యె..!'' అని అప్పకవీయము 3 వ ఆశ్వాసము 6 వ పద్యము. పాదాంతము కూడా ఈ లక్షణము కలదే కనుక అదియు యతి యని సంస్కృత లాక్షణికులచేత గమనింపఁబడినది పైనఁ బేర్కొనిన పింగళఛ్ఛంద స్సూత్రముయొక్క వ్యాఖ్యానములో భట్ట హలాయుధుఁడు శ్లో॥ యతిస్సర్వత్ర పాదాంతే శ్లో కార్ధేతు విశేషతః''...అని తెలిపినాడు. ''యతి శబ్దము యొక్క అర్థములలోని పద్య విరామ స్థాన మను అర్థము చెప్పునప్పుడు దీని వ్యుత్పత్తియు నీ యర్థమునే తెలిపెడిని. ఎట్లన ? తారానాథ తర్క వాచస్పతి భట్టాచార్య సంకలితే వాచస్పత్యే (4771 పత్రే) ''యమ్యతే జిహ్వా యత్ర. యమ. క్తిన్. ౨ ఛందో గ్రంథ విఖ్యాతే జిహ్వాయా ౨ విశ్రమస్థానే ఉచ్చారణకాల విచ్ఛేదే. స్త్రీ..., ఈ యర్థమునందీ శబ్దము యమ ఉపరమే అను ధాతువు నుండి పుట్టినది. ఆ స్థానము నందు నాలుక (చదువక) నిలుపఁబడును. కనుక ''యతి'' అని పేరు కలిగినది. స్త్రీ లింగము. అనఁగా నా స్థానమునందు తాకి తాకక అనునట్లు ఇంచుక నిలచినట్లు లుండి పై యక్షరము నందుకొనుట. ఒక వృత్తము లేక పద్యమును రచియించఁబూని దాని గణములను ఛ్ఛందశ్శాస్త్రోక్త క్రమమునఁ గూర్చు చుండ యతి దానియంతట అదియే పాద మధ్యముల యందు సహజముగ నేర్పడును. చేయ నెంచిన పద్యము యొక్క గణములను కూర్చుటలోఁ బ్రయత్నము చేయునట్లు యతిని నేర్పఱచుట యందు చేయఁ బనిలేదు. ఆశు కవిత్వము నందును, ఆలోచించి మెల్లగ వ్రాయు కవిత్వమునందును నిది సహజము. ఉదాహరణమున కొక్కపద్యము—శ్లో॥''సూర్యాశ్వైర్మ స జ స్త తా స్సగురవ శ్శార్దూల విక్రీడితమ్.'' (వృత్తరత్నాకరే అధ్యాయే శ్లో॥) అని మగణము సగణము జగణము సగణము తగణము గురువు, ఈ గణములు వరుసఁ దప్పకుండా ప్రతి పాదము నందుఁ గూర్చినచో పాద మధ్యము నందు పదిరెండవ యక్షరము వద్ద యతి అనఁగా విశ్రమము కలిగి పిమ్మట ౧౩ వ యక్షరముతో ప్రారంభమైన పాద భాగము నేడవ యక్షరముతో ముగియును. ఇట్లే కడమ నాలుగు పాదములకు నెఱుంగఁదగును.

## ౨. తెనుఁగులో యతిస్థాన ప్రతిపాదనమునందు ద్వైవిధ్యము

సంస్కృత భాషయందు ఏలాక్షణికుఁడు విరచించిన ఛ్ఛందశ్శాస్త్ర గ్రంథము నందైనను ప్రతిశ్లోకముయొక్కయు యతిస్థాన నిర్దేశములో భేదము కనుపించదు. ఆంధ్రములో నీ యతిస్థాన నిర్దేశము ద్వివిధముగ కానవచ్చుచున్న యది. ''యతిర్విచ్ఛేదః'' అనెడు లక్షణ యుక్తమైన స్థానమందే పద్యములో యతి నిర్దేశము చేయుటొకటి. [1]తాతంభట్టాదుల సులక్షణ సారాదులయందు తఱచుగ నీ పద్ధతినే యతిస్థాన నిర్దేశ మొనర్పఁబడినది. ఉదా : శార్దూల విక్రీడిత వృత్తలక్షణమే— ఫ॥ ''సారాచార విశారదా యినయతిన్ శార్దూల విక్రీడితా। కారంబై మ—స—జ—మ్ము—లిమ్ముగ స—త్తా—గ ప్రాప్తమై చెల్వగున్''[30]. ఇందులో ''ఇన యతిన్'' అనఁగా పదిరెండవ యక్షరమునందు యతితో అని యతిస్థానము చెప్పఁబడినది. సంస్కృత శార్దూల విక్రీడిత వృత్తమునకు పూర్వోదాహృతమైన వృత్త రత్నాకరమునందలి ''సూర్యాశ్వైః'' ఇత్యాది లక్షణ శ్లోకమునందలి సూర్యశబ్దము

నకు బదులు సులక్షణసారములో శార్దూల విక్రీడిత వృత్తలక్షణ ప్రతిపాదనములో "ఇన" శబ్దము ప్రయోగింపంబడినది. ఐతే సంస్కృతములో పాదాంతముకూడ యతిగ వాకొనుట కలదు కనుక యతి దాటిన తర్వాత మఱల నేడవ యక్షరము యతి అని తెలుపుటకు అశ్వశబ్దము ప్రయోగింపంబడినది. తెనుఁగులో పాదాంతము యతి అని చెప్పు సంప్రదాయములేదు కనుక సులక్షణసారములో "ఇన యతిన్" అని పాదమధ్యములోని ఒక్క యతిస్థానమే చెప్పఁబడినది. ఇట్లు పదిరెండుకు ప్రత్యామ్నాయముగ వాడఁబడు సూర్య పర్యాయ నామములలోని "యిన" శబ్దము యతిస్థాన బోధకముగ మూలములోఁ బ్రయుక్తమై యుండ చెన్నపురిలో శ్రీ వావిళ్లవారు ప్రచురించిన సులక్షణసారముయొక్క తాత్పర్యములో "పదమూడవ యక్షరము యతిస్థానముగాఁ గలది శార్దూల విక్రీడితము" అని వ్రాయుట చింత్యము. ఇంతియేకాదు. శార్దూల విక్రీడిత వృత్తలక్షణ పద్యము ప్రక్కనే మత్తేభ విక్రీడిత వృత్తముయొక్క లక్షణమునుఁ జెప్పెడు "మ" (స్మయదూరా) వీ సత్త్రయోదశ యతిన్ మత్తేభ విక్రీడితా। హ్వయ మయ్యెన్ స—భ—ర—మ్ములన్ న మ యన వ్రాతంబుల న్గాఁడ గాన్" 30 అని పద్యములో "త్రయోదశ యతిన్" (పదమూడవ యక్షరము యతి) అని స్పష్టముగ నంకే పేరుతోనే చెప్పినను "పదునాల్గవ యక్షరము యతి" అని తాత్పర్యములో వ్రాసి యున్నది. ఇట్లే యందరి అనేక పద్యముల తాత్పర్యములో మూలమునందలి సంఖ్యావాచక శబ్దమునకు సరియైన యర్థము కానరాదు.

2 చిత్రకవి పెద్దనార్యుని లక్షణసార సంగ్రహమునందును అనంతుని ఛందోదర్పణమునందును శార్దూల విక్రీడిత వృత్తలక్షణముఁ జెప్పునప్పుడు — ప్రథమాశ్వాసము "కంజాతాప్తయతిన్ మ—స—జ్జ—స—త—తల్—గం బుంప శార్దూలయో" అని. "పద్మాప్తాంచిత విశ్రమంబుగ..." ఇత్యాదిగను పదిరెండవ యక్షరమునే యతిస్థానముగ నుడివినారు. అప్పకవీయము 4వ ఆశ్వాసములో శార్దూల విక్రీడిత వృత్తలక్షణలో "విశ్వవిశ్రాంతి" అని పదమూడవ యక్షరమును యతిగఁ జెప్పినాడు. ఇట్లే మఱికొన్ని ఛందోగ్రంథములలోను యతిస్థాన నిర్దేశమునందు ద్వైవిధ్యము కనుపించుచున్నది. సంస్కృత లాక్షణికులు చెప్పిన యతిస్థానమును దాటి ఆ ప్రక్క యక్షరము యతి అని అప్పకవ్యాదుల అభిప్రాయముగ నున్నది. యతిస్థాన బోధలో వీరి యీ నిర్ణయము తిరుపతి కొండలలో శ్రీ వేంకటేశ్వరుని ఆలయమును ఏడవకొండమీఁద అని చెప్పఁదగియుండ ఎనిమిదవ కొండమీఁద అన్నచో నెట్టులుండునో అట్టులున్నది. ఐనను నీ యీషద్భేదద్వయములో నేది శాస్త్రీయము, గ్రాహ్యము, ఏది అశాస్త్రీయము, అగ్రాహ్యము అని ఆలోచన కలిగినచో పద్యపాదమధ్యములో నిరువురు నుడివినదాని ననుసరించి యే యక్షరమునుయతిగ భావించినను గణభంగము లేనిచో, తెనుఁగు కనుక ఆ చెప్పిన యతి స్థానములో వ్యంజన—స్వర—మైత్రీభంగము కలుగక (ఖండాక్షర మైత్రి) యున్నచో రెండును శాస్త్రీయములే, గ్రాహ్యములే. తాతంభట్టాదులు చెప్పిన యతి సంస్కృతభాషా సంప్రదాయానుసారి యైనది యని, అప్పకవ్యాదులు చెప్పినది ఆంధ్రభాషా సంప్రదాయము అని తలంచి తృప్తి చెంద నగును.

## అ ను బ ం ధ ము

పాద మధ్యములలో యతిస్థానమును చెప్పుటయందు సంకర మార్గము.

తాతం భట్టాదులు సంస్కృత ఛ్చందశ్శాస్త్రము ననుసరించి వృత్త పాదముల మధ్యములందు యతులను నియతముగ విశ్రమ స్థానమునందును, అప్పకవ్యాదులు విశ్రమ స్థానమును దాటి ప్రక్క యక్షరమునే యతిగఁ బేర్కొనుటయు నియతముగ నున్నది. ఈరెండు పద్ధతులు సుప్రసిద్ధములు. సంకర మార్గమని పేర్కొనందగినది మూడవది మఱియొకటి కలదు. దానిని కొందఱు లాక్షణికులు కొన్ని గ్రంథములలో నవలంబించియున్నారు అట్టి రెండు మూడు గ్రంథములను తెలిపెదను.

కవి జనాశ్రయమునందు పద్యములలో యతి స్థానమునుఁ జెప్పుట — అప్పకవీయాదుల మాదిరి యతి స్థానమునకుఁ బై యక్షరమును యతి యని చెప్పక — తాతం భట్టుగారి సులక్షణ సారాను సారము పాద మధ్యములలో విశ్రాంతి స్థానమునే యతి చెప్పంబడినది. కాని శార్దూల మత్తేభాదులు కాని కొన్ని పద్యములలో మాత్రము ఒక్క ఛ్చందస్సులోని ఒక్క పేరటి వృత్తమునందే పాద మధ్య యతి సులక్షణ సారమందు చెప్పిన తావున గాక కొన్ని యక్షరముల తర్వాత చెప్పంబడినది.

ఆనంద రంగరాట్ఛందములో పద్యముల పాద మధ్య యతులు ప్రాయికముగ అప్పకవీయాను సారముగ విశ్రమ స్థానమునకు పై యక్షరము యతిగఁ జెప్పఁబడినది. కాని కొన్ని పద్యముల పాద మధ్య యతులను చెప్పుటలో సులక్షణ సారాను సారముగ విశ్రమ స్థానము నందే చెప్పఁబడినవి.

ఇకను విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో నీ రెండు రకముల యతి స్థాన బోధ తఱచుగ కనుపించు చున్నది. ఈ యత్యక్షర గణన మత భేదములు ఆయా గ్రంథములను విమర్శ దృష్టితోఁ చదివినచో తేటపడఁగలవు. ఉదా — కావ్యాలంకార చూడామణి 7వ ఉల్లాసములో—

"మన మారం బదమూఁట విశ్రమముగా ౭మత్తేభవిక్రీడితా
హ్వాన మయ్యెన్ స—భ—రం బు లన్న మయవ౭ న్యాసలబులం జెప్పినన్" అని మత్తేభ విక్రీడిత వృత్తలక్షణము. ఇందు "విశ్రమముగా" అను పదములో నుండు "గా" 13వ యక్షరము యతిగ చెప్పంబడినది. అనఁగా యతి స్థాన చిహ్నమయిన ౭ ఇట్టి గీటుకు

ముందటి వర్ణమే యతిగాఁ జెప్పఁబడినది. ఇకను ఆ ఉల్లాసము నందే మందాక్రాంతా వృత్తలక్షణములో —

''పొందం దంబై మ—భ—న—త—త—గా భూషితంబై తనర్చున్
మందాక్రాంతాహ్వయ మగు శివా ! మంద విశ్రాంతి చేతన్''

అను చోట ''శివ'' శబ్దముచేత ౧౧వ యక్షరము యతి కనుక ఆ యతి యతిస్థాన చిహ్నమైన ! ఇట్టి గీటును దాటిచెప్పఁబడినది పూర్వోదాహృతమైన మత్తేభవిక్రీడిత వృత్త లక్షణము ననుసరించినచో యతిస్థాన చిహ్నమయిన ! ఇట్టి గీటుకు ముందునే యతియై ౧౦వ యక్షరము యతిగ చెప్పఁదగును. అట్లు చెప్పలేదు గీటుదాటి ప్రక్క యక్షరము యతిగాఁ జెప్పఁబడినది. ఇట్లు ఒక వృత్తములో నొక తీరునను, మఱియొక వృత్తములో మీఱియొక తీరునను లక్షణమును వచించుట సంకరము. రెండు త్రోవలు గల గమ్యస్థానమునకు ఏ త్రోవనఁ బోయినను ఒక్కటే యైనట్లు లక్షణ బోధలో నించుక వైవిధ్యముగల యే గ్రంథము ననుసరించి రచించినను ఒక్కటియేయగును'' అని యొక్కమాటతో నింత చర్చను నెగురఁగొట్టు నీరసులున్నారు. విశేషజ్ఞులు సూక్ష్మదృష్టితో నింత చర్చఁ గావించి రహస్యమును గ్రహించి యానందించెదరు

తెనుఁగులో అప్పకవి మున్నగు కొందరు లాక్షణికులు పాదమధ్యమునందు సంస్కృతోక్తమైన ''యతి ర్విచ్ఛేదః'' అను లక్షణముతోఁ గూడిన యతిస్థానమునుఁ జెప్పక ఆ ప్రక్క యక్షరమును యతిగ నుడువుటకు నొక్కకారణము నా మనస్సుకుఁ దోచినది. అది తెనుఁగులో విరమణ స్థానమును దాటి దానిప్రక్క అనఁగా పాదములో రెండవ యంశముయొక్క తొలి యక్షరమునకు పాదాది యక్షరముతో మైత్రికలిగి యుండవలెను కనుక ''యతిస్థానమునకు పై యక్షరము అని పెక్కు అక్షరములు ఉచ్చరింపఁ బని లేకుండ'' ఉచ్చారణ సౌలభ్యము కొఱకును సుబోధార్థమును అట్లు నుడివి యుందురు అని.

## ౩. వృత్తవిశేషముల యతిస్థాన నిర్దేశమునందు లాక్షణికుల అభిప్రాయభేదములు

అన్ని వృత్తములయొక్క యతిస్థాన నిర్దేశమునందు పై యభిప్రాయ భేద మట్లుండఁ గొన్ని వృత్తవిశేషములయొక్క యతిస్థాన ప్రతిపాదనము వివిధ ప్రకారములనున్నది. మున్ముగ నొక వృత్తములో యతిస్థాన నిర్దేశ వైవిధ్యమునుఁ దెలిపి పిమ్మట అట్టివాటిని చక్రములోఁ జూపెదను. పృథ్వీవృత్తము—తాతం భట్టుగారి సులక్షణ సారములో—''వ త్రయోదశ యతిన్ గృతిన్ జ—స—జ—సల్—జ—తంబై య—వల్। దయాజలనిధీ! చెలంగు విను పృథ్వీధాత్రిం దగన్ ౩॥ దీనికి వావిళ్లవారి ముద్రిత గ్రంథమునందలి తాత్పర్య పంక్తులు—తా. జ—స—జ—స—య—వ యను గణంబులతోఁ గూడి పదునాల్గవ యక్షరము యతిగాఁ గలది పృథ్వీవృత్తమనఁబడును ఉదాహరణము—త్రయోద= ।ు।= జగణము, శ యతిన్=।।ు=సగణము, గృతిన్ జ=।ు।= జగణము, సజసల్= ।।ు= సగణము, జతంబై=।ుు= యగణము, యవల్=లగము ''త్ర'' యను మొదటి యక్షరమునకును పదునాలవ యక్షరమునకును యతి చెప్పెను ఇట్లే తక్కిన పాదములకును నని యెఱుంగవలయు'' అని, 'తాత్పర్య పంక్తులు' మూలములో ''త్రయోదశ యతిన్'' అని పదమూడవ యక్షరము యతి అని స్పష్టముగ అంకె పేరుతోనే చెప్పఁగా తాత్పర్యములో ''పదునాలవ యక్షరము యతిగాఁ గలది పృథ్వీవృత్తము అని యున్నది ఇకను చిత్రకవి పెద్దనార్యుని లక్షణసార సంగ్రహములో ప॥ ''జ—సల్—జ—స—లునున్ య—వల్ గిరిశసంజ్ఞ ''పృథ్విన్, యతుల్'' అని గిరిశసంజ్ఞ యతుల్ అనఁగా పదనుకొండవ యక్షరమునందు యతి అని. అనంతుని ఛందోదర్పణమునందును పదనుకొండవ యక్షరమే యతిగాఁ జెప్పబడినది ఇకను అప్పకవీయము ౪వ ఆశ్వాసము ''పృథ్వి ౧౭— ౩౦౭।౧ ।ు।జ ।।ుస ।ు।జ ।।ుస ుుయ ।ువ గణము ప॥ జ—సల్—జ—స—య—వంబు లుష్ణకర సంఖ్య విశ్రాంతులున్। బొసంగ కవిపుంగవుల్ పలుక భూమిలో ''పృథ్వినా'' అని ఇచ్చట అప్పకవి పదిరెండవ యక్షరము యతి యని నుడివినను పూర్వోక్తరీతిని ఆంధ్ర సంప్రదాయము ననుసరించినది కనుక ముందటి యిఱువురు లాక్షణికులు నుడివిన స్థానమునే యతిని జెప్పెనని యెఱుంగఁ దగును కాన నీయొక్క పృథ్వీవృత్తమునకే యిట్లు నాలుగు గ్రంథములలో నొక దానియందొక విధముగను, కడమ రెంటియందు మఱియొక లాగునను యతిస్థానము చెప్పఁబడినది (తాతంభట్టుగారు ౧౩వ యక్షరమును, అనంతుఁడు చిత్రకవి పెద్దనార్యుఁడు అప్పకవి ౧౧వ యక్షరమును యతిగాఁ జెప్పిరి ) అని సారాంశము

సంస్కృతోక్తమైన యతిస్థానముగాక ఆంధ్రములో స్థానము మార్చి యతి చెప్పఁబడిన కొన్ని వృత్తములను సుబోధార్థము చక్రములో వ్రాసి చూపెదను

| వృత్తము | సంస్కృతే | ఆంధ్రమునందు | | | | |
|---|---|---|---|---|---|---|
| | | సులక్షణసారే | ఛన్దోదర్పణే | చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహే | అప్పకవీయే | విశేషములు |
| పృథ్వీవృత్తము | ౮వ యక్షరము. మఱల ౯వది మొదలు పాదాంతము ౨వ యతి. | ౧౩వ యక్షరము | ౧౩వ యక్షరము | ౧౧ వయక్షరము కవిజనాశ్రయేచ | ౧౨వ యక్షరం | యతి స్థానములో నీ ఒక్కయంకె వార యతి స్థానమునకు పై యక్షరమును యతిగ గ్రహించుట చేత గలిగినది. |
| శిఖరిణి | ౬వ యక్షరము, పిమ్మట ౭వది మొదలు ౧౧వదియతి. | ౧౨వ యక్షరము యతి. | ౧౨ ,, | ౧౨ ,, | ౧౩ ,, | |
| శాలిని | ౪వ యక్షరము. పిమ్మట ౭ వదియు యతులు. | ఈ వృత్తలక్షణమేలేదు. | ౬,, | ౬ ,, | ౭ ,, | ,, |
| ప్రహర్షిణి | ౩వది, ౧౦ వదియు, | ,, | ౭ ,, | ౭ ,, | ౮ ,, | ,, |
| మానిని | లేదు. (ఒక్కలక్షణముతో మానినీ వృత్తమనికొన్నిగ్రంథములు, మాలినీ వృత్తమని కొన్ని గ్రంథములుచెప్పుచున్నవి.) | ఆరేసి యక్షరములకువంతున ౩ యతులు. | సులక్షణసారమునందు వలెనే | సులక్షణసారమందువలెనే | ౧౩వ యక్షరమొక్కటియే యతి | |
| మత్తాక్రీడ | ౮—౫—౧౦యక్షరములు యతులు. | ఈవృత్తలక్షణమే లేదు. | లేదు | ౮—౮ | ౯—౯ | ,, |
| కవిరాజ విరాజితం | లక్షణమేలేదు. | ౭వది. అది దాటి ౬ ,, ,, ౬ ,, వదియు | సులక్షణ సారమందు వలెనే | సులక్షణసారమునందువలెనే | ౮—౭—౭ | ,, |

ప్రబంధములలో మనుచరిత్రము ౪వ ఆశ్వాసములో ౧౦౦వ పద్యములోను, ౧౨౨వ పద్యములోను ఈ పృథ్వీవృత్తమునకు సంస్కృతము ననుసరించి ౮వ యక్షరమునే యతిగఁ బ్రయోగించి యుండ వావిళ్లవారి మనుచరిత్రములో ఆ ౪వ ఆశ్వాసను ౧౦౦వ పద్యముయొక్క వ్యాఖ్యానములో "ప్రియంబగుచు రుద్రవిశ్రమము పథ్వీకాసంజ్ఞికా। హ్యాయం బగు జ—సం—బుతో జ—స యంబు లన్ గూడినన్" అని ౧౧వ యతి యని యున్నను ఇందు ౯న యతి గలదు" అని మాత్రమే వ్యాఖ్యాతలు వ్రాసిరి. కాని ఆ యతి సంస్కృత ఛ్ఛందశ్శాస్త్రానుసారము ప్రయుక్తమని తెలుపరైరి. ఇట్లు తెలుపకుండటచేత అల్లసాని పెద్దనగారు తెలియకనో, పొర పాటుననో యతిని తప్పుగఁ బ్రయోగించిరి యని కొంద ఱనభిజ్ఞు లకు నాలోచన కలుగనోపును.

సంస్కృతములో వళికి (అనఁగా పాదముయొక్క మొదటి యక్షరమునకు) యతిస్థానములోని యక్షరములతో మైత్రి పాటింపవలసినట్లు నియమము లేదు. కనుక యతి నే స్థానమునందుఁ జెప్పినను యే యక్షరమును వేసికొనినను పరవలేదు. తెలుఁగులో అట్లుకాక వళి యతి స్థానములలోని యక్షరములకు మైత్రిని విధిగఁ బాటింపవలెను. కనుక ఇట్లు పాదమధ్యములలో పరిపరివిధములుగ యతి స్థాన నిర్దేశము చేయుట కొందఱ కవులకు యతిస్థాన నిర్దేశమునందు సందేహము చివరకు ఆ నియమమునందలి విశ్వాసమునకు భంగము వాటిల్లుటకు దారితీయఁ గలదు. కాన నిట్లు ద్వైవిధ్యములచేత సందేహ—వివాద హేతువుగ నున్న నీ యాంధ్ర ఛ్ఛందశ్శాస్త్రములోని యిట్టి వృత్తములయొక్క యతిస్థానము నవలంబించుటకంటెను సంస్కృత ఛ్ఛందోగ్రంథోక్తమైన యతి స్థానము నవలంబించి యిట్టి వృత్తముల రచించుచో సందేహ రహితముగను, వివాద రహితముగను నుండును. ఏలనన? పింగళాచార్యులు మున్నుగాఁగల మహర్షులు విద్వాంసులు సంస్కృత భాషయొక్క ఛ్ఛందశ్శాస్త్రమును విరచించునప్పుడు సమస్త వృత్తముల యొక్క పాదమధ్యములో విరతి స్థానమును చాలపర్యాలోచించి దానినిఁ గనిపెట్టి యతిస్థానముగ బోధించిరి. కనుక సంస్కృతములో వృత్తముల యతిస్థాన నిర్దేశములో పింగళాచార్యాది మునుల నిర్ణయమునే అనుసరించి లాతి లాక్షణికు లందఱు నొక్కవిధముగనే

చెప్పిరి. ఉదాహరణముగ నీ పృథ్వీవృత్తమునే చూచెదము. ౧ పింగళ చ్ఛందస్సూత్రే ౭ అధ్యాయే (సప్తదశాక్షరపాద వృత్తభేదోక్తిః ౧౦౯ పత్రే) ''౨౫౬ సూ. పృథ్వీ జ్సౌ జ్సౌ యౌగ్ వసునవకా'' ౧౬ అని. (ఇట్లే వృత్త రత్నాకరములో ౩వ అధ్యాయమునందు ౧౧వది యైన త్రిష్టుప్ ఛందస్సులోను మఱియొక పృథ్వీవృత్తము కలదు.) ౨. వృత్త రత్నాకరే సమవృత్త ప్రకరణే ''జ—సౌ—జ—స—య—లా—వసుగ్రహ యతిశ్చ పృథ్వీ గురుః. ౩. శ్రుతబోధే కాళిదాసశ్చ—ద్వితీయ మళికుంతశే యది ష డష్టమం ద్వాదశం। చతుర్దశ మథప్రియే గురు గభీరనాభి హ్రదే। సపంచదశ మంతిమం తదను యత్రకాన్తే యతిః। కరీం ద్రఫణభృత్కులై ర్భవతి సుభ్రు పృథ్వీతిసా'' అని యందఱి సిద్ధాంతము. ౮వ యక్షరము మొదటి యతి. ౯వ యక్షరము మొదలు పాదాంతమునందలి ౯వది రెండవ యతి. జ—స—జ—స—య గణములు ఒక్క లఘువు గురువును ప్రతిపాదములో నున్నచో పృథ్వీవృత్తము. ఇట్టులే కడమ సమస్త ఛన్దోగ్రంథములలోను నీ వృత్తమునకును, తతిమ్మా వృత్తవిశేషములకును యతిస్థాన నిర్దేశ మొక్కవిధముగనే యుండును.

# ౪. యతిస్థానపు మార్పిడిచేత నొక వృత్తము వేఱొక వృత్తముగ మాఱుట

కలదు గదా? అట్లే ఈ యతిస్థాన నిర్దేశ ద్వైవిధ్యముచేత నిట్టి యొక వృత్తము వేఱు వృత్తముగఁ జెప్పఁదగదా? యనినచో అట్లు కాదు. అట్టివి సంస్కృతములో ౩ — ౪ వృత్తములు, ఆంధ్రములో ౪ — ౫ పద్యములుకలవు. ఈ యతిస్థానపు మార్పిడి చేత నయ్యెడి వృత్తాంతరత్వము నామాంతరత్వము ౨—౩ వృత్తములకు లాక్షణికులు చెప్పియున్నారు. వేటిలో యతి వ్యత్యయము (అనఁగా యతిస్థానపు మార్పిడి)చేత పాఠగమనముమాఱి వృత్తాంతరత్వము ప్రస్ఫుటమగునో అట్టివాటినే గమనించి లాక్షణికులు పై విషయమునుఁ దెలిపియున్నారు. ఇది కొన్నిఁటిలో నస్ఫుటముగను, కొన్నిఁటిలో ప్రస్ఫుటముగను నుండును. ముం దుదాహృతమైన పృథ్వీ వృత్తమునకు యతి వ్యత్యాసముచేత వృత్తాంతరత్వ పరిణామము లేదు.

అనుబంధముగా నిచ్చట నీ విషయమును ఇంచుక వివరించెదను. న—జ—భ—జ—జ—గణములు, ఒక్క లఘువు నొక్క గురువును ప్రతి పాదమునను నున్నచో నత్కుటక వృత్తమగును. దీనికి ఆదినుండి ౭ యక్షరము, దానితర్వాత ౮వ యక్షరము మొదలు పదవ యక్షరము(పాదాంతము)రెండవ యతి. పిమ్మట—ఈవృత్తమునందే తొలినుండి ౭వ యక్షరము అది మొదలు (అనఁగా ౮వ యక్షరము మొదలు) ౬వ యక్షరము, మఱలా అది మొదలు ౬వ యక్షరము యతియైనచో కోకిలక వృత్తమగును. గణములు ఒక్కటే.ఇందుకు వృత్తరత్నాకరము సమవృత్త ప్రకరణములో౩ వ అధ్యాయమునందు ''హ య ద శ భి ర్న జౌ భ జ జ లా గి తి నత్కుటకమ్.'' ౧౭ — ౬ || ముని గుహ కార్ణ వైర్గ కృత యతిం పదకోకిలకం'' ౧౭ || ౭ || ఈ లక్షణములకు నారాయణ పురోహితుని మణినిధి వ్యాఖ్యాన పంక్తులు చదివినచో వీటి యర్థము చక్కగ తెలియును. ఆ పంక్తు లివి: ''హ య ద శ భి ర్న జౌ భ జ జ లా గి తి నత్కుటక మితి. నగణ జగణౌ భగణో జగణద్వయం లఘు గురూ చేతి నత్కుటకం వృత్తం. సప్తభి ర్దశభిశ్చ యతిః. ఉ|| జలధర మేచకే... ౧౭ || ౬ || అథాఽస్య యతి విశేషే న్నామభేద మాహ—ముని గుహకా ర్ణవైర్గ కృతయతిం వద కోకిలక మితి। మునిభి స్సప్తభిః గుహకైః కుమార ముఖైః షడ్భిః అర్ణ వైశ్చతుర్భిశ్చ కృత యతిం పూర్వోక్తం నత్కుటకం కోకిలకం వదేతి శిష్య సంబుద్ధిః. మనసిజ జీవితే...అని లక్షణములు ఉదాహరణములతో సహ చెప్పఁబడినవి. ఈ నత్కుటకమనే అప్పకవి నర్కుటక మని చెప్పినాడు. కుండలీకరణము (ప్రాకెట్టు) లో కోకిలకాక మని మాత్రము ఉన్నది. పై విధమున యతి వ్యత్యాసము చేత కోకిలక వృత్తమని చెప్పలేదు. చిత్రకవి పెద్దనార్యుఁడు లక్షణసార సంగ్రహములోఁ దెలిపినాడు. ఆ పద్యములివి: ''న—జ—భ—జ—జ—ల్వయున్ యతిగ—నన్ దిశ నర్కుటకున్|| అగ రస విశ్రమాఖ్య పద కోకిల కాంక మిదే...అని. (కోకిల కాక మని అప్పకవి. కోకిల కాంక మని చిత్రకవి పెద్దనార్యుఁడు. అగ ౭, రస ౬, పద ౪ అని యతిస్థాన బోధము.)

మఱి యొకటి—ఒక్కొక్కపాదమునందు రెండు నగణములు, రెండురగణములు కూర్చినచో ప్రభావృత్తమగును. ఈ వృత్తములో ప్రతి పాదమునందు ఏడవ యక్షరము దానితర్వాత వ యక్షరమును యతి. ఈ వృత్తమే యతి నియమము లేనిచో ప్రముదిత వదనా వృత్తమగును. ఈ లక్షణమున్ను వృత్త రత్నాకరము ౩వ అధ్యాయములో ''స్వర శర విరతి ర్న నౌ రౌ ప్రభా'' అని చెప్పఁగా దీని వ్యాఖ్యానమందు నారాయణ పురోహితుఁడు ''ద్వౌ నగణౌ ద్వౌ రగణౌ చ ప్రభా. సప్త సుచ పంచ సుచ యతిః. యతి నియమాభావేతు ఇయమేవ ప్రముదిత వదనా భవతి''అని తెలిపినాడు. అప్పకవీయమునందు ప్రముదిత వదన అని మాత్రము నుడివి తల్లక్షణ పద్యము వ్రాసియున్నాఁడు. మఱి యొకటి — పదునాలుగు లఘువులు నాటి వెనుక ఒక్క గురువు ప్రతి పాదమునందునుఁ గూర్చినచో శశికల అను వృత్తమగును. దీనికి యతి లేదు. వృత్త రత్నాకరము ౩ వ అధ్యాయము (పాదమునకు ౧౫ అక్షరములు గల) అతిశక్వరీఛందస్సులో ''ద్విహత హయ లఘు రథ గితి శశికలా'' ౧౫|| ౧|| అని. ఈ శశికలా వృత్తమే తొలి నుండి ౬వ యక్షరము, మఱలి ౯వ యక్షరము మొదలు ౯వయక్షరమున్ను, యతిగాఁగలదియగుచో స్రక్ అనెడిపేరుగల వృత్తమగును. వృత్త రత్నాకరమునందే శశికలా వృత్త లక్షణము ప్రక్క ౧౫|| ౨|| ''స్రగితి భవతి రస నవక యతి యుతా'' ౧౫|| ౨|| అని యీ శశికలా వృత్తమే తొలినుండి ౮వది, అట నుండి ౭వదియు నక్షరము యతి యగుచో మణిగుణ నికర వృత్త మగును. వృత్త రత్నాకరమునందు ''స్రక్'' వృత్త లక్షణము ప్రక్కనే ''వసు హయ యతి రిహ మణిగుణ నికరః'' ౧౫|| ౩||అని. ఈ లక్షణములకు నారాయణ పురోహితుని వ్యాఖ్యాన పంక్తులు — ''అతి శక్వర్యామ్. ద్విహత హయ లఘు రథ గితి శశికలే తి. అతిశక్వర్యాం పంచదశే ఛందసి — ద్విహతాః ద్విగుణాః

హయాః సప్త, చతుర్దశ లఘవో యస్యా స్యా అథ అంతే గురుశ్చ శశికలే త్యుచ్యతే. ఉ॥... యదువర కమల మిద ..., ౧౫॥ ౧॥ స్రగితి భవతి రస న వక యతి రియ మితి. ఉక్తస్యైవ వృత్తస్య యతి విశేషవశా న్నామ విశేష మాహ. స్రగితీ తి, ఇయం పూర్వోక్తా శశికలైవ షడ్భి ర్నవభిశ్చ ఛిన్నాచేత్ స్రక్ ఇతి సంజ్ఞితా భవతి. ఉదా॥ యదువర మమ భవ ... ౧౫॥ ౨॥ అస్యైవ పున ర్యత్యం తరా న్నామాంతర మాహ. వసు హయ యతి రిహ మణి గుణనికర ఇతి.॥ ఇహ ఉక్త శశికలా వృత్తే అక్షరాష్టవే ఽ క్షర సప్తకేచ యతిశ్చే న్మణిగుణ నికరో నామ వృత్తమ్.॥ ఉ॥ కుచయుగ మిద మయి...'' ఈ లక్షణ శ్లోకములకు కవి శార్దూల శ్రీనాథుని ధీశో ధినీ వ్యాఖ్యాన పంక్తులలో విశేషము చెప్పంబడినది. అది...శశికలా స్రజ్మణి గుణ నికరాణాం ప్రతిపాదం ఆదిత శ్చతుర్దశ లఘవః. అనంతరం గురు శ్చైకః. ఇ త్యేత త్సమానం. — ఆద్యాయాః యతె నియమా భావః. ద్వితీయస్యా షడ్భి ర్నవభి శ్చాఽక్షరైః — తృతీయస్యా అష్టభి స్సప్తభిశ్చ వర్ణై ర్యతి రిత్యయ మన్యోన్య భేదః. ౧౫॥ ౪॥, అప్పకవీయ సులక్షణసార ఛందో దర్పణముల యందు ఇంత విశేషముచెప్పక ఒక్క మణిగుణనికర వృత్తలక్షణము మాత్రము చెప్పంబడినది. చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహము నందు చెప్పియున్నాడు. ''మను లఘువులు గను—మహి శశికళయౌ'' కరి యతి నిది మణి — గణ నికర మగున్, రసయతి నిది ''స్ర'' గభిధఁ దనరున్'' అని. మణి గుణ నికర వృత్త మంతయూ నొక కంద పద్య మగును. ప్రమితాక్షరా వృత్తమంతయు నొక కంద పద్య మగును. మంజుల వృత్త మంతయు నొక కంద పద్యమగును. క్రౌంచపద వృత్తము భాస్కర విలసిత వృత్తము సరసిజ వృత్తము నివి యొక్కొక్కటి రెండేసి కంద పద్యము లగును. ఒక రకమైన సీస పద్యము దాని యెత్తు గీతియు ద్విపద యగును.

ఇట్లు యతి వ్యత్యాసముచేత నొక వృత్తము వేరొక వృత్త ముగ మాఱుట చిత్రకవితా విశేషములలోఁ జేరినది. ఇట్టివియు మఱి కొన్నియు విచిత్రములు సంస్కృతసంబంధములైనవిసంస్కృతములో ముద్రితమైన ''చిత్రబంధ శ్రీనివాస'' మను గ్రంథములోను, ఆంధ్ర ములో ముద్రితమయ్యేన శ్రీ వేంకటేశ్వర చిత్ర రత్నాకరము నందును గాంచనగును. (వృత్త రత్నాకర లక్షణ సార సంగ్రహా దులలో నీ లక్షణమును నుడువుట చిత్ర కవిత్వ దృష్టితోఁ గాదు. ఆ యా వృత్తముల లక్షణ ప్రతిపాదన నిమిత్తమని గ్రహించునది.)

## ౫. సంస్కృతములో యతి స్థానము లేకున్నను ఆంధ్రములో యతి స్థానము కల్పింపఁబడిన కొన్ని సంస్కృత వృత్తములు

సంస్కృతములో రుక్మవతి, ఇంద్రవజ్ర, ఉపేంద్ర వజ్ర, దోధక,రథోద్ధత, స్వాగతా, శ్యేనీ, (జగచ్ఛందస్సులో)వంశస్థ,ఇంద్ర వంశ,ద్రుత విలంబిత,తోటక,భుజంగప్రయాత,స్రగ్విణీవసంతతిలకా (గాథలయందు అతిజగతీచ్ఛందస్సులో)—కనక ప్రభా—వరసుందరీ—వరయువతీ — మున్నగు కొన్ని వృత్తములకు పాదమధ్యములో యతి లేదు. సంస్కృత సంప్రదాయముతో పాదాంతమే యతి. కనుకనే పింగళ ఛందస్సులో ఆయా వృత్తముల లక్షణ ప్రతిపాదక సూత్ర ముల వ్యాఖ్యానములో భట్ట హలాయుధుఁడు ''పాదాంతే యతిః'' అని చెప్పినాడు. ఇట్లుండ తెలుగుఛంద శ్శాస్త్ర కర్తలు ఇట్టి వృత్తములకును పాదమధ్యమునందు నొక్క యక్షరమును యతిగ గల్పించి వళితో నక్షరమైత్రినిఁ బాటించియున్నారు. అప్ప కవ్యాదులు కొందఱు ఈ వృత్తములకు యతిస్థానమును కంఠోక్త ముగ నుడివియున్నారు. తాతం భట్టాదులు కొందఱు వీటికి యతి స్థానమును కంఠోక్తముగ చెప్పలేదు కాని వారు అప్పకవ్యాదులు యతి చెప్పిన తావుననే వళ్యక్షర మైత్రినిఁ బాటించి రచించుటచేత వీటికిని యతిస్థానకల్పనము వారికిని సమ్మతమని యేర్పడుచున్నది.

## అప్పకవీయము ౪వ ఆశ్వాసము

గీ॥ అడుగులకు వర్ణములు గొంచె మగుటఁజేసి
యందు నుక్త ప్రభృతి, నవచ్ఛందములను
బొడము వృత్తములకు నెల్ల వడులులేవు
నాల్గు పదములఁ బ్రాసము ల్నడచుఁ గాని॥౧౪॥

అని చెప్పెను గాని ఆ నవచ్ఛందస్సులలో ఎనిమిదవదియయిన అనుష్టుప్ ఛందస్సులోని విద్యున్మాలావృత్తమునకు పాదములో నాలుగేసి యక్షరములకు యతి యున్నది. భట్టహలాయుధుఁడు కూడా పింగళచ్ఛందస్సు ౬వ అధ్యాయములో సూ. ''విద్యున్మాలా మౌ గౌ ॥౬॥ అనెడు సూత్రముయొక్క వ్యాఖ్యానాంతములో ''అత్ర చతుర్భి శ్చతుర్భిశ్చ యతి రిత్యామ్నాయః'' అని తెలిపి నాడు. ఇట్లే మాణవకా క్రీడితకాది వృత్తవిశేషములకును అందు చూడఁదగును. అప్పకవి పై రీతిని ఉక్తాది బృహత్యంతములైన తొమ్మిది ఛందములకు పాదమధ్యమునందు యతిలేదని నుడివెనే కాని ఆయన పద్యము తదితర లాక్షణికుల పద్యములు చూడఁగా నాలుగేసి వర్ణములకు యతి నియతి ఖండాక్షర మైత్రింబట్టి వారు కూడా పాటించిరని యెఱుంగఁదగియున్నది.

## ౬. కొన్ని వృత్తములయొక్క పాదమధ్యములలో సంస్కృతమున నున్నన్ని యతులు తెలుఁగులో పాటింపఁబడ లేదు.

ఇదియు గమనింపఁదగిన యంశము. మేఘవిస్ఫూర్జితము, మందాక్రాంత మున్నగు కొన్ని వృత్తములకు సంస్కృతములో పాదాంతమునందుఁగాక పాదమధ్యములలోను రెండు—మూడు యతులు కలవు. అట్టి వృత్తములకు నాంధ్రములో పాదమధ్యమున నొక్కటే యతిస్థానము లాక్షణికుల కటాక్షమునకుఁ బాత్రమై యొప్పుచున్నది. ఎట్లన? మేఘవిస్ఫూర్జితవృత్త లక్షణము—వృత్త రత్నాకరము ౩వ అధ్యాయమునందు (సమవృత్త ప్రకరణము.) ౧౯. అతిధృత్యాం శ్లో॥ రసర్త్వశ్వైర్యౌ మ్నౌ సరర గురుయుతా

మేఘవిస్ఫూర్జితం స్యాత్'' ౧౯।౧౦॥౬—౬—౭ అక్షరములు యతి స్థానములు. మందాక్రాంతా వృత్త లక్షణము—వృత్తర త్నాకరే. ''మందాక్రాంతా జలధి షడగై ర్మ్భౌ న తౌ తో గురూచే దితి—మగణ భగణౌ నగణ తగణౌ పునస్తగణో ద్వౌ గురూచ ప్రతిపాదం చేత్—మందాక్రాంతావృత్తం భవతి. జలధిభిశ్చ తుర్భిః—షడ్భిః—అగ్నైః పర్వతైః సప్తభిశ్చ యతిర్భవతి. అగశబ్దేన సప్తసంఖ్యా వగతిః సప్తైవ గోత్రాచలా ఇతి ప్రసిద్ధేః'' అని. ౧౭॥౫॥ ఇక నారాయణ పురోహితుని మణినిధి వ్యాఖ్యానపంక్తులు — ''మందాక్రాంతా జలధి షడగై ర్మ్భౌ నతౌతో గురూచే'' దితి. మగణ భగణౌ నగణః తగణద్వయం గురుద్వయంచ పాదః తత్ర చతురక్షరల్ప్రథమో... శః షడక్షరో మధ్యమః. సప్తాక్షర స్తృతీయ ఇతి యతశ్చేత్ మందాక్రాంతానామ వృత్తం ॥ఉ॥ రక్షోనాథం—రణ భువి తదా—రాజమానం స్వభాసా—॥ దృష్ట్వా కోపా—ద్దశరథసుతే—దీప్తభాను ప్రకాశే— కోదండేన—స్ఫుట గుణవతా—తేన భూ ర్భ్రూ ధరేంద్రైః—మందాక్రాంతా—సహజలధిభి—స్సంశయం సంప్ర పేదే—॥ మందం శనై రాక్రాన్తా భూః భూధరేంద్రైం, స్పహే తి సంబంధః''॥౧౭॥౪॥

ఇకను తెనుగులో అప్పకవీయము ౪వ ఆశ్వాసములో మందాక్రాంత.౧౭. ౧౮౯—౯౦ మందాక్రాంత న్నిదిశ విరతు ల్మ భ్నతాతా గణంబుల్...'' అని ౧౧వ యక్షర మొక్కటే యతి. మేఘవిస్ఫూర్జిత వృత్తము. ౧౯.౭౫౭౦౪, ''క్షమాలక్ష్మీనాథున్ విదురవరుదున్, జాహ్నవీ జాతపాదున్...విశ్వవిశ్రాంతి చేతన్'' అని ౧౩వ యక్షర మొక్కటియే యతి. సులక్షణసార ఛందోదర్పణ చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహములయందును ఇట్లే యొక్కటావునసే యతి చెప్పబడినది. ఆంధ్రభాషా సంప్రదాయము ననుస రించి పాదాంతమును యతిగ గ్రహింపకున్నను మందాక్రాంతా వృత్తమునందలి తొలి నాలుగు గురువులు ఒక విచ్ఛేదముగను, తర్వాత ఐదు లఘువులు నొక్క గురువు నొక విచ్ఛేదముగను నను భవ సిద్ధమగు లగుచున్నను తొలి యతిని నంగీకరింప మినిఁ జూడఁగా తాబట్టిన కుందేటికి మూడేకాళ్లు అన్నట్టు లున్నది. మేఘ విస్ఫూర్జిత వృత్తములోను తొలియారు అక్షరములకు యతి స్పష్ట ముగ నున్నను దానినివిడచుటయు నిట్టులే యున్నది.

సంబోధార్థము పట్టికలోవ్రాసి చూపెదను.

సంస్కృతములో పాద మధ్యములో పలు యతిస్థానములు కలిగియు,తెలుగులో నొక్కయతిస్థానమే చెప్పబడిన కొన్నివృత్తములు.

| వృత్తము | సంస్కృతములో | ఆంధ్రములో | | | |
|---|---|---|---|---|---|
| | | అప్పకవీయము | ల—సా—సంగ్రహము | సులక్షణసారము | ఛన్దోదర్పణము |
| మందాక్రాంత | ౪_౬.౭ అక్షరములు యతులు. ౩ వది పాదాంతము. | ౧౧ వ యక్షర మొక్కటే యతి | ౧౦ వది యతి. | ౧౦ వది యతి | |
| హరిణీ | ౬—౪—౭ | ౧౨వది యొక్కటే | ౧౨ ఒక్కటే | | ౧౧ ఒక్కటే |
| కరిణీ | ౫—౫—౫ | ౦ | ౦ | ౦ | ౦ |
| మేఘవిస్ఫూర్జితము | ౬—౬—౭ | ౧౩ వది ఒక్కటే | ౧౨ ,, | ౧౩ | ౧౨ ,, |
| అశ్వలలితం | ౭—౧౧—౬ | ౧౩ ఒక్కటే | ౧౨ ,, | ౦ | ౧౨ ,, |
| తన్వీ | ౫— ౭—౧౨ | ౧౩ ,, | ౧౨ ,, | ౦ | ౦ |
| హరిణ ప్లుతం | ౮— ౫— ౫ | ౧౧ ,, | ౧౦ ,, | ౧౦ | ౧౧ ,, |

హరిణప్లుత వృత్త లక్షణము వృత్త రత్నాకరములోను, దాని నారాయణ పురోహితుని మణినిధి వ్యాఖ్యలోను నొకవిధముగను, పదరు వృత్తరత్నాకరముయొక్క యే శ్రీనాథుని శ్రీశోధినీ వ్యాఖ్య యందును కాళిదాసుని వృత్తరత్నావళి యందును నొక్క విధముగ నున్నది. ఈ హరిణప్లుత వృత్తమే ౧౦ యక్షరము యతియైనచో మత్తకోకిల వృత్తమగును. చూ. లక్షణసార సంగ్రహే —

నా కీ వ్యాస రచనోద్దేశము కలుగుటకుఁ గారణమైన నొక సంఘటనను ఇచ్చటఁ దెలిపెదను. నేను కొంత కాలమునాడు ఒక యూరిలో నొక మిత్రుని దర్శింప వెళ్లితిని. నేను వెళ్లనప్పటికి ఆ మిత్రుఁడు తనకు పరిచితుఁడైన యొక కవితో వాదులాటయం దుండెను. నేను నా మిత్రునిదే అయినప్పుడు ఆ యిద్దఱు కోప ముతో నిట్లను కొనుచుండిరి: నా మిత్రునితో వాదులాడుచుండు కవి — నీవు నీ గ్రంథమును నాకు చదివి వినిపించుటకు వచ్చితివా? లేక నాతో వాదులాడ వచ్చితివా ? అని. అందుకు నా మిత్రుఁడు, నేను పనిలేక నీతో వాదులాడ రాలేదు. నీకు నా గ్రంథమును విని పించ వచ్చితిని. కాని నీవు మర్యాద లేకుండా మాటలాడుచున్నావు'' అని. ఈ సంభాషణలో నేను వారి వద్దకు వెళ్లితిని. నన్నుజూచి నా పరిచిత మిత్రుఁడు ''అరుగో ఆ వచ్చు చున్నవారు గొప్ప విద్వత్కవి. ఇవ్విషయములో వారేమి చెప్పెదరో విందము. ఉండుము అని తనతో వాదులాడుచున్న ఆ తన పరిచిత కవితోఁ జెప్పి నాతో అన్యోన్య కుశల ప్రశ్నాద్యనంతరము ''పృథ్వీ వృత్తమునకు నిన్నివ యక్షరము యతి ?'' అని యడిగెను. అందుకు నేను ''సులక్షణ సారమునందు ఒక చోట యతి. అప్పకవీయ ఛందోదర్పణ చిత్ర కవి పెద్దన లక్షణసార సంగ్రహముల యందు వేరొక చోట యతి. ఇట్లీ వృత్తమునకు ఒక్కొక్క లాక్షణికుఁ డొక్కొక్క తావున యతినిఁ జెప్పినారు. సంస్కృతమునందు ఎనిమిదవ యక్షరము, దానితర్వాత తొమ్మిదవ యక్షరము వద్దను యతులు. సంస్కృత ములో నెందఱు లాక్షణికులు చెప్పినను యతిస్థాన నిర్దేశములో

శ్రీ యిమ్మానేని సత్యసుందరం

# వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి

ఆర్థికాభివృద్ధి ప్రయోజనాలు అన్ని ప్రాంతాలలో అందరికి చేకూరవలెననుటలో సందేహం లేదు. అయితే, చాలాకాలంగా ప్రాంతాల మధ్య అభివృద్ధిలో వ్యత్యాసములు ఉంటునే ఉన్నవి. ఒకప్పుడు ఈ వ్యత్యాసములు ఆర్థికాభివృద్ధితో పాటు అంతరించునని అభిప్రాయ ముండెడిది. అయితే, ప్రస్తుతం ఆర్థికాభివృద్ధితో పాటు ప్రాంతీయ అసమానతలు కూడ పెరుగుచున్నట్లు తేలినది. ఈ కారణంగా వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రభుత్వం ముందుకు రావలసి వచ్చినది. పారిశ్రామికాభివృద్ధి ప్రైవేటు ఉత్పత్తిదారుల చేతులలో వున్నంత కాలము ప్రాంతాల అసమానతలను తొలగించుట సాధ్యంకాదు. వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు స్థాపించినట్లయితే ప్రైవేటు వ్యక్తులు పరిశ్రమల స్థాపన కయ్యే ఖర్చేకాకుండా, ఆర్థిక, సాంఘిక అవస్థాపనకు (Economic and social infrastructure) అయ్యే ఖర్చుకూడ భరించవలెను. రవాణా, నీటిపారుదల, మార్కెటింగు, విద్యుచ్ఛక్తి సౌకర్యములు ప్రైవేటు వ్యక్తులు సమకూర్చుకొనలేరు. ఈ కారణంగా, వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు స్థాపించే ప్రైవేటు ఉత్పత్తిదారులకు ప్రభుత్వం ప్రత్యేక సౌకర్యములు కల్పించుచున్నది. భారత దేశంలాంటి పెద్ద దేశంలో ప్రాంతాల మధ్య వ్యత్యాసములుండుట సహజము. అయితే, ఈవ్యత్యాసములు విపరీతంగా వుండకుండ చూడవలెను. నాల్గవ పంచవర్ష ప్రణాళిక మొదటినుండి వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి విషయంలో ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ చూపుచున్నది.

దేశంలో ఉన్న వెనుకబడిన రాష్ట్రాలను జిల్లాలను నిర్ణయించుటకై 1968లో ప్రభుత్వం పాండెకమిటీని (Pande Working Group) నియమించినది. ఆ తరువాత వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రభుత్వం ఎటువంటి సౌకర్యములు కల్పించవలెనో నిర్ణయించుటకు వాంఛూ కమిటి (Wanchoo Working Group) నియమింపబడినది. రాష్ట్రముఖ్యమంత్రులను సంప్రదించిన తరువాత కేంద్రం వెనుకబడిన ప్రాంతాలను నిర్ణయించుటకు కొన్నిసూత్రాలను ఏర్పరచినది. వాటిని ఆధారంగా రాష్ట్ర ప్రభుత్వాలు తమ రాష్ట్రాలలో వెనుకబడిన ప్రాంతాలను ప్రకటించినవి.

ఇంతవరకు వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రభుత్వం తీసికొన్నచర్యలు ముఖ్యంగా (1) వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమల స్థాపనకు సంస్థల నుండి తక్కువ వడ్డీ రేటుకు దీర్ఘకాలిక ఋణాలను సమకూర్చుట. (2) పరిశ్రమ స్థాపనకయ్యే స్థిరమూలధనము (Fixed Capital) లో కొంత శాతం సబ్సిడీగా కేంద్ర ప్రభుత్వం భరించుట. (3) రవాణా ఖర్చులపైకూడ కొండ ప్రాంతాలలోను, మిగతారవాణా ఇబ్బందులున్న ప్రాంతాలలోను రవాణా సబ్సిడి (Transport Subsidy) సమకూర్చుట మరియు (4) వెనుకబడిన ప్రాంతాలలో వున్న పరిశ్రమల విషయంలో, ఆదాయ అమ్మకపు పన్నులను తగ్గించుట. ప్రభుత్వం తన లైసెన్సు విధానం ద్వారాకూడ పరిశ్రమలు అభివృద్ధి చెందిన ప్రాంతాలలో కాకుండ వెనుకబడిన ప్రాంతాలలో స్థాపించేటట్లు చూసినది.

అయితే, ప్రభుత్వం సమకూర్చిన ఆర్థిక సౌకర్యములు, రాష్ట్రంలో ప్రాంతాలమధ్య వ్యత్యాసములను కొంతవరకుతగ్గించినా, రాష్ట్రాల మధ్య వ్యత్యాసాలను తగ్గించలేకపోయినవి. దానికి ఒక ముఖ్యకారణం, ప్రభుత్వం సమకూర్చే సహాయంలో ఎక్కువభాగము అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో వున్న వెనుకబడిన ప్రాంతాలకు లభించినది. ఆర్థికసౌకర్యాలద్వారా వెనుకబడినప్రాంతాలను అభివృద్ధి చేసే ప్రస్తుత పద్ధతిలో కొన్నిలోపములున్నవి. వెనుకబడిన జిల్లాల సంఖ్య ఎక్కువగా వుండగా, వాటి అభివృద్ధికి నిర్దేశించిన వ్యయము చాలతక్కువ. తక్కువ వడ్డీరేటుతో ఋణాలను పొందుచున్న జిల్లాల సంఖ్య ప్రస్తుతం 243 (మొత్తం జిల్లాలలో 63.4 శాతం, మొత్తం జనాభాలో 57.2శాతం). మొదట్లో 44 జిల్లాలు మాత్రమే కేంద్ర సహాయమునకు అర్హత పొంది వుండెడివి. పాండే కమిటి, వాంఛూ కమిటి కూడా అధిక సంఖ్యలో జిల్లాలకు సహాయం సమకూర్చుటను వ్యతిరేకించినవి. జిల్లాల సంఖ్య పెరిగినకొలది ఏజిల్లాకు తగినంతసహాయం లభించదని వారి అభిప్రాయము. వెనుకబడిన రాష్ట్రాలలో సుమారు 30 జిల్లాలలో ముందుగా సహాయమును విస్తృతం చేయవలెనని పాండేకమిటి చెప్పెను. విచిత్రమేమిటంటె వెనుక బడిన రాష్ట్రాలు తమరాష్ట్రాలలో తక్కువ శాతం జిల్లాలను వెనుకబడినవిగా ప్రకటించగా, అభివృద్ధిచెందినరాష్ట్రాలు తమరాష్ట్రాలలో ఎక్కువ శాతం జిల్లాలను వెనుకబడినవిగా ప్రకటించినవి. ఉదాహరణకు, బాగా అభివృద్ధిచెందిన పశ్చిమ బెంగాలు రాష్ట్రంలో 81.2 శాతం జిల్లాలు వెనుకబడినవిగా ప్రకటించబడినవి.

వెనుకబడిన రాష్ట్రాలను నిర్ణయించుటలో అవలంభించిన పద్ధతిలో కూడా లోపం కనబడుచున్నది. వెనుకబడినతనాన్ని నిర్ణయించుటకు ప్రణాళిక సంఘం తీసికొన్న అంశములు అభివృద్ధి

---

రచయిత మచిలీపట్టణము హిందూకాలేజిలో పోస్టు గ్రాడ్యుయేటు ఆర్థికశాస్త్రశాఖలో లెక్చరర్.

చెందిన రాష్ట్రాలకి అనుకూలంగా వున్నవి. ప్రణాళిక సంఘం తీసికొన్న అంశములు ఇవి: (1) ఆహారధాన్యాల – వాణిజ్యపు పంట తలసరి ఉత్పత్తి (2)మొత్తం జనాభాలో వ్యవసాయ కార్మికులశాతం (3)సగటు పారిశ్రామిక ఉత్పత్తి (4)ప్రతిలక్ష జనాభాకు పారిశ్రామిక శ్రామికుల సంఖ్య లేక వ్యవసాయేతర శ్రామికుల సంఖ్య. (5)తలసరి విద్యుచ్ఛక్తి వినియోగం (6) రోడ్డురవాణారైల్వేల అభివృద్ధి మరియు (7)వెనుకబడిన జిల్లాలకు ప్రభుత్వసహాయం పొందవలెనంటె కనీస అవస్థాపనసౌకర్యములుండవలెను. ఈఅంశాలు ప్రాంతాలలో వెనుకబడినతనాన్ని లెక్కలోనికి తీసికొనుటకు బదులు, ఆ ప్రాంతాల అభివృద్ధి అవకాశాలను లెక్కలోనికి తీసికొనుచున్నవి. అంతేకాకుండా, వెనుకబడిన రాష్ట్రాలను నిర్ణయించే అంశాలు, వెనుకబడిన జిల్లాలను నిర్ణయించే అంశాలు వేరువేరుగా వున్నవి. కేంద్రప్రభుత్వం సమకూర్చే ఆర్థిక సౌకర్యాలను ఉపయోగించుకొనుటలో అభివృద్ధిచెందిన రాష్ట్రాలకే ఎక్కువ అవకాశములున్నవి. ప్రభుత్వసహాయం పొందుటకు కనీస అవస్థాపన ఉండవలెననుట వలన వెనుకబడిన రాష్ట్రాలలో వెనుకబడినప్రాంతాలు సహాయమును పొందలేవు.

ఇంకొక ఇబ్బంది ఏమిటంటె, వెనుకబడిన ప్రాంతాలలో అవస్థాపన సౌకర్యములు కల్పించే బాధ్యత రాష్ట్రప్రభుత్వాలదే. ఈ విషయంలోకూడా అభివృద్ధిచెందిన రాష్ట్రాలే ఎక్కువ అవస్థాపనసౌకర్యాలను సమకూర్చుకొనగలవు. బ్యాంకులుకూడాఅభివృద్ధి చెందిన ప్రాంతాలలోనే అవస్థాపన సౌకర్యములకు ఎక్కువగా ఋణములను సమకూర్చును.

రాష్ట్రప్రభుత్వాలు కూడా వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి కొన్ని సౌకర్యములు సమకూర్చుచున్నవి. ఈ సౌకర్యాలు ఆయా రాష్ట్రప్రభుత్వాలు సాధించిన అభివృద్ధిపైన, రెవెన్యూపైన ఆధారపడును. రాష్ట్రప్రభుత్వాలు వెనుకబడిన ప్రాంతాలకు సమకూర్చే సౌకర్యాలలో ముఖ్యమైనవి (1) తక్కువ ఖర్చులో భూమి, విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా, ముడిపదార్థాల సరఫరా మొదలగు అవస్థాపన సౌకర్యములు (2) వడ్డీ లేకుండా ఋణాలు మరియు మార్కెటింగు సౌకర్యాలు (3) రాష్ట్ర అమ్మకపు పన్నునుండి మినహాయింపు (4) పరిశ్రమలస్థాపనకు సంబంధించిన నివేదికలకయ్యేఖర్చుకు సబ్సిడి సమకూర్చుట మరియు(5)సాంకేతిక శిక్షణావసతులు సమకూర్చుటఅయితే ఈవసతులను సమకూర్చుటను బట్టి కేంద్ర ప్రభుత్వం సబ్సిడి ఇచ్చినచో వెనుక బడిన రాష్ట్రాలకు అతి తక్కువ సహాయం లభించును.

రాష్ట్రాల అభివృద్ధిలో అసమానతలను తొలగించుటకు లైసెన్సు పద్ధతి ఉపయోగపడినా, ఈ పద్ధతిని అమలుపరచుతీరు వెనుకబడిన రాష్ట్రాల అభివృద్ధికి తోడ్పడ లేదు. ఉదాహరణకు, 1970–74లో జారీచేసిన లైసెన్సులలో 3/4వ వంతుకు పైగా అభివృద్ధి చెందిన రాష్ట్రాలలోని వెనుకబడిన జిల్లాలకే వెళ్లినవి. కేంద్ర సబ్సిడీలో 96 శాతం ఈ జిల్లాలు పొందుట గమనించదగిన విశేషం. అదేవిధంగా మొత్తం బ్యాంకు ఋణాలలో 2/3 శాతంపైగా అభివృద్ధి చెందిన రాష్ట్రాలలోని 68 వెనుకబడిన జిల్లాలు పొందినవి. మొత్తం వెనుకబడినజిల్లాలలో వీటిశాతం28 మాత్రమే. వెనుకబడినజిల్లాల జనాభాలో వీటిశాతం40. అభివృద్ధి చెందినరాష్ట్రాలలో వెనుకబడిన జిల్లాలు, వెనుకబడిన రాష్ట్రాలలో వెనుక బడిన జిల్లాలకంటె ఎక్కువగానే అభివృద్ధిచెందుటచే ఇటువంటి పరిస్థితి వాంఛనీయంకాదు.

అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో కూడా వెనుకబడిన ప్రాంతాలు వున్నప్పటికీ, వెనుకబడిన రాష్ట్రాలలో వెనుకబడిన జిల్లాలకు ఎక్కువగా సహాయం చేయవలెనని పాండేకమిటి అభిప్రాయపడెను అభివృద్ధిచెందిన రాష్ట్రాలలో వెనుకబడిన జిల్లాల సమస్యలను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు తేలికగా పరిష్కరించుకొనగలవని ఆ కమిటి అభిప్రాయము. రాష్ట్రంలో వ్యత్యాసాల కంటె,రాష్ట్రాల మధ్య వ్యత్యాసాలను తొలగించుటలో కేంద్రం ఎక్కువగా కృషి చేయవలసి వున్నది

ఇటీవల కాలంలో కేంద్రసబ్సిడీ మరికొన్ని పరిశ్రమలకు విస్తృతంచేయటం జరిగినది. అందువలన, వ్యవసాయానికి సంబంధించిన పరిశ్రమలు (కోళ్లపెంపకంతోసహా)భూమి, భవనములపై ఖర్చులో సబ్సిడీ పొందవచ్చును. గనులకు సంబంధించినపరిశ్రమలు, నిల్వలను చేసే పరిశ్రమలను మేలురకం విత్తనాలను ఉత్పత్తిచేసే పరిశ్రమలుకూడ ప్రస్తుతంకేంద్రసబ్సిడీని పొందవచ్చును. సేవలను చేసేకొన్ని పరిశ్రమలు (General workshops including rep-air workshops) కూడా సబ్సిడీకి అర్హత పొందినవి. వెనుకబడినవిగా నిర్ణయించిన జిల్లాలు 1971–72నుండి పరిశ్రమల స్థిర ఆస్తులలో (Fixed Assets) 10శాతం సబ్సిడీగా పొందుచున్నవి. ఈశాతం మార్చి 1973నుండి 15కు పెంచుట జరిగినది. అయితే ఏ పరిశ్రమ విషయంలోగాని సబ్సిడీ గరిష్ఠ పరిమితి 15లక్షల రూపాయలే.

కేంద్రప్రభుత్వము సమకూర్చుచున్న సబ్సిడీ పద్ధతిలో కొన్ని ఇబ్బందులు లేకపోలేదు. రాష్ట్రస్థాయిలో సంస్థలు మొదట సబ్సిడీ సమకూర్చిన దానిని కేంద్ర ప్రభుత్వము, ఆ తరువాత ఆ సంస్థలకు ఇచ్చును. అంటే కేంద్రప్రభుత్వము ప్రత్యక్షంగా పరిశ్రమలకు సబ్సిడీ సమకూర్చదు. సబ్సిడీ మొత్తాన్ని కేంద్రప్రభుత్వం సంస్థలకు ఇచ్చుటలో చాల ఆలస్యం వుండుటయేగాక, సబ్సిడి అర్హతను కేంద్రప్రభుత్వమే నిర్ణయించ వలసి వున్నది. ఈకారణంగా, అర్హతగల పారిశ్రామిక సంస్థలకు వెంటనే సబ్సిడీ సమకూర్చుట సాధ్యపడుటలేదు.

కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలకు అనేకసౌకర్యాలు కల్పించుచున్నప్పటికీ, పారిశ్రామిక వేత్తలు వెనుకబడిన ప్రాంతాలనుండి అభివృద్ధిచెందిన ప్రాంతాలకు తరలుటకు వెనుకాడుచున్నారు. దీనికి కారణం, వెనుకబడినప్రాంతాలలో పెట్టుబడిలో వున్న ఇబ్బందులే. ఇటీవల కాలంలో వెనుకబడిన

ప్రాంతాల అభివృద్ధికి ప్రభుత్వం మరికొన్ని సదుపాయములను ప్రకటించినది. ప్రస్తుతం, ఒక కోటిరూపాయలు పెట్టుబడిగల పరిశ్రమ కూడ సబ్సిడీకి అర్హత పొందియున్నది. కొన్ని ప్రత్యేక పరిశ్రమల విషయంలో ఈ పరిమితిని పెంచుట జరిగినది. మొత్తం పెట్టుబడిలో సబ్సిడి శాతం 15. అయితే మొత్తం సబ్సిడి 15లక్షల రూపాయలను మించరాదు. ఇప్పటివరకు 104 వెనుకబడినజిల్లాలు సబ్సిడీకి అర్హత పొందినవి. కాని ప్రస్తుతం అదనంగా 144 అభివృద్ధి కేంద్రాలు (Growth Centres) కూడా సబ్సిడీకి అర్హత పొందినవి. అదేవిధంగా తక్కువ వడ్డీరేటుకు ఋణాలు సమకూర్చే పద్ధతి ప్రస్తుతం 233 జిల్లాలకు విస్తృతం చేయబడినది.

చిన్న వ్యవస్థాపకులకు సబ్సిడి పద్ధతి ప్రయోజనంచేకూర్చుచున్నది. ఈ పద్ధతి అమలు పరిచిన తేది ఆగస్టు 26, 1971 నుండి నవంబరు 20, 1975 వరకు కేంద్రప్రభుత్వం ఈపద్ధతి క్రింద 815. 22 లక్షల రూపాయలు సమకూర్చుట జరిగినది. సబ్సిడి పొందిన సంస్థలలో 95శాతము చిన్నతరహా రంగమునకు చెందినవి. 1974–75 సంవత్సరంలో కేంద్రప్రభుత్వం సమకూర్చిన సబ్సిడి వలన 1354 సంస్థలు లాభం పొందినవి. సంస్థల స్థిరమూలధనము (Fixed Assets) లో సబ్సిడి శాతం 8.

అయితే, సబ్సిడి పంపకములో లోపములు లేకపోలేదు సబ్సిడీని పొందుటలో రాష్ట్రాలమధ్య వ్యత్యాసము వున్నది. 1973–74లో మహారాష్ట్ర మొత్తం సబ్సిడీలో 82శాతం పొందినది. అయితే ఈ శాతం 1974–75నాటికి 21కితగ్గించుట జరిగినది. పారిశ్రామికంగా వెనుకబడిన ఆంధ్రప్రదేశ్ పొందిన శాతం 15, తమిళనాడు పొందిన శాతం 11. సబ్సిడి పద్ధతిగాని తక్కువ వడ్డీరేటుకు ఋణాలు ఇచ్చుపద్ధతిగాని జయప్రదంగావలెనంటె వ్యవస్థాపకులు రాష్ట్ర పరిపాలనా సిబ్బంది ఐకమత్యంగా పనిచేయవలసి వున్నది. అలా లేకపోవుట వలెనే ఇటీవల కాలంవరకు జమ్ముకాశ్మీర్, హరియానా త్రిపుర వంటి రాష్ట్రాలలో సబ్సిడీని వుపయోగించుకొనుటజరుగలేదు. ఈకారణంగానే నవంబరు 1975 నాటికి వెనుకబడిన 12రాష్ట్రాలు (ఆంధ్రప్రదేశ్, అస్సామ్, బీహారు, హిమాచల్‌ప్రదేశ్, మధ్యప్రదేశ్, మణిపూర్ మేఘాలయ, నాగాలాండు, ఒరిస్సా, పాండుచెరి, రాజస్థాన్ మరియు ఉత్తరప్రదేశ్) మొత్తం సబ్సిడీలో 43శాతంను మాత్రమే పొందగలిగినవి. కేంద్ర సబ్సిడి గురించి పూర్తి వివరాలు చాలమంది వ్యవస్థాపకులకు తెలియవు.

సబ్సిడీ పద్ధతి పూర్తిగా జయప్రదం కాకపోవుటకు ముఖ్యకారణం : వెనుక బడిన ప్రాంతాలలో అవస్థాపనా సౌకర్యములు (Infrastructure facilities) చాలతక్కువ స్థాయిలో వుండుటే. రోడ్డు రవాణా, విద్యుచ్ఛక్తి మొదలగునవి ప్రభుత్వం సమకూర్చినా, ఇండ్ల వసతులు విద్యావసతులు మొదలగునవి చిన్నతరహా వ్యవస్థాపకులే ఏర్పరచుకొనవలసి వున్నది. అంతే కాకుండా, వ్యవస్థాపకులు ఋణాలు పొందినంత మాత్రాన సమస్యలు పరిష్కారం కావు. వారికి సాంకేతిక మరియు ఇతర సహాయం అవసరం

ఇటీవలనే కేంద్రపారిశ్రామికశాక (**Ministry of Industry**) సబ్సిడి ఆయా సంస్థలు సమకూర్చే ఉద్యోగవకాశములపై ఆధారపడునని ప్రకటించినది. దేశంలో విపరీతంగా పెరిగే నిరుద్యోగం దృష్ట్యా ఈ నిర్ణయం తీసుకొనవలసి వచ్చినది. ప్రతి 1000 రూపాయల సబ్సిడీకి కనీసం ఒకరికి ఉపాధి కల్పించవలెనని ప్రకటించుట జరిగినది. ఐదవ పంచవర్ష ప్రణాళికలో మిగిలిన సంవత్సరములలో ప్రభుత్వం 40కోట్ల రూపాయలు సబ్సిడి సమకూర్చ గలదు. అంటే సబ్సిడీ పద్ధతి 40 000 మందికి అదనంగా ఉపాధి కల్పించ వలెనన మాట.

సబ్సిడి పద్ధతి ఎక్కువ ప్రాంతాలకు సమకూర్చ వలెనా లేక కొన్నివెనుకబడిన ప్రాంతాలకేపరిమితంచేయవలెనాఅనునది వివాదంతో కూడుకొని వున్నది. అయితే ప్రభుత్వం మాత్రం ప్రస్తుతం 144 ప్రాంతాల వరకు సబ్సిడీని సమకూర్చుచునే యున్నది. అయితే ప్రస్తుతం ప్రభుత్వం సబ్సిడీని వెనుకబడిన జిల్లాలో ఒక ప్రాంతము (Growth point) లో మాత్రమే అభివృద్ధి కార్యక్రమాలను విస్తృతం చేయుటకు వినియోగించు చున్నది. ఇలాచేయుట వలన వ్యవస్థాపకులు తమకు కావలసిన అవస్థాపన సౌకర్యములు ఒక ప్రదేశం నుండే పొందగలరు. యాంత్రికులకు స్థానిక ప్రజలకు సేవలుచేసే సంస్థలకు కూడా ఇటీవల కాలంలో సబ్సిడీ పద్ధతిని విస్తృతం చేయటం జరిగినది. గ్రామీణ చిన్నతరహా పరిశ్రమలు సబ్సిడీకి అర్హత పొందేవున్నవి. ఒక పరిశ్రమలో పూర్తి శక్తిని వినియోగించు కొనక పోయినా (Underutilisation of Capacity) ఆ పరిశ్రమకు సంబంధించిన సంస్థల స్థాపన వెనుక బడిన ప్రాంతాలలో జరిగిన ప్రభుత్వం అనుమతించుచున్నది. ప్రభుత్వం ఇదివరకు కొన్ని పరిశ్రమల విస్తరణపై పరిమితులు వేసినది. అటువంటి పరిశ్రమలను కూడ ప్రస్తుత వెనుకబడిన ప్రాంతాలలో స్థాపించుటకు వీలున్నది.

కేంద్ర పారిశ్రామిక శాఖచే ఏర్పరచిన ఒక కమిటి వెనుకబడిన ప్రాంతాలఅభివృద్ధిసమస్యలనుపరిశీలించుటకు, పరిష్కరించుటకు జాతీయ స్థాయిలో ఒక సంస్థను స్థాపించవలెనని సూచించినది. అటువంటి సంస్థ అవలంభించే పద్ధతులు సంస్థ లాభ నష్టాలతో సంబంధం లేకుండా వెనుకబడిన ప్రాంతాల సమస్యలకే ప్రాధాన్య మిచ్చును.

డిశంబరు 23,1976వ తారీఖున కేంద్ర పారిశ్రామికశాఖ సబ్సిడి పద్ధతిలో కొన్ని సవరణలను ప్రకటించినది. ఈ సవరణల ననుసరించి నగర ప్రాంతాలనుండి వెనుకబడిన ప్రాంతాలకు తరలించే సంస్థలు సబ్సిడీని పొందగలవు. హోటలు పరిశ్రమకూడ సబ్సిడీకి అర్హత పొందినది. ఇంతకుముందు సంస్థలో తగినంత విస్తృతం అంటె స్థిరమూలధనంలో 25శాతం పెరుగుదల. ప్రస్తుతం ఈ శాతం 10కి తగ్గించ బడినది. సబ్సిడి పంపకం పద్ధతిని ప్రస్తుతం సులువు చేయుట జరిగినది. ఇంతకు ముందు,

(మిగతా 30 వ పేజీలో)

# అమృత సేతువు

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

చవిటి నేలలు పైరు పచ్చల నెనంగ
తెలుగుతల్లి కొంగున పైడి
మేలుములదొంతి శ్రీ గౌతమీ స్రవంతి
వార్ధియై నిల్చె పోచమపాడువద్ద

శ్రీ గోదావరి ! దివ్యభవ్య జలరాశీ !
నిత్య వాచాలవీ
చి గోష్ఠీ విభవా ! దయామృతరస
స్నిగ్ధాత్మవై ముగ్ధ రే
ఖా గంభీరిమ చెంగలింపగ
తెలంగాణమ్ము నక్షీణ ధా
న్యాగారం బొనరింప నిల్చితివి కాదా !
సాగరాకారతన్

జనకసుతా సతీస్నాన పుణ్యోదక
పావనత్వము నొందినావుగాని
భద్రాద్రి శ్రీరామ పాదపంకజమరం
దరసమ్ము చవిజూచి నావుగాని
నన్నయ్య భారతామ్నాయమ్ములోని
విన్నాణమ్ము తెలుసుకొన్నావుగాని
రతరాల చరిత్ర తరగల రవళి
గానమున విన్పించుచున్నావుగాని

గీ. ఎన్నడేని నవోదయాసన్నమతివి
నిల్చితివె తెల్గు పొలము పండించుకొరకు
ఛేటికేరీతి కడలివై నిలిచినట్టి
నిన్ను సన్నుతింతును సవంతీమతల్లి !

ఉ. స్వాదు పయస్వినీ ! విమల
భావ మనస్విని ! దిక్ప్రసారితా
మోద యశస్వినీ ! భువన
పూతమహస్విని ! గౌతమివై వ్యధ
జేదును త్రుంగి తీర్చెడి
కృశించు కృషీవల జీవనంబు లా
హ్లాదమునొంద జేసితివి
అంబుధిరూపిమువా గౌతమీ !

సీ. పిసినిగొట్టు విధాన వేవనొక్క చినుకైన
రాల్చని నీరదవ్రతతిజూచి
పాతాళలోకము లోతుముట్టగ నెంచు
నూతుల గోతుల రీతిజూచి
వరదమత్తడిదాని బురద చిత్తడిలేని
చెరువుల దొరువుల చేటుజూచి
కరుణమాలినవాని కరకు గుండియవోలె
చెమ్మగిల్లని వాగు స్థితిని జూచి
గీ. పండబారిన వరి పొలా లెండబారి
గుండె లవియింప మిక్కిలి గోడుజెందు
కర్షకుల కాసదీర్పగా కడలి వగుచు
వరలితివి కాదె పోచమపాడువద్ద !

గీ. తెలుగు రీతిని నీతిని వలచినావు
తెలుగు వాకిట జలధివై నిలిచినావు
అరుముటాకలి నకనకలాడుచున్న
పేదరైతును విందుకు పిలిచినావు

గీ. కడలిరాయని కౌగిట కరగు ధన్య
గేహినీ ! విశ్వమానవ కీర్తనీయ
వాహినీ ! ఫేన దరహాసభాసమాన
మోహినీ ! నేడు మా భాగ్యములు ఫలించె
శ్రీ ప్రదాయిని ! గోదావరీ స్రవంతి !

ఉ. కొండలు, బండలున్ గడచి
కోనలు కానలు దాటి ఆంధ్ర భూ
ఖండము తోమ పూర్ణమగు
కాల్వల నిల్వున సందడింపగా
తొండలు గుద్దలు వెట్టు నెరి
దోయిడి ధాన్యములలోన బంగరున్
బండగ పొద్దినై నిలిచి
భాసిలు నిన్ను భజింతు గౌతమీ !

క. తెలుగుం బల్లెలు ప్రైరుల
వెలుగుంబళ్ళేరము లగుచు విలసిల్ల భవత్
జలపూరము మా పొలముల
బలసారము గౌతమీ స్రవంతీమణిరో !

సీ. బీళ్ళు పచ్చని పరిమళ్ళుగా తులకింప
మ్రోళ్ళు చివుళ్ళతో పులకరింప
నిరుపేద రైతింట సిరివెలంది చరింప
ధాన్యమ్ము గరిసెల దండడింప
చిరుకాల్వ నీటి తుంపర వరాల్ కురి పింప
చెట్టు చేమలు రసశ్రీ భజింప
జల విహంగావళి కలరవంబొనరింప
ఫల పుష్పవనములు పరిణమింప

గీ పడతి పదముల వెండిమువ్వల విధాన
గలగలా రావ వీచికల్ కందళింప
జలధివై నిల్చి కాల్వలై జాలువారు
పుణ్యవాహినీ ! నీకు కైమ్మోడ్పులమ్మ !

చ. అఘలతుషార వారములు
హారములై చెలువారగ శుభో
ద్యమ కమనీయకాంక్ష
ఎడదన్ తడలెత్త పటిష్ఠ సెతు చం
క్రమణ మొనర్చి వాకవయి
కాలువలై ప్రవహించి నేల త
ల్లి మొగమునందు భాగ్యనవ
రేఖలు దిద్దితివమ్మ గౌతమీ !

మ. అటు కృష్ణాతటినీ శిరోమణి దయా
స్వాంతమ్మునన్ జీవనో
త్కట నాగార్జున సాగరాకృతి మహా
త్వమ్మూని శోభిల్ల నీ
విటు మేల్ పోచమపాడు సేతువయి
ఎంతే నొప్పగా ధాన్యసం
పుటమై ఆంధ్రధరిత్రి రాజిలె యశ
స్స్ఫూర్తిన్ పిసాళించుచున్

# వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి

(28 వ పేజీ తరువాయి)

సబ్సిడిని సమకూర్చే సంస్థలు పారిశ్రామిక అభివృద్ధి శాఖకు తాము సమకూర్చిన సబ్సిడీమొత్తాన్ని ఇవ్వవలసినదిగా(reimbursement) కోరుట జరిగేది. అయితే ప్రస్తుత పద్ధతులలో ఆ సంస్థలన్నీ రాష్ట్రస్థాయిలో ఏర్పరచిన కమిటీలను ఆ విధంగా కోరవలెను. అన్ని సంస్థల సబ్సిడీ విధానాలను, పరిశీలించి ప్రతికమిటి సబ్సిడీగా రావలసిన మొత్తాన్ని పారిశ్రామిక శాఖకు శిఫారసుజేయును. ఈ పద్ధతిలో కమిటి ఎక్కువ భాధ్యతను మోస్తున్నా, సబ్సిడి మొత్తాన్ని సంస్థలు పూర్వం కంటె తక్కువకాలంలో పొందగలవు. ఇంతకు ముందు సంస్థ సబ్సిడి సమకూర్చిన రోజునుండి పరిశ్రమ శాఖ సబ్సిడి ఇచ్చేవరకు సబ్సిడి మొత్తంపై పరిశ్రమ శాఖసంస్థకు వడ్డీకూడ ఇచ్చుట జరిగేది· ప్రస్తుతం ఈ పద్ధతి తొలగించ బడినది.

పూర్వపు పద్ధతిలో సంస్థ ఉత్పత్తి ప్రారంభించక పూర్వమే 50శాతం సబ్సిడి పొందవచ్చును. మిగతా 50 శాతం సబ్సిడి ఉత్పత్తి ప్రారంభించాక పొందవచ్చును. ప్రస్తుతం రాష్ట్రస్థాయిలో ఏర్పరచిన కమిటీ సంస్థ ఉత్పత్తి ప్రారంభించకపూర్వమే 85శాతం సబ్సిడిని తనకు నచ్చినన్ని వాయిదాలలో సంస్థకు సమకూర్చవచ్చును. మిగతా 15శాతం సబ్సిడి ఉత్పత్తి ప్రారంభమయిన తరువాత ఇవ్వ వచ్చును. ఈ విధంగా సంస్థ తొలిదశలోనే (initial stages) ఎక్కువ సబ్సిడిని పొందగలదు. ప్రతి సంస్థకు కావలసిన భూమి భవనముల పరిమాణము నిర్ణయించే అధికారం ప్రస్తుతం రాష్ట్ర స్థాయి కమటీకి కలదు.

వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి విషయంలో గమనించ దగిన ముఖ్యవిషయం ఒకటి ఉన్నది. కేవలం పరిశ్రమల స్థాపన ద్వారానే వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి సాధించుట వాంఛ నీయంకాదు. స్థానిక వనరులను దృష్టిలో వుంచుకొని పారిశ్రామికా భివృద్ధితో పాటు ఇతర అభివృద్ధి కార్యక్రమములను వ్యవసాయానికి సంబంధించిన పరిశ్రమలు, కోళ్ల పెంపకము, తేనెపట్టు పరిశ్రమ, పశు పరిశ్రమ, వడ్రంగము మొదలగునవి విస్తృతం చేయవలెను. 1976–77 బడ్జెటుతో పాటు కేంద్ర ఆర్థిక మంత్రి గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి వ్యూహానికి సంబంధించిన డాక్యుమెంటును (Document on integrated rural development) సమర్పిం చుట జరిగినది. గ్రామీణ వనరులను పూర్తిగా వినియోగించుటకు ప్రయత్నములు జరిగినచో, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి సాధిం చుటయేగాక, గ్రామీణ ప్రజల ఆదాయాలను ఉద్యోగావకాశములను శాశ్వతంగా పెంచవచ్చును. అయితే, ఇటువంటి అభివృద్ధికార్య క్రమములవలన పెరిగే ఉత్పత్తిని మార్కెటుచేయుటలో ప్రభుత్వం పూర్తి సహకారమును ప్రజలకు కల్పించవలెను.

శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న

# క్రియాసిద్ధిస్సత్త్వే-2. గిడుగు రామమూర్తి పంతులుగారు

అది 1880. రామమూర్తి పంతులుగారికి పంథొమ్మిదోయేడు. అప్పటికి ఆయన బి. ఏ. కాలేదు; ఎఫ్. ఏ కూడా కాలేదు. ఒట్టి మెట్రిక్యులేషనే పేసయిఉన్నారు. కాని వారు ఆ పంథొమ్మిదవయేటనే పర్లాకిమిడి రాజావారి జమీందారీ హైస్కూల్లో "అసిస్టెంట్‌టీచర్"గా ఉద్యోగంలో ప్రవేసించేరు.

బాగానే ఉంది.

మెట్రిక్యులేషనో (ంతాదరిమిలాన ఎస్. ఎస్. ఎల్. సి. లో) అనే జంఝుప్పోచ పడ్డాక, కారణాంతరాలవల్ల, అనేకులు అలాగ ఉపాధి సేకరణ చేస్తూనే వచ్చేరు.

మరి వీరి ప్రత్యేకతయేఁవిటీ ?

అంటే—

తాము అప్పుడు పనిచేస్తూన్నది హైస్కూలే అయినా, చదువులంటే మిక్కిలి దీక్షవహించి, యింటి వద్దనే ఉన్నత విద్యాభ్యాసం చేస్తూ, ఎన్నిఆటంకాలు వచ్చినా లక్ష్యంవీడక,ఎఫ్. ఏ,బి ఏ. పరీక్షలు పేసయేరు. 1896 సం॥రములో పర్లాకిమిడిలో స్థాపితం అయినప్పట్నుంచీ, అక్కడే వారు చరిత్ర అధ్యాపకులుగా నియమితులైనారు. అయితే, ంతావ్యవధానంకాలంఅంతా రామమూర్తి పంతులుగారికి యూనివెర్సిటీ పరీక్షలతోనే గడిచిపోలేదు. మధ్యలో సవరభాష గొడవ ఒకటి వచ్చిపడింది.

## సవరభాషా సేవ :

గంజాంజిల్లాలో పర్లాకిమిడి తాలూకా అనాగరికులైన గిరిజనులకి పుట్టినిల్లు.? వారు అక్కడి ఆదిమవాసులు. అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీలోగల 64 ఆటవీ— గిరిజన జాతుల జనాభా 12, 73, 947. వీరిలో ప్రధానం అయినవి తొమ్మిది తెగలు (సుమారు 50,000 మంది జనాభా ఒక్కొక్కతెగలోను) వీటిలో 7తెగలవారు మూడు ఉత్తర జిల్లాలలోనూ ఉండేవారు. 3, 26, 586జనాభాగల "ఖోండ్లు" ప్రథమ శ్రేణికిచెందగా,1,83,159 వరకూ ఉన్న సవరలు ద్వితీయ శ్రేణి నాక్రమించుకున్నారు. అంటే, అటవీ— గిరిజనుల మొత్తం జనాభాలో ఏడవ వంతు సవరలు అన్నమాట. వీరిలో 14.2 శాతం (26,059) మాత్రమే సవరభాష కాక, తెలుగో, ఒఢ్రమో కూడా మాట్లాడ గలిగేవారు; మిగిలిన 85.8 శాతంవూ (1,57,100)కేవలం సవరభాషతప్ప యింకేదీ తెలియని వాళ్ళు. వీళ్లలో మూడింట రెండువంతులు గంజాంజిల్లాలోనూ, మిగిలినవాళ్ళు విశాఖజిల్లాలోనూ ఉండేవారు. గంజాం జిల్లా, పర్లాకిమిడి తాలూకాలో పనిచేస్తున్న రామమూర్తి పంతులుగారికి వీళ్ల సమస్య యెదురైంది.

దీని పూర్వ చరిత్ర యేఁవిటీ అంటే—

1850లోనే ఈస్టు ఇండియా కంపెనీ తరఫున కోర్టు అఫ్ డైరక్టర్స్ ఖోండుజాతి వారికి పాఠశాలలస్థాపన మంజూరు చేసేరు. 1854లో ప్రభుత్వం, విద్యా సౌకర్యాల విషయమై ఒక రాజకీయ లేఖ ప్రకటించింది. దాని ప్రకారం జరగవలసిన విద్యా పద్ధతులు, యిటు పట్నాలలో ఉండేవారికీ, అటు గిరిజనులకీకూడా అనువర్తింప చేయడం జరిగింది. 1855–56లో ప్రభుత్వపు విద్యాశాఖ తీసుకున్న ముఖ్యచర్యలలో ఒకటి,ంతా ఖోండ్లకోసంవూ గంజాంగిరిజను ప్రాంతాల్లో ఉన్న ఇతర అనాగరికుల కోసంవూ వెలిసిన పాఠశాలల్ని అభివృద్ధిపరచడం. దీని పర్యవసానం యెలాగ పరిణమించిందంటే, గిరిజన ప్రాంతాలలో అప్పటికే స్థిరపడిపోయి, స్వయంగా కొంత సంస్కృతీ ప్రతిభాన్వితులైన హిందువులకే యివి ఉపయోగించేయి కాని, ఏ గిరిజనుల కోసం అసలు యివి ఉద్దిష్టం అయేయో వాళ్లకి మాత్రం ఎంతమాత్రం సంతృప్తికరంగా సాగలేదు. 1888–89 సం॥రపు వార్షిక నివేదికలో, డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్, ఖోండ్లలో విద్యా వ్యాప్తి యేఁవంత సంతృప్తికరంగా లేదనినన్నీ, సవరుల విషయంలో బీజఁవేనాటుకో లేదనినీ వాపోయేడు. 1888 డిసెంబరులో పర్లాకిమిడి 'మానీయా'లోని పాఠశాలలని తనిఖీచేసిన ఆక్టింగ్ ప్రిన్సిపాల్ ఎసిస్టెంట్ కలెక్టర్‌జె.డి జి.పార్ట్రిడ్జ్ ప్రభుత్వం వారికిపంపిన నివేదికలో, "ఏజెన్సీ మొత్తాన పాఠశాలకి వెళుతూన్నవాళ్ళలో సవరకుర్రవాడు ఒక్కడే ఒక్కడున్నాడు. ఇది చాలా ఆశాభంగకరమైన పరిస్థితి" అని రాస్తూ, "అయినా, నాలుగు ఎయిడెడ్, రెండు అన్ఎయిడెడ్ పాఠశాలలూ కాక, తొమ్మిది గవర్నమెంటు పాఠశాలలున్నాయనీ, వీటిలో ఆరువందలమంది చదువుతున్నారనీ, ంతా అన్నిబడుల్లోనూ హిందూ కుర్రవాళ్లే" ననీ అన్నాడు.

ఆ వచ్చే ఒక్క సవర కుర్రవాడయినా, తిండీ—బట్టా యిస్తారు కదా అని, ఆ సౌకర్యాల కోసం ఆశపడి వచ్చేవాడు—ట! ఈ విషయం రామమూర్తి పంతులుగారు స్వయంగా అన్వేషించి తెలుసుకున్నారు ! !

కాగా, వృత్తిరీత్యా కొంతా, వసతి మూలకంగా మరికొంతా—ఎలాగయితేనేం —వారికి ఆ సవరుల మధ్య మెసలక వీల్లేకపోయింది. అదుగో, ఆ పరిస్థితుల్లో ఒకవంక పరీక్షలకి చదువుకుంటూనే, మరో వంక ఓ అయిదేళ్ళ పాటు, 1894 వరకూ సవరుల మధ్య తిరిగీ, వాళ్ళ భాషనేర్చుకునీ, వాళ్ళ ఆచార వ్యవహారాలు గమనించీ, సునిశితమైన బుద్ధితో పనిచేసి, అప్పటి సవరల స్థితి కనుక్కోగలిగేరు.

తత్ఫలితంగా తేలిన విషయాలు—

(1) సవరలు మానవజాతి ప్రథమావస్థలోనే ఉన్నారు ;

(2) వాళ్ళకి ఓ వాఙ్మయం అంటూ ఏఁవీ లేదు ;

(3) మాటే కాని, వాళ్ళ భాషకి లిపి అసల్లేదు.

సెప్టెంబరు 1894లో రామమూర్తి పంతులుగారు **State of Education among the Savaras** (సవరుల విద్యా స్థితి) అన్న శీర్షికని ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడ్యుకేషన్‌లో సుదీర్ఘమైన వ్యాసం ఒకటిరాసేరు. ఏజెన్సీ లో పాఠశాలలు మందకొడితనంగా ఉండడానికి కారణాలు వివరిస్తూ, ప్రభుత్వం గుర్తుంచుకోవలసిన ముఖ్య విషయాలు మూడు ఉన్నాయి అన్నారు. ఒకటి, వాళ్ల సమాజపు పరిస్థితులు తెలుసుకుని, వాటి అవసరాలకు తగినట్టుగా విద్యాబోధనచెయ్యడం; రెండు, ఆ ప్రజల స్థానిక భాషలోనే విద్యాబోధన జరిపించడం; మూడు, విద్యవల్ల తమ ఆశయాలూ, కోర్కెలూ నెరవేరగలవన్న అభిప్రాయం అనాగరికులైన సవరలలో కలిగే విధంగా విద్యా బోధన ఉండడం, ఈ ముఖ్య విషయాలని విస్మరించి వ్యవహరించినంత కాలం, సవరల గ్రామాలలో నెలకొల్పిన పాఠశాలలు—వారి కొరకు అన్న వస్త్రాది పులోభాలు యెంత ఉదారంగా కల్పించినప్పటికీ—నిరుపయోగంగానే ఉండిపోతాయి.

సవరలూ తదితర గిరిజనుల విషయంలో యివి యెలాగ సందింపచెయ్యడం అన్నది వర్చిస్తూ, గిరిజనప్రాంతాల్లో గల పాఠశాలల్లో విద్యాబోధనకీ, సవరుల జీవితానికీ యేఁవీ సంబంధంలేకుండా ఉందనీ, సంస్కృతి గల వర్గాల వారి పిల్లలకీ, సంస్కృతీ వారసత్వం వేశమైనాలేని అనాగరికులైన సవరలకీ కూడా ఒక విధం అయిన విద్యాంశాలూ, బోధనా పద్ధతులూ ఉండడం వల్ల అట్టి శోచనీయమైన పరిస్థితులు ఏర్పడ్డాయనీ నిర్ధారణ చేసేరు. అభివృద్ధి చెందిన హైందవవర్గాలతో పోలిస్తే, ఇంకా తమ సాహిత్యమనేదే లేకుండా అక్షర వినియోగం అయినా తెలియకుండా, ప్రాచీన మానవదశలోనే ఉన్న సవరలకి, కొన్ని సంవత్సరాల వరకూ మౌఖికంగానే విద్యాబోధన[3] అత్యవసరం అన్నారు. అదికూడా, ఏ ఒఢ్రంవో, తెలుగో కాకుండా, వారివ్యావహారిక భాషలోనే జరిగించడం ముఖ్యంఅని నొక్కిచెప్పేరు. ఆ భాషాధ్యయనానికి యెలాంటి ''గైడూ'' ప్రచురితం కాలేదు; సవరుల విద్యా బోధన బాధ్యత అప్పజెప్పిన వ్యక్తులకి, సవర భాషతో అంత పరిచయం లేదు. కొత్తభాష అంటే విముఖులుగా ఉండే సవర కుర్రవాళ్ళు, ప్రాథమిక పాఠశాలల్లో ఉపాధ్యాయులు ఒఢ్రంలోనో, తెలుగులోనో, పాఠాలు చెబుతూ ఉంటే, ఆ క్లాసులకి వాళ్లు వస్తారని యెలాగ ఆశించడం ? కర్నల్ ఫ్రై ఖోండ్ల భాషనేర్చుకుని 1851 ప్రాంతాలకే ఆ భాష విషయమయి 'మాన్యుఅల్' ఒకటి రాసేడు. అలాగే మిషనరీలు కోయవాళ్ల భాషావిషయంలో కృషిసలిపేరు. అందువల్లనే ఖోండ్లకీ, కోయలకీ,బడగలకి స్కూళ్ళవల్ల కాస్త ప్రగతి కలిగింది. కాని సవరల విషయంలో యిటు వంటి ప్రక్రియలేవీ జరగలేదు. కాబట్టి—

—సవర భాషలోనే విద్యాబోధన జరగాలి;

—యిది మౌఖికంగానే ఉండాలి. కొన్నేళ్ళవరకూ చదవడం, రాయడం ''కోర్సు''లోంచి తీసివెయ్యాలి.

—బొమ్మలుచూపించడం ద్వారానూ,పాటలద్వారానూ సవరలకి ఆసక్తికలిగించే విషయాలూ, వారికి ప్రయోజనంకలవీ పాఠాలు నేర్పాలి.

ఇలాగనడిచింది, రామమూర్తి పంతులుగారి వ్యాసం. దీనివల్ల వారి సునిశిత పరిశీలనా శక్తీ, బుద్ధితీక్ష్ణతా, ప్రజాసేవా తత్పరతా విదితం అవుతాయి.

అంతేకాదు.

ఏదైనా ఒకవిషయం పరిశీలించడానికి పూనుకుంటే, దాన్ని సాంతంశోధించి, సత్యం తెలుసుకునే వరకూ విడవని ఆయన పట్టుదలా తెలుస్తుంది. రామమూర్తి పంతులుగారివిషయంలో యీ ''పట్టుదల'' ఒక మహద్విషయం!

పర్లాకిమిడియేజన్సీ మలేరియాకి పుట్టినిల్లు. నివారణ ''క్వినైన్'' సేవన. ఈమాత్రలు పోస్టాఫీసుల్లో కూడా అమ్మేవారు. తరచుగా క్వినైన్ పుచ్చుకోవడం వల్ల రామమూర్తి పంతులుగారికి చెముడు పట్టుకుంది; కొంతకాలానికి బ్రహ్మచెముడు అయి ఊరుకుంది. వారితో మాట్లాడాలంటే పలక మీద రాయవలసిందే కాని మరి గత్యంతరంలేకపోయేది. అంచేతే యెప్పుడూ వారివద్ద చిన్నపలకా, బలపం వూ ఉండేవి. ''కాని శ్రవణలోపం ఆయన బుద్ధి వికసనానికి తోడుపడింది'' అన్నారు కురుగంటివారు. బయట ఉరుములు ఉరిమినా, పిడుగులు పడ్డట్టు చప్పుడైనా ఆయనకి యేమీ తెలిసేదికాదు.[4] ఆయన కృషి ఆయనదే! రాత్రి 8 గం॥లకి భోజనం చేసి కూచుంటే 12 గంటల దాకా ఒకటే చదువు!ఒకటే దీక్ష!!

''1906సరికే వారు సవర భాషాకృషివల్ల ప్రఖ్యాతిపొందేరు. సవరల భాషకి లిపి అనుగ్రహించేరు. ''సవర మాన్యుఅల్ అండ్

రీడర్'' కూడా యీయనే రాసేరు. ముండారిన్ లేక ఆస్ట్రిన్ లేక కొవేరియన్ భాషాశాఖకు చెందిన సవరభాషకు ప్రకృతి ప్రత్యయ విభాగం చేసిశోధించేరు. వ్యుత్పత్తి సహితంగా రెండునిఘంటువులూ, ఒకబోధినీ రాసేరు. అనేకశబ్దాలకీ ప్రత్యయాలకీ, సవర—దానిజాతీయ భాషలైన ''గుతోబ్'', ''పరెంగ్'', ''ఖాసీ'' భాషలతో పోల్చిచూపి పట్టిక లిచ్చేరు. ''ఫొనెటిక్స్క్రిప్ట్''లో రాసిన సవర నిఘంటువు పీఠికలో సవర భాషా విశేషాలు యెన్నో లభ్యంఅవుతాయి. కురుగంటి వారుచెప్పినట్టు వారాభాషకు వాగనుశాసను డైనాడు. రావుసాహెబు బిరుదాంకితులూ అయేరు. వారిజీవితంలో సవర భాషాసేవ ఒక ముఖ్యమైన మైలురాయి.

తమ పంథొమ్మిదవ యేటనుంచీ టీచరు గా నూ, తరు వరి ''హిస్టరీ లెక్చరర్'' గానూ పర్లాకిమిడి లోనే మొత్తం ముప్ఫై యేళ్ళు ఉద్యోగం చేసి, 1911లో తమ నలభైయ్యో యేటనే రామమూర్తి పంతులుగారు రిటైరయేరు. ''ఈ లోగా 1907లో వ్యావహారిక భాషావాదం పుట్టి, 1911లో వారు రిటైరు అయిన తరవాత తీవ్రరూపం దాల్చింది.'' దీని కథా క్రమం యెలాగంటే—

## వ్యవహారిక వాదం:

అప్పట్లో విద్యా శాఖాధి కారిగా ఉన్న జె.ఏ.యేట్స్. స్కూళ్ళ తనిఖీ చేస్తూన్నప్పుడు, తెలుగువాళ్ళు మాట్లాడేటప్పుడు ఒకరకం భాషా, రాసేటప్పుడు యింకోరకం భాషా ఎందుకు వాడుతారా అన్న ప్రశ్న ఉదయించింది దీనికి సమాధానం ఆయనకి దొరకలేదు. రామమూర్తి పంతులుగార్ని అడిగితే, వారూ వెంటనే సమాధానంచెప్పలేక పోయేరు. కాని వారిలో యిది గట్టి సంచలనం కలిగించింది. అప్పటికే ఆయన ప్రాచీన శాసన పరిశోధన కొంత చేస్తూ ఉండే వారు. ఆ శాసనాలలో భాషకూడా రచనలో వాడే భాషకి భిన్నం గానే కనిపించింది. అంచేత జిజ్ఞాస హెచ్చింది.

అంతకు ముందే బిషప్ కాల్డ్వెల్ దక్షిణహిందూ భాషల పరిశోధనచేసి, భాషా వ్యాకరణాలపద్ధతుల ప్రకారం, తమిళం, కన్నడం మలయాళం, తుళు యివన్నీ ఒక్క భాషా కుటుంబానికి చెందినవేనని ధృవపరచడంతో, ద్రావిడభాషలు సంస్కృత—ప్రాకృత భవాలు కావని రూఢి అయింది; భాషాధ్యయనంవూ యెక్కువైంది, పరిశోధనలూ హెచ్చుగానే జరిగేయి. పర్యవసానం: ''తెలుగు భాష సంస్కృత శృంఖలాల్లో పడిపోయి, విడిపోవడానికి వీల్లేనంతగా చిక్కుపడి పోయిందనిన్నీ, దాన్ని యెలాగైనా ఆ చిక్కులోంచి తప్పించడం కర్తవ్యం అనిన్నీ.''

1905–6 ప్రాంతాల్లో ద్రావిడ భాషా పరిశోధన చేసిన ముఖ్యులలో పి.టి.శ్రీనివాస అయ్యంగారొకరు. ఈయన విశాఖ పట్నం కాలేజీ ప్రిన్సిపాల్‌గా ఉండేవారు. రామమూర్తి పంతులు గారు అప్పటి కప్పుడే 'ఫొనెటిక్స్' క్షుణ్ణంగా నేర్చుకుని ఉన్నారు. ప్రాచీన శాసనాల పరిశోధనలవల్ల భాషా స్వరూపంలో కొన్ని కొత్త విషయాలూ తెలిసేయి. శ్రీనివాస అయ్యంగారి స్నేహంవూ లభించింది.

చిన్నయసూరి గొప్పవైయాకరణి 1860 నాటికే ఆయన రాసిన ''బాలవ్యాకరణము,'' దానికి లక్ష్యంగా రాసిన 'నీతిచంద్రిక' ప్రచురితాలు. వీటిలో ఆయన చూపినభాషే అందరికీ మార్గదర్శి అయిపోయింది. రాతలో అదే నిలిచిపోయింది. అంచేతే మాట్లాడే భాషకీ, రాసే భాషకీ యెంతో భేదం. ఈ కిటుకు రామమూర్తి పంతులుగారికి శ్రీనివాస అయ్యంగారి స్నేహంతో సువ్యక్తంవూ, దృఢంవూ కూడా అయిపోయింది. ''ద్రావిడ భాషా సంప్రదాయం, తెలుగుకు వాటితో గల సంబంధం—యిది భాషాశాస్త్రమనే పేరుతో బయలు దేరింది. ఈ శాస్త్రానికి గిడుగు రామమూర్తి పంతులుగారు ఆచార్యుడైనాడు'' అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు. వైయ్యాకరణులు భాషకి అపకారంచేసేరని రామమూర్తి పంతులుగారు పూర్తిగా విశ్వసించేరు. తెలుగుభాషను సంస్కరించడానికి నడుము బిగించేరు. స్థిరమైపోయిన సంస్కృత భాషా మర్యాదలు జీవద్భాష అయిన తెలుగుకి వర్తించవనే వాదం లేవదీసేరు. ప్రజలలో వ్యాపించ వలసిన విద్య, యీ కాలానికి పనికిరాని కావ్యాలూ వ్యాకరణాలూ చదివించడంవల్ల రాదు అనీ, ''ప్రజలలో విద్య వ్యాప్తి స్తేనేకాని సంఘం వృద్ధిలోకి రాద'' నిన్నీ రామమూర్తి పంతులుగారి అభిప్రాయాలు; యివే వ్యావహారిక మార్గంలో వారు చేసిన ప్రజాసేవకి ప్రేరకాలయేయి. ఈ విధంగా 1907 లో వ్యావహారిక భాషా వాదం పుట్టింది. కాని 1911 లో రామమూర్తి పంతులుగారు రిటైరయేకగాని ఉద్ధృతంకాలేదు. ఎంచేతనంటే—

తమ అభిప్రాయాలు నిర్దుష్టమైనవని ధృవపరుచుకోవాలి. దానికోసం పాతగద్య గ్రంథాలన్నీ సవిమర్శకంగా తరచి చూడాలి. చిన్నయసూరి కూర్చిన సూత్రావళి అంతకు ముందు వెలసిన గ్రంథాలలోనూ, చిన్నయసూరి రచనలలోనూ, ఆయన పెట్టినవొర వడి ఆ తరవాత వచ్చిన రచనలలోనూ యెంతవరకూ వర్తించిందో పరిశోధించాలి. ఇదొక మహాయజ్ఞం. రామమూర్తి పంతులుగారు తలపెట్టేరు. చివరకి, చిన్నయసూరి సూత్రాల ప్రకారం చిన్నయ సూరే రాయలేదని యెన్నో నిదర్శనాలతో చూపించేరు. ఆ వ్యాకరణం పాటించి రాస్తూన్నాం అనుకునే గ్రాంథికవాదులకే గ్రాంథికం రాదని సోదాహరణంగా నిరూపించేరు. ''చిన్నయసూరిగారి బాల వ్యాకరణములోని తప్పులు గుప్తార్థ ప్రకాశికాకారుల భాష్యములలో చూపిస్తే, దానిలో తప్పులు మరొకరు చూపిస్తూన్నారు''నీ, ''మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారికీ, రావు బహద్దూరు కందుకూరి వీరేశలింగం పంతులుగారికీ గ్రాంథికభాష రాదని వారి గ్రంథాలలో ఉన్న తప్పులు చూపించేరు, కణ్వప్రభూర్ణులైన వేదం వెంకట్రాయశాస్త్రిగారు. వారు, తప్పులు ఒప్పులు గానూ, ఒప్పులు తప్పులుగానూ చెప్పేరని చూపించి, ప్రాచీన గ్రాంథిక భాష వారికి బాగా పట్టుబడలేదని నేను బుజావు చేసేను'' అనీ, ''శబ్దసిద్ధి లోకంబు వలన

తెలియును: లక్షణ విరుద్ధమైనది గ్రామ్యమనీ, అపభ్రంశమనీ చెప్పినా, సుకవి ప్రయుక్తమైన యెడల గ్రాహ్యము, మొదలైన వాక్యములు అభిసంధిగా లాక్షణికులు శాస్త్రమందే చేర్చినారు. అవి ప్రమాణము కాకపోతే శాస్త్రమే అప్రమాణ మవుతుంది. వ్యాకరణమునకు మూలమైన ప్రయోగము ఒప్పకపోతే శాస్త్రమునకు మూలవిచ్ఛేదనము చేసినట్లే అవుతుంది'' అనిన్నీ వ్రాకుచ్చేరు.

''తెనుగు'' అనే పత్రికను పెట్టి వాదప్రచారం చేసేరు. రామమూర్తిపంతులుగారి ''గద్యచింతామణి'', ''పండిత భిషక్కుల భాషాభేషజం'', ''బాలకవి శరణ్యం'' మొదలైనవారి గ్రంథాలు గ్రాంధిక భాషావాదులని నిరుత్తరులని చేసేయి అన్నారు, కురుగంటివారు.

అయితే, వార్కు లేవదీసిన యీ ఉద్యమానికి మొదట్లో ఎటువంటి ప్రోత్సాహమూ లేదు. ''మొదట నేనూ, నా మిత్రుడు గురజాడ అప్పారావూ మాకు తోడుగా మరి యిద్దరూ మాత్రమే యీ ఉద్యమం ప్రారంభించేం'' అని రామమూర్తి పంతులుగారే అన్నారు. ''తక్కిన వారందరూ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారితో కలిసి మా ఉద్యమాన్ని యెదిరించినవారే''ననిన్నీ చెప్పేరు

దీని ఉదంతం యేమిటంటే—

## ఆంధ్రసాహిత్య పరిషత్తు - రామరావణ యోర్యుద్ధం :

జయంతి రామయ్యపంతులుగారు అప్పటికప్పుడే తెలుగులో పెద్ద పరిశోధకుడనీ, పండితుడనీ పేరుమోసేరు. దానికితోడు పదవిలో ఉన్నవ్యక్తి. ఆయనకి గిడుగువారి వ్యావహారికవాదం నచ్చలేదు. పండితులకీ, శిష్టవ్యవహారానికీ కూడా చుక్కెదురే. అంచేత పండితులంతా ఆయనపక్షం వహించేరు. అయితే, రామమూర్తి పంతులుగారికి విశాఖపట్నం కాలేజీ ప్రిన్సిపాల్‌గాఉండే శ్రీనివాస అయ్యంగారూ, విద్యాశాఖాధికారి యేట్సు పెట్టని గోడలు. వీరి మద్దతుకొంతా, ఆత్మవిశ్వాసం ముఖ్యాధారంగానూ రామమూర్తి పంతులుగారు విశ్వవిద్యాలయాల్లో కూడా వ్యావహారిక భాషకే ప్రాముఖ్యం యివ్వాలనీ, వ్యావహారికంలో రాసిన పుస్తకాలే పాఠ్యగ్రంథాలుగా నియమించాలనీ ఉద్ఘాటించేరు. ''అంతమందీ కలిసి, ఆ రోజుల్లో వేదం వెంకటాచలయ్యగారు వ్యావహారిక భాషలో రచించిన **Sheridan** నాటకానికి తెనుగు అనువాదం – విధిలేక వైద్యుడు అనేదాన్ని–పాఠ్యగ్రంథంగా నిర్ణయించేరు.

దాంతో వాదోపవాదాలు బయలుదేరాయి.

అప్పుడు శ్రీనివాస అయ్యంగారు, ''లైఫ్ ఆర్ డెత్—ఎ ప్లీ ఫార్ వెర్నాక్యులర్స్'' అనే గ్రంథాన్ని యింగ్లీషులో రాసి, రామమూర్తి పంతులుగారి వాదానికి యెంతో బలం చేకూర్చేరు.

1911 సరికి చెట్టి లక్ష్మీనరసింహంగారూ, డా॥ బస్రా శేషగిరిరావుగారూ, కిళాంబి రామానుజాచారిగారి వంటి ప్రముఖులు తోడుగా ''ఆంధ్రసారస్వత సంఘం'' బయలుదేరింది. అదుగో అప్పుడు! జయంతి రామయ్య పంతులుగారు ''ఆంధ్రసాహిత్య పరిషత్తు'' లేవదీసి వ్యావహారిక భాషావిరుద్ధ ప్రచారం మొదలుపెట్టేరు.

ఆంధ్ర సాహిత్య పరిషత్తులో కూడా తమ వాదానికి బలం చేకూర్చుకోవాలని, రామమూర్తి పంతులుగారు ప్రయత్నించేరు. తణుకులో జరిగిన సాహిత్య పరిషత్సభకి జయంతి రామయ్య పంతులుగారెందుకో వెళ్ళలేకపోతే, ఆచంట వెంకట సాంఖ్యాయనశర్మగారు అధ్యక్షత వహించేరు. ఆ సభలో వ్యావహారిక భాషా తీర్మానాన్ని రామమూర్తి పంతులుగారు ప్రవేశపెట్టేరు. ''దాంతో పెద్ద ఉపద్రవం జరిగిపోయినట్లు భయపడి, అటుపైన జరిగే సాంవత్సరికోత్సవములలో అటువంటి తీర్మానాలు మరి రాకుండా ఉండేటట్టున్నూ, వ్యావహారిక భాషావాదులు యెవరూ తమ పరిషత్తులో సభ్యులుగా చేరకుండా ఉండేటట్టున్నూ కట్టుదిట్టాలు చేసుకున్నా''రని రామమూర్తి పంతులుగారే అన్నారు.

అయినప్పటికీ, 1912 సం॥లో గురజాడ అప్పారావుగారు, మద్రాసు యూనివర్సిటీలో శిష్టవ్యావహారిక భాషలోఉండే గ్రంథాలనే విద్యాలయాల్లో బోధించాలన్న తీర్మానం ప్రతిపాదించేరు. ఈ విషయం పరిశీలించి, నిర్ణయించడానికి యూనివర్సిటీవారు ఒక కమిటీని యేర్పాటు చేసేరు. అందులో నలుగురు వ్యావహారిక

వాదులూ, నలుగురు గ్రాంథికవాదులూ, యిద్దరు తటస్థులూ ఉన్నారు. తటస్థులు యిద్దరూ వ్యావహారిక వాదులతో యేకీభవించి, శిష్టవ్యావహారికం గ్రాహ్యం అనేసరికి, గ్రాంథికవాదులకి యిది ''రాక్షసకృత్యం'' అని తోచి, మరో నలుగురు గ్రాంథికవాదులని కమిటీలో చేర్పించి అప్పారావుగారి తీర్మానం వీగిపోయేటట్టు చేసేరు. (చూ. అప్పారావుగారి మినిట్ ఆఫ్ డిసెంట్.)

''పరిషత్తు వారి ప్రతిష్ఠ, గౌరవమూ, ప్రాభవమూ ఎక్కువగా ఉండడమువల్ల ఆ పరిషత్తువారి అభిప్రాయము ననుసరించి, తెలుగుదేశమునందలి పెద్దలందరూ తీర్మానముచేసి, గవర్నమెంటువారికి ఎక్కువగా ఒత్తిడి కలిగించి, వాస్తవమైన దేశభాష బడిపిల్లలు అభ్యసించకుండా చేసేరు'' అని రామమూర్తి పంతులుగారన్నారు.

అయితే, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి వంటివారు మాత్రం, ''పాతబడ్డ మాటలు రచన కర్హములుకావు, వాటి సంప్రదాయము నేటివారికి తెలియదు ప్రాచీనకవి ప్రయోగములెన్నో పూర్వవ్యాకరణమునకు విరుద్ధముగా నున్నవి దేశ్య శబ్దజాలము మారునట్లే దేశ భాషా వ్యాకరణములునూ మారుచుండవలెను. తదనుగుణమైన రచన పండిత పామర రంజకము'' అని రామమూర్తి పంతులుగారి వాదంలోని సత్యాన్ని గ్రహించేరు. కాని, కొక్కొండ వెంకటరత్నంపంతులుగారికీ, వేదం వేంకటరాయ శాస్త్రిగారికీ యింకా చాలామంది పండితులకీ రామమూర్తిపంతులు గారి వాదం అంటే పడేదికాదు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తమ ''వజ్రాయుధం''తో వ్యావహారిక వాదాన్ని తీవ్రంగా యెదుర్కొని యుద్ధంచేసేరు—జయంతి రామయ్యపంతులుగారిలాగే. రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ అన్నట్టుగానే నడిచింది, యీ గ్రాంథిక—వ్యావహారిక భాషావాగ్యుద్ధం. ''సుమారు ముప్ఫై సంవత్సరాలనుంచీ వర్తమానాంధ్ర భాషా ప్రయోజనం గురించి పాటుపడుతున్నాను. వ్యావహారిక భాషాగౌరవాన్ని నిలబెట్టడానికి నేను ప్రయత్నిస్తూ ఉంటే, దాన్ని పడగొట్టడానికి ఆంధ్రసాహిత్య పరిషత్తువారు పనిచేస్తూ వచ్చేరు'' అని తరవాత కూడా రామమూర్తి పంతులుగారు నొచ్చుకున్నారు. కొమ్ములు తిరిగిన పండితులలో అగ్రస్థానం ఆక్రమించుకున్న చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు ఆ రోజుల్లో తటస్థంగానే ఉన్నా, తరవాత ఉత్కృష్టమైన శిష్టవ్యావహారికంలో రాసేరు. ఇలాగే దాసు శ్రీరాములుగారు, ''తెలుగునాడు'' అనే గ్రంథం, ఆంధ్రదేశంలో అన్ని బ్రాహ్మణశాఖలూ మాట్లాడే వ్యవహారికాన్ని ప్రయోగిస్తూ రచించారు.

1913 లో విజయనగరం కాలేజీలో జరిగిన ఒక సభలో, ''ఈ వ్యావహారిక భాషలో గేయాలు రచించుకోవలసిందే కాని వృత్తాలు రచించగలరా ?'' అని యెవరో ప్రశ్నిస్తే, ''మా వాదం ముఖ్యంగా గద్య రచనకు. పద్యం విషయంలో అర్వాచీన కవి ప్రయోగాలూ, ఆ సంప్రదాయాన్ని అనుసరించి నేటి ప్రయోగాలూ కూడా చేర్చుకొండి. వాడుక నుంచి పూర్తిగా తొలిగిపోయిన ''అనవుడు'' ''నావుడు'' వంటి ప్రయోగాలు విడిచిపెట్టమని కోరుతున్నాం'' అన్నారు రామమూర్తి పంతులుగారు.

## కవిత్వం అంటే కిట్టేది కాదు

రామమూర్తి పంతులుగారికి పద్యాలు రాయడం అంటే కిట్టేది కాదు. దానివల్ల చదువు పాడైపోతుందని వారి భయం. వారి కుమారుడు సీతాపతి, ధర్మశాస్త్రం చదువుతూ ఉన్నప్పుడు ఏవో పద్యాలు రాస్తూ ఉండగా చూసి, మండలమీద పెన్సిలుతో కొట్టి, ఇంక రాయవద్దని శాసించేరుట ! ఆ తరువాత కూడా 1916 లో సీతాపతిగారు ఏవో పద్యాలు రాస్తూ ఉంటే చూసి, ''కాలేజీ పనులూ, ఊళ్లో వేడుకలూ, నాటకాలూ, క్లబ్బులూ — అన్నింటిలోనూ ఉంటానంటావు. నావద్ద కూర్చుండి తెలుగు భాషా కృషి చెయ్యడానికే నీకు తీరుబడి లేకుండా ఉంది కదా ! దీనికితోడు కవిత్వం కూడా పెట్టుకుంటే యెలాగరా బాబూ? దేశంలో చాలా మంది కవులున్నారు. మనం చేస్తూన్న కృషి చేస్తూన్నవారు కొద్దిమందే. అంచేత, నాతోపాటు భాషా కృషి చెయ్యి. నేను తలపెట్టిన 'బాల కవి శరణ్యా'నికి నువ్వు తోడుపడు'' అని గట్టిగా మందలించేరుట.

## కర్మ వీరుడు

నేటి కాలంలో, ముఖ్యంగా గత ముప్ఫై, నలభై సంవత్సరాల నుంచీ వస్తూన్న సాహిత్యం అంతా శిష్ట వ్యవహారంలోనే. విశ్వవిద్యాలయంవారు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా ప్రజా బాహుళ్యం దాన్ని చేపట్టింది. రామమూర్తి పంతులుగారి వాదంలోనే నిలిచింది. ఆ తరవాత విశ్వవిద్యాలయం వారు కూడా ''కళా ప్రపూర్ణ'' బిరుదు యిచ్చి రామమూర్తి పంతులుగారిని గౌరవించేరు. ''వారు ఆ జయం కళ్ళారా చూసే పరమ పదించేరు స్థిత ప్రజ్ఞుడు, కర్మవీరుడు'' అన్నారు కురుగంటివారు.

## ఆత్మగౌరవం కల మనిషి :

రామమూర్తి పంతులుగారు 1913 లో విజయనగరం రాజకుమార్(పిమ్మట సర్ విజ్జీ)గారికీ, వారి సోదరికీ ట్యూటర్‌గా నియమితులైనారు. డైరక్టు మెథడ్‌లో ఫొనెటిక్ లిపితో అనాయాసంగానూ, ఎక్కువ వేగంగానూ విద్య నేర్పవచ్చును అన్న రామమూర్తి పంతులుగారి పరిశోధనే దీనికి ప్రేరకం. కాని, కోటలో ప్రభువులు పంతులుగారి కనిష్ఠ పుత్రుడైన సూర్యనారాయణని కూడా రాజావారి పిల్లలతో సమానంగా ఆదరించిన కారణాన, ఆశ్రిత ప్రజల్లో యీర్ష్య బలిసిపోయింది. ఈఫొనిటిక్‌లిపీ, డైరక్టు మెథడూ మనకి పనికిరావనీ, పాత పద్ధతిలో పాఠాలు చెప్పించవలసిందనీ రాణీ వారిని ఒత్తిడి చేసేరు. ఆమె, మామూలు పద్ధతిలో పాఠాలు చెప్పవలసిందని రామమూర్తి పంతులుగారిని ఆజ్ఞాపించగా, వారు వెంటనే ఆ ఉద్యోగం విడిచిపెట్టేసేరు ! జీవనోపాధి

కయినా తిలోదకాలు యివ్వడానికి సిద్ధపడ్డారు కాని, త్రికరణ శుద్ధిగా విశ్వసించిన దాన్ని మాత్రం యెన్నడూ త్యజించే స్వభావం కాదు, వారిది ! !

## సిసలైన ఆంధ్రుడు :

1936 లో ఒరిస్సా రాష్ట్రం యేర్పడే ముందు, ఇతర రాష్ట్రాల నుండి ఏయే భాగాలు విడదీసి ఆ రాష్ట్రంలో కలపాలో సూచించడానికని Odonell Commission ఏర్పాటైంది. పర్లాకిమిడి తాలూకా అంతా ఒరిస్సాలో చేర్చాలని రాజావారు అభిలషించేరు. అప్పుడు, పర్లాకిమిడి తాలూకాలోని తెలుగువారంతా దాన్ని ప్రతిఘటిస్తూ రామమూర్తి పంతులుగారినీ, మరి కొందరినీ నాయకులుగా పెట్టుకున్నారు. చారిత్రక ప్రమాణాలతోనూ, 1931 సం॥రపు జనాభా లెక్కల ఆధారంతోనూ, పర్లాకిమిడిలో 60శాతం తెలుగువారు ఉన్నారు కనకా, పూర్వకాలం నుంచీ అది తెలుగుదేశమే కనకనున్నూ, ఆ తాలూకా ఒరిస్సా రాష్ట్రంలో చేర్చకూడదని రామమూర్తి పంతులుగారు కమిషను ముందు నివేదించేరు.

అప్పుడు, అలాగ పని జరగదని, పర్లాకిమిడి రాజావారు ఓఢ్రులు కనక వారి తాలూకా ఒరిస్సా రాష్ట్రంలో ఉండాలని రాజావారి పక్షంవారు సూచించేరు. ఆ రాజులు గంగ వంశం వారనీ, అనంతవర్మ చోడగంగ కటకం జయించి, తన రాజధానిని ముఖలింగం నుంచి కటకానికి తరలించేదాకా, గంగవంశపు రాజులకు ఒరియా భాషతో పరిచయంవే లేదనిన్నీ, ఆ ప్రదేశం తెలుగు వారిదేననీ, రాజావారి ఆదాయం కూడా చాలా ఎక్కువగా తెలుగు రైతులనుండే వస్తూన్నదనిన్నీ రామమూర్తి పంతులుగారు వాదించేరు. అప్పటికి వారికి డెబ్బై రెండేళ్లు.

అంచేత, 1933 లో జాయింట్ పార్లమెంటరీ కమిటీకి తెలుగువారి నివేదిక నర్పించి, వాదించడానికి పర్లాకిమిడి తెలుగువారి ప్రతినిధిగా, రామమూర్తి పంతులుగారి కుమారుడు సీతాపతిగారు లండన్ వెళ్లేరు. సర్ శామ్యు అల్ హోర్, అట్లీ, జెఫ్రుల్లాఖాన్ మొదలైన అయిదుగురు వీరి వాదనా, పర్లాకిమిడి రాజా కళ్ళికోట రాజా మొదలైన ఒరిస్సా ప్రతినిధుల వాదనా, వేరువేరుగా విన్నారు.

అప్పట్లో, పర్లాకిమిడి తాలూకా ఏమాత్రంన్నూ ఒరిస్సా రాష్ట్రంలో కలవడానికి వీల్లేదన్న నిశ్చయంవే జరిగింది.

సీతాపతిగారు లండన్‌నుంచివస్తూ చెన్నపట్నం గవర్నర్‌నూ, అతని ఏ. డి. కాంగ్‌గాఉండిన క్రాంబీనీ ఉదకమండలంలో కలుసుకుని మాట్లాడినప్పుడు కూడా, వారిద్దరూ వీరిని అభినందించి, "పర్లాకిమిడి తాలూకాలో ఏ చిన్న భాగం కూడా ఒరిస్సాలో కలియద"ని చెప్పేరు.

ఆ తరవాతనే ప్రభుత్వంవారు రామమూర్తి పంతులుగారికి "కెయిజర్ హింద్" బంగారు పతకం బహుమానించి సమ్మానిస్తున్నట్టు ప్రకటించేరు. గవర్నరుగారు యీ పతకం పర్లాకిమిడి సభలో యివ్వడానికి నిశ్చయించేరు; కాని రాజావారు తన నగరులో యీ సభ జరగడానికి వీలుకాదన్నారు. అందుచేత ఛత్రపురంలో జరిగిన సభలో ఆ పతక బహూకరణమ్నూ, సమ్మానంవూ జరిగేయి అని సీతాపతిగారు తమ స్వీయచరిత్రలో రాసేరు.

అయితే, ఇండియా వ్యవస్థ నిర్ణయించడానికి యేర్పడ్డ ఆ జాయింట్ పార్లమెంటరీ కమిటీ దృష్టిలో ఒరిస్సారాష్ట్ర నిర్మాణం అంత ముఖ్యవిషయం కాకపోవడంవల్ల, ఆ "పర్లాకిమిడి తీర్పు" ప్రకటించడం 1935 వరకూ మూలపడిపోయింది అలోగా 1934లో పర్లాకిమిడి రాజా మళ్లీ లండన్ వెళ్ళి పెద్దల నాశ్రయించి, పర్లాకిమిడిపట్నంతో ఓ చిన్న భాగం అయినా ఒరిస్సా రాష్ట్రంలో కలపమని ప్రార్థించేడు. "అతని కోరికని మన్నించి, 600 గ్రామాలుగల పర్లాకిమిడి తాలూకాలో 200 గ్రామాలున్నూ, పర్లాకిమిడి బస్తీ ప్రాంతంన్నూ ఒరిస్సా కలుపుటకు నిశ్చయించినట్లు ప్రకటించేరు."

1936లో ఏనాడు ఒరిస్సా రాష్ట్రం యేర్పడుతుందని ప్రకటించేరో, ఆనాడే రామమూర్తి పంతులుగారు భార్యా సమేతంగా రాజమహేంద్రం తరలి వెళిపోయి, అఖండ గోదావరిలో కంఠం ములుగు లోతు నీళ్లలో నిలబడి యీ అక్రమాన్ని ప్రతిఘటిస్తూ, తమ కంఠంలో ప్రాణం ఉన్నంతవరకూ మళ్లీయింక పర్లాకిమిడి వెళ్ళనని శపథం చేసేరు. 31 జనవరి 1940 లో మద్రాసు ఆస్పత్రిలో చివరిశ్వాస విడిచేవరకూ ఆ మాటమీదే నిలబడ్డారు!

ఎక్కడో పర్లాకిమిడి కొండల్లో ఉనికి—చేస్తూన్నది చిన్న మేస్టరు గిరీ. ఆ తరవాతనయినా చరిత్ర అధ్యాపకత్వం. ఆ ఉన్న ఊరు కూడా మహాపట్నంకాదు, అక్కడ ఏ గ్రంథాలయాలూ లేవు. అయినప్పటికీ స్వయంకృషిపైన ఆధారపడి సవరల భాషా భారం వహించి సాధించేరు ఎవడో దొర లేవదీసిన శంకని పురస్కరించుకుని—భాష లోతులకిపోయి; దాని స్వరూపం కనుక్కొనీ, జీవద్భాషా నిరూపణం చేసి, శిష్ట వ్యవహారం అంటూ ముప్ఫై యేళ్లకి పైగా కొమ్ములు తిరిగిన పండితులతో వాగ్యుద్ధం సలిపి, యావదాంధ్రాన్నీ జాగృతంచేసి, మనం యిప్పుడు అసంఖ్యాకంగా రచనలు చెయ్యడానికి కారకులు అయేరు. క్రియాసిద్ధిః సత్వే భవతి మహతాం నోపకరణే !

ఈ వ్యాసం రాయడానికి ఉపయుక్తమైనవి :

1) ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడ్యుకేషన్. 189
2) స్వీయచరిత్ర—డా॥ గిడుగు వెంకటసీతాపతి, డి. లిట్
3) సవరలు—జి. వి. రామమూర్తి.
4) మినిట్ ఆఫ్ డిసెంట్ — గురజాడ అప్పారావు.

5) గిడుగు రామమూర్తి పం॥గారి సప్తతిమ జన్మదినో త్సవ సమ్మాన సంపుటం.

6) నవ్యాంధ్ర సాహిత్య వీధులు.

## అ థో జ్ఞా పి క లు

1 ఆరోజుల్లో ఎఫ్. ఏ. అనేవారు. ఇంటర్‌మిడియట్ అన్నది తరవాతవచ్చింది.

2 ఎజెన్సీ ట్రీట్

3 "Nothing canbe sounder than his(Ramamurty's Views as to the necessity of beginning the education of the backward communities orally and in their vernacular"-Editor, Indian Journal of Education (1894)

4 "పెద్దకొవ్వొత్తులున్నాయి, చూసేవూ? ఒక్కొక్కటీ రెండుగంటలు వెలుగుతుంది. ఇటొకటీ, అటొకటీ పెట్టుకుని రాత్రి8గం॥లకి చదువు ప్రారంభించేవాడ్ని. ఆరెండగా అయిపోగానే మరోరెండు వెలిగించేవాడ్ని. ఆ రెండూకూడా అయిపోయేసరికి పన్నెండగా అయేది;అప్పుడుపడుకునేవాడ్ని చెవిటి సొదకాదూ? ఇంట్లోనూ, వీధులోనూ యెంత అల్లరిజరిగినా నాకు ఫరవాలేకపోయేది!" అని నవ్వుతూ 1932లో రచయితతోఅన్నారు రామమూర్తిపంతులుగారు.

# సమ్మెరోజున సామాన్యుడు

## శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

తాళాలు అలంకారా లయ్యేను విద్యానిలయాలకు
బాకులు తగిలేను విద్యార్థుల తలిదండ్రుల గుండెలకు
మూగతనం వచ్చేను ముచ్చట గొలిపే బజారు వీధులకు
బాధాసర్పాలు చుట్టుకొనేను సామాన్యుల మెడలకు.

బండనిద్ర ఆవహించెను పరిగెత్తే బస్సులకు
ప్రేతకళ వచ్చెను చూడ చక్కని ఆఫీసులకు.
రేయింబవలు రెక్కలు ముక్కలు చేసుకునే మిల్లు
కబంధహస్తాలతో గట్టిగా మూసుకుంది కళ్ళు.

నిగనిగలాడే టాక్సీలూ, గణగణసైకిలు రిక్షాలూ
తమకు తామే తగిలించుకొనెను శృంఖలాలు

*　　*　　*

తైలసంస్కారం లేని జుట్టుని స్ఫురణకు తెచ్చింది
బాటల మీద పేరుకు పోయిన చెత్త చెదారం.

పురుగులతో లుకలుక లాడే మేడిపండుని గుర్తుచేసింది
మశక సంతానంతో మూసుకుపోయిన మురుగు కాలవ.

పురిటి నొప్పులు పడుతున్న తన భార్యను చూడలేక
అందరి మీద అక్షతలు వేశాడు భర్త విధిలేక.

చేతిలో డబ్బులుండీ సరుకులు కొనలేని గృహస్థు
ఆకలిని నెమరు వేసుకుంటూ ఉండిపోయాడు పస్తు.

కడుపులో తిరిగే పిల్లుల్ని కట్టడిలో ఉంచలేని బ్రహ్మచారి
తిండికోసం ఎక్కడెక్కడి సందులూ గాలించాడు ఒక్కసారి.

*　　*　　*

జయప్రదంగా సమ్మె జరిగిందని ప్రకటించారు
జయజయ ధ్వానాలు చేశారు, జరిపారు ఊరేగింపులు
సమ్మెను నిర్వహించిన నాయకులు.

*　　*　　*

ఇదంతా చూచిన సామాన్యుడు
ముక్కుమీద వేలు వేసుకున్నాడు!
అక్కసుని లోలోన అణుచుకున్నాడు
అంతకంటె ఇంకేం చెయ్యగలడు!!

శ్రీ నెమలికంటి ముకుందరావు

# రెండు గున్నపురెడ్డిపేట శిలాశాసనములు

ఇందు క్రిందివ నివ్వబడిన రెండు శాసనములు ఒకబండ కిరువైపుల క్రీ.శ. 12వ శతాబ్దికి చెందిన తెలుగు – కన్నడ లిపిలో వ్రాయబడి భీముని పట్నం తాలూక, విశాఖ పట్నం జిల్లాలో గల గున్నపురెడ్డిపేట గ్రామమందు దొరికినవి. ఆ గ్రామమునకు సమీపమున గల 'కనిమెట్ట' అనే గుట్ట క్రింది భాగమున చెరువు గట్టు మీద నిలబెట్టి యున్నది. దీనిని తొలుత కేంద్రప్రభుత్వ శాసన పరిశోధన శాఖ వారు తమ 1958–59 వార్షిక నివేదికలో 108 నంబరుగా నమోదు చేసిరి.

మొదటి వైపున గల శాసనము 9బంతులు. రెండవ వైపున గల శాసనము 13 బంతులు. అక్షరములు గుండ్రఖత్తుగా చెక్కబడినవి. లిపి ప్రత్యేకతలు ఏమియును లేవు. మొదటి శాసనము శక సంవత్సరంబులు (తేదీ) గల భాగం విరిగిపోయినది, కాని 'మేషమాసము, పౌర్ణమి శుక్రవారమున'' అనియున్నది. రెండవ శాసనము శక సంవత్సరములు 1079 అనియూ మరియూ తెలుగున 'వసుశైలఖేందు' (అనగా వసు = 8; శైల = 7; ఖ = 0; ఇందు = 1) ''అంకానాం వామతోగతి:' అన్న నియమ ప్రకారం శక సంవత్సరములు 1078గా యివ్వబడింది, మరియూ మీన కృష్ణ పంచ్చమి రవి వారము అని తిథి మాస పక్ష వారములు మాత్రము చెప్పబడినవి. సరియైన వివరణలు లేని కారణమున ఇంగ్లీషు తేది చెప్పుటకు వీలుగాకున్నది.

## మొదటి శాసన సారాంశము:

''రాజ చింతామణి'' మరియు ''గంగ బ్రహ్మమారాయ'' బిరుదాంచితుడయిన ఆడుపాకకాపినాయ్కుని కొమరుడు మరియు ప్రధానియైన దామన సింద్వార పర్వతమున నున్న కనుమద్ది జెటేశ్వర దేవరకు (జటేశ్వరుని పేర నిర్మించ బడిన శివాలయం) సమర్పించబడిన అఖండదీపము మరియు దానిని వెలిగించుటకు నొసగబడిన ద్రవ్యం మాడలు 5.

## రెండవశాసనసారాంశం:

శక సంవత్సరములు 1079 మీనకృష్ణ పంచ్చమీ ఆదివారము నాడు కనుమద్ది గ్రామస్తుడూ మధురాన్తక కర్నాటి శెట్టికొమరుడూ ప్రధానియూనైన రేచన కనుమద్ది జటేశ్వరదేవరకు సమర్పించిన అఖండదీపము మరియూ దానిని వెలిగించుటకై యొసగిన ద్రవ్యము మాడలు 5.

ఇూ రెండు శాసనములలో నివ్వబడిన తేదీల ప్రకారం అనగా శ. సం.1078,1079లకు సరియగు క్రీ. సం. 1156,

1157 అవును. ఈ శాసనములలో ఫలానారాజుపేరుగాని లేక వంశముపేరుగానిలేదు. కాగా రేచన ఒక సార్వభౌమునికి ప్రధాని అని చెప్పబడెను. అటులనే మొదటి శాసనములోకవబడు ప్రభుత్వ బిరుదులు వహించిన దామనయూ ఒక ప్రధానియే. ఈ బిరుదులలో నొకటగు 'గంగ్గ బ్రహ్మమారాయ' బిరుదు తూర్పుగాంగ సైన్యాధిపతులు, మంత్రులు మరియు మాండలికులు వహించినట్లు మనకు పెక్కు తూర్పుగాంగశాసనముల ద్వారా తెలియుచున్నది. [1] కనుక ఈరెండు శాసనములు తూర్పుగాంగ చక్రవర్తుల కాలంనాటివని శకసంవత్సరములు పై బిరుదులు రుజువుచేయును. యింతకన్న ముఖ్యమైనవిషయము అక్కడ కట్టించబడిన శివాలయము తూర్పు గాంగ చక్రవర్తి అనంత వర్మ చోడగంగ (క్రీ.సం.1077మొదలు 1147 వరకు పాలించిన) ని ప్రథమకుమారుడైన కామార్ణవుని మఱొక నామధేయమైన జటేశ్వరునిపేర కట్టించుటయే.

గోదావరీ నది మొదలుగా గంగానదీ ముఖద్వారమువరకు కళింగమునేలినవారు త్రికళింగాధిపతులైన అర్వాచీన తూర్పు గాంగ చక్రవర్తి అనంతవర్మ చోడగంగ మరియు అతని సంతతి, ఈతాతడు క్రీ.సం. 1077నుంచి క్రీ.సం. 1147వరకు 72రాజ్యవర్షములు పరిపాలించెను యితని రాజధాని తొలుత కళింగ నగరము (అనగానేటి శ్రీకాకుళం జిల్లా పాతపట్నం తాలూకాలోని ముఖలింగం) తదుపరి ఉత్కళమును జయించి క్రీ.సం. 1115 తదుపరి కటకం (ఒరిస్సాలోని నేటికటకం)రాజధానిగా పైప్రాంతమునేలెను. యితని సంతతి వరుసగా కామార్ణవ, రాఘవ, రెండవ రాజరాజు మరియు మొదటి అనంగ భీముడు. ఇందు కామార్ణవునికి జ టే శ్వ రు డ ని మరియొక పేరునూ గలదు [2] ఈ నలుగురు సుతులు వరుసగా 10,15,25 మరియు 10రాజ్య లేక అంకవర్షములు [3] పాలించినట్లు తామ్ర శిలాశాసనములు తెల్పుతున్నవి.

కామార్ణవ లేక జటేశ్వరం శకసంవత్సరములు 1068 (అనగా క్రీ.సం. 1146) మొదలుకొని పది సంవత్సరములు శక సంవత్సరములు 1077 (అనగా 1155 క్రీ.సం.) వరకు రాజ్యమేలినట్లు ఈ క్రింది శాసనముల ద్వారా తెలియును.

1. ముఖలింగం, శాసనం శ.సం. 1070—రాజ్యవర్షం— 3 (జటేశ్వర ప్రవర్ధమాన సంవత్సరములు) (చూ:ద. హిం.శా.సం. 5,నెం.1044)

2. ముఖలింగం శాసనం. శ.సం. 1070—రాజ్యవర్షం — 3 (చూ. అదే.నెం. 1147)

3. తాలాడ శాసనం. శ.సం. 1070—రాజ్యవర్షం — 3 (చూ:ఎ.ఆర్. 1959 –60,నెం. 164)

4. శ్రీ కూర్మం శాసనం. శ.సం. 1071 —రాజ్యవర్షం –4 (చూ:ద.హిం.శా.సం.5, నెం. 1322)

5. రెల్లివలస శాసనం శ.సం. 1075—రాజ్యవర్షం — 8 (చూ:ద.హిం.శా సం. 10, నెం. 707)

6. శ్రీ కూర్మం శాసనం శ సం. 1078— రాజ్యవర్షం –9 (చూ: అదే సం. 5,నెం. 1321)

7. ముఖలింగం శాసనం. శ సం. 1077 — రాజ్యవర్షం–10 (చూ:అదే.సం. 5, నెం, 1148)

పైనుదహరించిన కడపటి శాసన ప్రకారం శ.సం. 1077 కామర్ణవుని 10వ రాజ్యవర్షం. అనగా శకసంవత్సరములు 1077 నుంచి వెనుకకు లెక్కకట్టిన శకసంవత్సరములు 1068 (వర్తమానముగా) 10 సంవత్సరములు సరిపోవుచున్నవి. అవి క్రీ.సం. 1146 మొదలు కొని క్రీ సం. 1155 వరకు కామార్ణవుని పాలనా కాలమును తెలుపును. కాగా కామార్ణవ లేక జటేశ్వరుని తమ్ముడు రాఘవుడు క్రీ.సం. 1156 మొదలు కొని 15 రాజ్యలేక అంక వర్షములు అనగా క్రీ.సం. 1171 వరకు రాజ్యము నెరపినట్లు శాసనాధారములు కలవు. పలువురు చరిత్రకారులు వాటిని ప్రమాణముగనూ నెంచిరి. [4]

అటులయిన ప్రస్తుత శాసనములు క్రీ.సం.1156,1157 నాటివిగదా. ఇర్వురు రాజ ప్రధానులు అర్వాచీన తూర్పు గాంగరాజుల



మొదటివైపు

సేవచేయుచు వారిచే కళింగము లోని భాగమయిన ంగా ప్రాంత మందు (అందు రేచని స్వగ్రామము కనుమద్ది) జటేశ్వరలేక కామార్ణవ గతించిన పిదపనూ, బహుశ అతను తమ్ముడు రాఘవుని పట్టాభిషేక మహోత్సవముకు పూర్వము ంయీ శాసనములు — దానములు వేయించ బడినవని నావూహ. అనగా క్రీ.సం.1155–56 మధ్య సంధి కాలంలో [5] కామార్ణవుడు లేక జటేశ్వరుడు గతించె ననుటకు ంయీ శాసనములు తోడ్పడును. కాగా తమ్ముడైన రాఘవుని పేరు సూచించ బడలేదు కారణం పై రాజకీయ పరిస్థితేనని తోచును.

## అధోజ్ఞాపికలు:

1. చూ. ద. హిం. శా.సం. 5, నెం. 1040,1055
2. చూ అదే. సం. 5, నెం. 1044
3. ఎపిగ్రాఫియా ఇండికా. సం. 28,పేజీలు242 మొ॥.
4. చూ. ద. హిం. శా. సం. 5, నెం.1330, 1331, 1336,1340,1341 మరియు ఎపిగ్రాఫియా ఇండికా. సం. 28, పేజి 242
5. చూ. ఎపిగ్రాఫియా ఇండికా.సం. 30, పేజి 158 మొ॥



రెండవ వైపు

## శాసనమూలము X

### మొదటివైపు.

1. స్వస్తిశకాబ్దంబు[లు......]
2. గునేటి మేషమాసపున్నమ–
3. యు శుక్రవారమున ఆడుపాకకా.
4. పినాయకు కొడుక్కు రాజచింతాను–
5. ణిగంగ్గ బ్రహ్మమారాయరి దామనప్ర–
6. ధాని సింద్వూర పర్వతముకనుమది
7. జటేశ్వర దేవరకు అఖణ్డ దీపమునకు
8. బెట్టుమాడలేను ఇంద్దులనాయకులున–
9. డపంగలవారు.

### రెండవవైపు.

1. స్వస్తి శ్రీయతుశకాబ్ద (బ్దX)ంబులు
2. 1079[నేX] ణ్టిమీనకృష్ణపంచ్చమియు–
3. నాదివారమునాండు కనుమద్దిశ్రీజ–
4. టేశ్వరదేవరకు మధురాన్తక [కX] నాటిసె–
5. ట్టికొడుకు రేచన ప్రధాని ఆచంద్రార్కస్థా–
6. యిగాంబెట్టు అఖణ్డవర్తి దీపమొక్కణ్ణి–
7. కింబెట్టు మాడలు ఏను ఈ యగారివారు
8. నడపంగలవారు [॥]శాకాబ్దేవసుశైలక్షే–
9. ంద్దుగణితే మీనేసితే పక్షకాః పంచ్చమ్యాంరవి–
10. వాసరేకనుమది గ్రామేకులోద్ధారకః[।X]శ్రీన్మధు–
11. రాన్తకాఖ్యతనయో రేచక మంత్రి ప్రభు–
12. ప్రాదాద్దేవ జటేశ్వరాయ విభవే దీపంయ–
13. మాచంద్రభం॥·

---

X శాసనములు ప్రతిబింబములనుంచి.

# అంతర్ధనం

## శ్రీ అల్లక కేశవరావు

నా జీవితాంబర పూర్వభాగంలో
ఉషఃకాంత లే వెలుగుల జిలుగు పులుముతూన్న
తొలినాటి నా పసిడి పసితనంలో
పండులాంటి వాణ్ణి నేను
పూల చెండులాంటివాణ్ణి నేను.

అలనాడు —
నా ఊహాఫలాల మధురసాలు
ఆశయ ప్రసూనాల సౌరభాలు
సర్వులయెడా సమంగా ప్రసరించేవి
సకల దిశలా సమంగానే ప్రపంచించేవి

కానీ —
తమస్సులో తేజస్సునూ
హాలా హలంలో అమృతాన్నీ
దర్శించి స్పర్శించిన నేను,

ఈనాడు —
కారు కాలమేఘాలు చిమ్మే చీకట్లలో చిక్కుకున్నాను
అయోమయంగా అగమ్య పథాన్నే తొక్కుతున్నాను
అపరిచితుడు కలతపడినా
కళవళపడి కన్నీరు జార్చు నా మంచుగుండె
ఆత్మీయుల సంక్షోభానికి సైతం
ఆవంత చలించని రాతిబండగా మారింది
స్వార్ధకవచపు పరిష్వంగంలో
నా భావాలు సౌఖ్యం అనుభవిస్తున్నవి
అలనాటి నా మేలితలపులు
ఆ ఇనుప తలుపులను తాకి
తప్తమై—అక్కడే అంతరిస్తున్నవి
తొలినాటి నా పసిమి మిసిమి
వసివాడి మసిగా మారిపోయింది
నన్నావరించుకున్న ఈ కలుషపవనాలు కాల్చబడి
మరలా నా మనస్సు
తెల్లని మల్లెలా... చల్లని మంచులా...
విరిసి మెరిసే క్షణం ...
మెత్తని వెన్నలా... తియ్యని తేనెలా ...
మురిసి కురిసే క్షణం ...
ఒక్కటైనా చాలు... ఒక్కసారే ఐనా చాలు
ఈ మజిలీ మారిపోకముందు
వస్తే — నా కదే పదివేలు —



# బసవేశ్వర వచనాలు సమగ్ర సమీక్ష

ఆంధ్ర గ్రంథమాలలో నిప్పటి కేబది యేండ్ల క్రిందట—ఆంధ్ర పిత, కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు పాల్కురికి సోమనాథుని బసవ పురాణమును ప్రకటించినారు.[1] ఆ ప్రకటన మూలముననే వీరశైవమతోద్ధారకుడగు శ్రీ బసవేశ్వరుని లోకోత్తర మహత్త్వమూ, మత సంస్కరణ, మానవతా వాదిత్వమూ, ఆంధ్ర సాహిత్య ప్రపంచమునకు పరిచితములైనవి. ఆ బసవేశ్వరుడు కర్ణాట భాషలో రచించిన వచనములకు ప్రస్తుత గ్రంధ మాంధ్రాను వాదమై యున్నది. గ్రంథకర్త మైసూరు విశ్వ విద్యాలయమున ఆంధ్ర భాషా శాఖాధ్యక్షుడు డాక్టరు బాడాల రామయ్య గ్రంథమున వచనముల యందలి విషయ వివరణముతో పాటు బసవేశ్వరుని జీవితమును గూర్చి, కాలమును గూర్చి ఒక సమగ్ర సమీక్ష 497 పుటలలో గలదు. ఇందు బసవన వచనములే గాక, కర్ణాట భాషయందుగల యితర వచన గ్రంథములు, వచన శాస్త్రసారము, సింగిరాజ పురాణము, గణభాష్య రత్నమాల, లింగ లీలా విలాస చరిత్ర, ప్రభు లింగలీల, పురాతనుల వచనములు అను వాని నుండి వచనములు అనువదింపబడినవి అవి అను బంధమున చేర్చబడినవి. బసవేశ్వరుని వచనములు 956, అను బంధమున వచనములు 159. కలిపి మొత్తము 1115 వచనముల కాంధ్రాను వాదమిందు గలదు. 852 పుటలుగల ఈ మహా గ్రంథము ను ప్రకటించినవారు తరళబాళు జగద్గురు విద్యాసంస్థ వారు. కర్ణాటక రాష్ట్రమున నున్న ఉజ్జయినీ పీఠాధిపతులగు శ్రీ సిరిగెరె తరళబాళు శ్రీ శ్రీ జగద్గురు శివాచార్య శివకుమార స్వాములవారు ఈ గ్రంథ ముద్రణమునకైన వ్యయము నంతయు ననుగ్రహించినారు. కర్ణాటక రాష్ట్రమున నిట్టి తెలుగు గ్రంథ మును ముద్రించుటకు నవకాశము గల్పించిన శ్రీ శివకుమారస్వాముల వారికి యావదాంధ్రలోకము కృతజ్ఞతాబద్ధమై యున్నది.

ఇది మైసూరు విశ్వ విద్యాలయమున పట్టము బడసిన సిద్ధాంత గ్రంథము.

## కర్ణాటక భాష, వచనములు

సమీక్ష ప్రారంభించుటకు ముందు కర్ణాటక భాషలోని వచనములను గూర్చి చెప్పవలసిన యావశ్యకత గలదు. అవి తెలుగున గల వచన, గద్యముల కంటె విలక్షణమైనవి.[2] కర్ణాట భాషలోని వచనములు మాత్రాగణ బద్ధములై, కేవల వచనములవలె గాక, నొక విధమగు గేయ ఫణితిలో నడచునవి. ఆ భాషలో వీనిని గేయములు లేక గీతములనియే వ్యవహరింతురు.[3] కావున వీనిని వచన గేయములని యనవచ్చును. వీర శైవమతా వతరణ కాలమున, బసవేశ్వరుడు—సమకాలీనులైన వీరశైవ భక్తులు, తమ తమ ఆత్మానుభవములను నీ వచనముల మూలముగా నావిష్కరించినారు. ఇవి భక్తి జ్ఞాన వైరాగ్యనీతి వేదాంత బోధకములుగ నుండి వారి వారి యిష్టదైవముల పేర వెలసినవి అనగా ప్రతి వచనము, ఒక దైవ సంబోధనతో నుండును. బసవేశ్వరుని వచనములు "కూడలి సంగను దేవా"అను మకుటముతో నున్నవి. ఆ బసవేశ్వరుని సమకాలీనుడైన అల్లము ప్రభువు వచనములు "గుహేశ్వరా" అను మకుటముతో నున్నవి అక్క మహాదేవి వచనములు "చెన్న మల్లికార్జునస్వామి" మకుటముతో నున్నవి. ఈ మకుట నియమమునుబట్టి — వీనిని "వచన శతకములు" అని యనవచ్చును. కర్ణాటక వీర శైవ వాఙ్మయమున నీ వచనములు ఒక విశిష్ట స్థానము నలంకరించినవి. అట్టి వచనములను తెలుగులోని కనువదించి వాని నాంధ్రుల కందిచ్చి నందులకు ప్రస్తుత గ్రంథకర్త బాడాల రామయ్య అత్యంతము అభినందనీయుడు.

## బసవన జీవిత చరిత్ర - కాలము అవ్యవస్థ

ఈ గ్రంథమున 'సమగ్ర సమీక్ష' యంతయు ప్రధానముగా బసవన జీవిత చరిత్రగూర్చి, అతని కాలమును గూర్చి వివరించునది యని ముందు తెలిపితిని. బసవని జీవితమును గూర్చి కన్నడమున, తెలుగున, ఆంగ్లమున గ్రంథములు, వ్యాసములు, చరిత్రలు విశేషముగా వెలువడినవి. కాని యింతవఱకు బసవేశ్వరుని జీవిత చరిత్ర సమగ్రముగా, సప్రామాణికముగా తెలుగున వెలువడనే లేదు. దీనికి కారణము లివి:

1. తెలుగున బసవని గూర్చి పరిశ్రమ చేసినవారికి బసవని గూర్చిన కన్నడ గ్రంథముల పరిచయము లేకుండుట.
2. కన్నడమున బసవని గూర్చి వ్రాసిన వారికి తెలుగుగ్రంథము లను గూర్చి తెలియకపోవుట.
3. ఆంగ్ల భాషలో బసవని గూర్చి వ్రాసిన వారికి, తెలుగు, కన్నడ గ్రంథముల ప్రసక్తి లేకపోవుట.
4. శాసనములను పరిశీలించిన చారిత్రకులు, శాసనపరిశోధకులు బసవని గూర్చిన శాసనములలోని పాఠములు ఎవరో సిద్ధాంతముల కనుకూలమో ఆ విధముగా చదివి వానిని సమన్వయించుట.

---

బసవేశ్వర వచనాలు — సమగ్ర సమీక్ష—గ్రంథకర్త డాక్టరు బాడాల రామయ్య. ప్రకాశకులు తరళబాళ జగద్గురు విద్యా సంస్థ సిరిగిరె—(చిత్రదుర్గ జిల్లా, కర్ణాటక రాష్ట్రము.)
వెల: 40 రూపాయలు:

## బసవన నిర్యాణము

పై పరిశోధనలలో పై విషయము బసవని గూర్చి వ్రాసిన వారి నెంత యపమార్గము ద్రొక్కించినదో నిరూపించుచున్నాను.

ఇప్పటి కెనుబది యేండ్ల క్రిందట రైసుదొరగారు బసవన క్రీ. శ.1167లో మరణించెననియు, ఆ మరుసటి సంవత్సరము క్రీ. శ. 1168 లో బిజ్జలుడు చంపబడెననియు వ్రాసిరి. తరువాత బసవనిగూర్చివ్రాసినవారందఱకు నిదియే అనుసరణీయమైనది. తెలుగు కన్న డాంగ్ల భాషలలో నందరకు నిదియే నిశ్చితమని యభిప్రాయము వెలసినది. ఇది ఎంతవఱకు పరిణమించినదో చూడుడు. క్రీ. శ. 1967 లో కర్ణాట ప్రభుత్వమువారు కొన్ని లక్షల ద్రవ్యమును వెచ్చించి, బసవని గూర్చి భారత వర్ష భాషలలోనున్న విషయములు సేకరించి

బసవని అష్టమ శతాబ్ది వర్ధంతి మహోశోభాయమానముగా జరిపినారు. కాని ప్రస్తుత గ్రంధకర్త నిర్నిద్ర పరిశ్రమ వలన — బసవన నిర్యాణము క్రీ. శ. 1196అని నిర్వివాదముగా నిరూపింపబడినది.

ఇక నీ గ్రంధము నందలి పరిశోధనా విశిష్టతను పరిశీలింతము.

## ప్రస్తుత గ్రంథకర్త పరిశోధనా ప్రతిభ

"అన్నీ ఒక్కయెత్తు—అగస్త్యుడు ఒక్కడూ ఒక్కయెత్తు" అనునట్లుగా, ఇదివరలో బసవని గూర్చి జరిగిన పరిశ్రమ ఒక్కయెత్తు, ప్రస్తుత గ్రంధకర్త చేసిన పరిశ్రమ ఒక్క యెత్తు అని చెప్పవచ్చును. ఇంతవఱకు అస్తవ్యస్తముగా, అవ్యక్తముగానున్న బసవన జీవితము ప్రస్తుత పరిశోధన మూలమున, మనకు నొక నిర్దిష్టమైన స్వరూపముతో సాక్షాత్కరించుచున్నది. ఇందు బసవన జననోపనయన పదవీస్వీకరణ, నిర్యాణాదులన్నియు సంవత్సరములే కాదు, మాస తిథులతో కూడ నిర్ణీతములై యున్నవి. ఇందు కొరకు గ్రంధకర్త బసవేశ్వరుని గూర్చిన సాధన సంపత్తి నంతయు సంగ్రహించినాడు.

## విషయ సేకరణము

ఈ చరిత్రకు గ్రంధకర్త 46 తెలుగు గ్రంధములను తిలకించినాడు. 24 సంస్కృత గ్రంధములను చదివినాడు. 72 కన్నడ గ్రంధములను గాలించినాడు. 20 ఆంగ్ల గ్రంధముల నవలోకించినాడు. మొత్తముమీద నీతడు సంప్రతించిన గ్రంధములు 162. పై గ్రంధములేగాక, సందర్భానుసారముగా నచ్చటచ్చట జ్యోతిష, ధర్మ శాస్త్రాది గ్రంధములు పేర్కొనబడినవి. బసవని సమకాలికములైన ఆర్ష శాఖవారు ప్రకటించిన శాసనములు కూడ నిందు సంశోధితములై యందలి యంశములు సమన్వయము చేయబడినవి. కాబట్టి విషయసేకరణమున దేనిని గ్రంధకర్త విడిచి పెట్టలేదని తెలియగలదు.

## విషయ సమన్వయము

కేవలము విషయ సేకరణమేగాక, సేకరించిన విషయాంశములను వింగడించి నీ క్రింది రీతిని తీర్చిదిద్దియున్నాడు:

## ఈ గ్రంథమున శీర్షికలు

1) వచనములు వ్రాసిన బసవన యెవరు ?
2) బసవని జన్మస్థలము
3) బసవని జాతకము
4) బసవని బంధువులు
5) బసవని ఉద్యోగము, ఉపనయనము
6) మహాప్రస్థానము
7) భక్తియే మతము
8) అనుభవ సాహిత్యము—ఆదర్శ జీవితము
9) ఆంధ్రులు చిత్రించిన బసవన

ఇందు తొమ్మిది శీర్షికలే యుండుటలో విశేషమున్నది. ఇది శైవమునకు సంబంధించిన గ్రంధము. శైవమున తొమ్మిది—నవ సంఖ్య ప్రణవము మంత్రము. పై నవ శీర్షికలచే, బసవని శైవమూర్తి మనకు ప్రత్యక్ష మగుచున్నది. వీనియందు ప్రతిపాదింపబడిన నూతన విషయములను వివరించుచున్నాను.

### 1. వచనములు వ్రాసిన బసవన యెవరు?

ఇందు బసవనను పేర్కొన్న శాసనములన్నియు పరిశీలితములైనవి. బసవని నామ ముట్టంకింపబడిన శాసనము లన్నింటి యందు కనబడు బసవన వీరశైవ మతోద్ధారకుడగు బసవన కాడనియు, "సంగన బసవన"అని స్పష్టముగా పేర్కొనిన శాసనములే. వీరశైవ మతోద్ధారకుడగు బసవని తెలుపునని నిర్ధారణ చేయబడినది. ఫ్లీటు దొర మణిగవల్లి శాసనమున మాదిరాజ సుతుడైన బసవనయే, వీరశైవ మతోద్ధారకుడగు బసవన్నయని వ్రాయగా, గ్రంధకర్త — ఆ మాది రాజనకును, మతోద్ధారకుని తండ్రియైన మాదిరాజునకు గోత్ర భేదమున్నందున — మణిగవల్లి శాసనమున పేర్కొనబడిన బసవన వేఱని ఖండించినాడు. అర్జునవాడ శాసనమున, "సంగన బసవన" యని యుండుటచే నది మతోద్ధారకుడగు బసవనకు సంబంధించినదే యని స్థిరపరచినాడు.

### 2. బసవన జన్మస్థలము

పాల్కురికి సోమనాధుడు బసవని జన్మస్థలము 'హింగుళేశ్వర బాగెవాడి' యని తెలిపినాడు. కన్నడకవియగు హరిహరుడు—బసవన

జన్మస్థలము హింగుళేశ్వరమనియే వ్రాసినాడు. కాని బసవన జన్మిం చినది బాగెవాడి. అట్లయినను సోమనాథుడు వ్రాసినది సరియైనదే యని గ్రంథకర్త యీ క్రింది రీతిని సమర్థించినాడు. బాగెవాడి హింగుళేశ్వరమున కొలమైళ్ల దూరము మాత్రమేయున్న గ్రామము. సాధారణముగా నొక గ్రామమును నిర్దేశించునపుడు దగ్గరగానున్న ప్రసిద్ధ గ్రామముతో చేర్చి చెప్పుదురు. హింగుళేశ్వరము ప్రసిద్ధ గ్రామము. అందుచే సోమనాథుడు రెండింటిని కలిపి చెప్పినాడు. తెలుగు దేశమున నీ సంప్రదాయమున్నది. పశ్చిమ గోదావరి మండల మున క్షీరారామమును, దగ్గరగానున్న పాలకొల్లును చేర్చి పాలకొల్లు క్షీరారామము అని యందురు. ఇది యెంతయు సమంజసముగా నున్నది.

## 3. బసవని జాతకము

ఇంతవరకు ముందెవ్వరును చెప్పని బసవని జన్మతిథి నిర్ణ యింపబడినది. ఆ సుదినము 21–1–1140.

## 4. బసవన బంధువులు–

ఇదియు ముఖ్యమైనదే–శాసన పరిశోధకులు అర్జునవాడ శాసనమున బసవనకు లేని యగ్రజుని నొకని సృష్టింపగా ప్రస్తుత గ్రంథకర్త శాసనమునందలి ప్రత్యక్షరము పరిశీలించి, బసవనకు అగ్రజుడు లేడని ప్రామాణికముగా నిరూపించినాడు. ఆ సందర్భ మిది. శాసనమున

"సంగన బసవన అఘ్రి ×
గ్రైకం. దేవరాజ మునీ పనతనయం"

అని యుండగా శాసన శోధకులు 'అఘ్రి' శబ్దమును 'అగ్ర' అని గ్రహించి, యక్షరము లేని స్థలమున 'జ' చేర్చి —

'సంగన బసవన అగ్రజ' అని చదివినారు. ఇందు వలన బసవనకొకఅన్న యున్నట్లు తేలినది. గ్రంథకర్త— 'అగ్రజ' శబ్దముగా భావించిన రెండవ పాదములో 'గ్రైకం' అను చోట

### బసవన జన్మకుండలి - జాతకము

| | | | |
|---|---|---|---|
| కే | | | |
| ల శ | రాశి | | |
| ర వ బు | | | |
| [illegible] శు | | గు | రా |

| | | | |
|---|---|---|---|
| | రాహు గు | | |
| | అంశ | | ర చ శు |
| | | | బు |
| | శ కే | ల | కు |

బసవన జన్మనక్షత్రము శ్రవణము. జ్యోతిషశాస్త్రవేత్తలు బసవని జాతక ప్రభావము చర్చింతురుగాక.

ఈ శీర్షిక గ్రంథమునకు నొక ముఖ్యమైన శీర్షిక. ఇందు బసవన జన్మమును గూర్చి కన్నడ గ్రంథముల యందు, తెలుగు గ్రంథముల యందుగల భిన్నాభిప్రాయములన్నియు చర్చింపబడినవి. తెలుగున పాల్కురికి సోమనాథుడు వ్రాసిన బసవ పురాణమున — బసవన "ఆర్ద్రోదయమున" జన్మించెనని చెప్పబడినది. గ్రంథ కర్త దీనినే బలపరచి, పై జన్మదినము 21–1–1140 — అని నిర్ణయించినాడు ఈ సందర్భమున నాతడు ప్రదర్శించిన జ్యోతిషశాస్త్రపరిజ్ఞానము బహుప్రశంసనీయమై యున్నది. ఆర్ద్రోదయమును గూర్చి వివరణ ఈ గ్రంథమున విపులముగాగలదు.

వ్రాస తప్పు ననియు కన్నడ పద్యమున వ్రాసని యతమనియు దెలిపి– 'అఘ్రి ×' అనునది 'అంఘ్రియ'గా చదివి– 'గ్రైకం' అను పాదమునకు ముందు, 'భృం' అను నక్షరము శిల్పి చెక్కమరచి నాడని తెలిపి– 'భృం' అను నక్షరము పూరించిరి. ఇందు వలన పద్యమిట్లు కుదిరినది.

'సంగన బసవన అంఘ్రియ
భృంగైకం దేవరాజ మునిపనతనయం.'

ఇందువలన–బసవనకు దేవరాజను అగ్రజుడూ లేడనియు– సంగన బసవన పాదపద్మ భృంగమైన–దేవరాజు అనునతడు ప్రత్యేక వ్యక్తియనియు నిర్ణీతమైనది. గ్రంథకర్త చేసిన యీ శాసనాక్షర వివరణను ఆర్కియాలజీశాఖయందలి శాసన పరిశోధకు లెక్కగినముగ నంగీకరించిరి. ఇది బసవన చరిత్రలో నూతన విషయము.

## బసవన భార్యలు

సోమనాధుడు బసవనికి "గంగాంబ" అను భార్య యొక్కతెయే యున్నట్లు తెలిపినాడు–కాని గ్రంథకర్త బసవని వచనములందొక చోట–

"ఎన్నసతి నీలలోచనె
పృథ్విగగళ్గియ చెలువె"

అనియుండుటచేత– బసవనికి నీలలోచన అను భార్యకూడ నున్నట్లు నిర్ణయించి యున్నాడు. పై పాదమును బట్టి ఆమెచాలా సౌందర్యవతి యని స్పష్టము. బసవనికిరువురి భార్యలుండుట–శైవ సంప్రదాయకమే. శివునికి గంగా గౌరి ఇరువురు భార్యలు.

బసవనికి 'నాగాంబ'అని ఒక అక్కగలదు– ఆమె కొమారుడే చెన్న బసవన్న. ఈతడును బసవని ననుసరించి వీరశైవమతవ్యాప్తి గావించినాడు. ఇతని పేరనొక పురాణమున్నది. దానిపేరు చెన్నబసవ పురాణము. ఈతడు గొప్పజ్ఞాని. కన్నడమున నీతనివచనములుగలవు.

## 5. బసవన ఉద్యోగము - ఉపనయనము -

ఈశీర్షికయందు బసవన ఉద్యోగము, ఉపనయనము అను రెండంశములుగలవు. ఈరెండింటియందు ఇదివఱకు చెప్పబడిన వానికంటె విశేషములు గలవు. కాన వానిని వివరించుచున్నాను.

### ఉపనయనము

సోమనాధుడు, బసవనకు– ఎనిమిదవయేటనే తండ్రి ఉపనయనము చేయుటకు ప్రయత్నించెననియు, బసవన తండ్రితో, తాను కర్మబంధములను త్రెంచుటకై జన్మించితిననియు, అందుచే ఉపనయనముచేయుట కంగీకరింపనని వాదించి వెళ్లిపోయెననియు తెలిపియున్నాడు. బసవ చరిత్రకారులందఱును నిదియే ప్రమాణముగా గ్రహించి, బసవనకు ఉపనయనము కాలేదనియే వ్రాసియున్నారు. ఈసందర్భమున– గ్రంథకర్త కన్నడ గ్రంథములను పరిశీలించి, అందు స్పష్టముగా బసవనకు ఉపనయనము జరిగినదని ప్రమాణములు చూపినాడు. అంతేకాక, బసవన తనకు 14వయేడు వచ్చువఱకును జంద్యమున ధరించి, ఆవెనుక దానిని త్రెంపివేసి కర్మ మార్గము ఖండించి, భక్తిప్రధానమైన వీరశైవ మతము ప్రారంభించెనను విషయము గ్రంథకర్త సోమనాధుని కన్న కొంచెము పూర్వుడగు హరిహరుడనుకవి రచిత గ్రంథమునుండి సోపపత్తికముగా నిరూపించియున్నాడు. ఇందుపై బసవని జన్మతిథి ననుసరించి, ఉపనయనము 27.9.1148 ని జరిగినట్లు నిర్ణయింపబడినది. ఉపనయనమైన తరువాత బసవన తనముత్తవ్వ సంరక్షణలో ఆరుసంవత్సరములుండెను. బసవనికి 14వ యేడువచ్చుసరికి, మతసంబంధమైన జ్ఞానోదయము గలిగి జంద్యమును త్రెంపివైచి, కపిలషష్టికి–కూడలి సంగమేశ్వరమునకువెడలి అచట పూజ గావించెను. ఈ తేది–31–8–1154. గాన అదియే బసవన జంద్యము త్రెంచివైచి వీరశైవము ప్రారంభించినది యని గ్రంథకర్త నిర్ణయించుట సహేతుకమై యున్నది–

### -ఉద్యోగము-మంత్రిపదవి-

బసవన – కల్యాణి నేలిన కలచురి రాజగు బిజ్జలుని యొద్ద మంత్రిత్వము వహించిన విషయము బసవ చరిత్ర కారులును, దేశ చరిత్రకారులును అందఱును నేకగ్రీవంగా నంగీకరించినదే. బసవనయే తన వచనములలో తాను బిజ్జలుని కొలువులో నున్నట్లు తెలుపుకొన్నాడు– కాని– అతని మంత్రిత్వ కాలమింతకు పూర్వముచక్కగా నిర్ణయము కాలేదు. గ్రంథకర్త యీ విషయమై కన్నడ గ్రంథములను బరిశీలించి, బసవన– బిజ్జలుని కడ తొలుత మంగళ వాడలో క్రీ.శ. 1157 లో తన పదునేడవ యేట ఉద్యోగియై యుండెననియు, ఆ వెనుక బిజ్జలుడు కల్యాణిని తన రాజధానిగా చేసికొనిన తర్వాత– క్రీ.శ. 1160లో బసవన అతనికి మంత్రియై క్రీ.శ. 1168లో పదవీ విరమణము చేసిననియు, మొత్తంపై నాతడు11 ఏండ్లు బిజ్జలుని కొలువులో నుండి నట్లును నిర్ణయించి యున్నాడు–

### -బసవన పదవీ నిర్వహణ-

బిజ్జలుడు బసవనను "సకల నియోగాధ్యక్షుని"గా చేసినట్లు సోమనాధుడు చెప్పినాడు. "సకల నియోగాధ్యక్షుడనగా" మంత్రి, న్యాయాధి పతి, దండనాథుడూ, భాండాగారాధిపతి బసవనయేయని మనము నిశ్చయింపవచ్చును. అనగా పై పదవుల నన్నింటిని బసవన యొక్కడే నిర్వహించెనని యర్థము. సోమనాధుడు బసవని గూర్చి సంబోధించునపుడు "మంత్రి", దండనాయకుడు", "భాండాగారాధి పతి–" అను విశేషణములనే వాడి యున్నాడు. పై వానిలో తక్కిన పదవుల కన్న బసవన భాండాగారాధి పతిత్వమే ఆతనికి హెచ్చుకీర్తి గడించినది. ప్రజా సామాన్యమున భాండాగారాధిపతి బసవన్న"బండారిబసవన్న"యైనాడు సోమనాధుడీ బండారి బసవశబ్దము పలుసారులువాడినాడు ఆతడు– బసవన నిర్వహించిన పదవులలో– భాండాగారాధిపతి పదవియే ప్రధానముగా భావించినాడు :

తన సంస్కృత బసవోదాహరణమున సోమనాధుడు పై విషయమునిట్లుగ్గడించినాడు.

ద్వితీయావిభక్తి–"భాండాగారధురీణ మత్ర బసవామాత్యం
కిమాచక్ష్మహే"

తృతీయావిభక్తి–"భాండాగార ధురంధరేణ, బసవామాత్యేన
కఃస్పర్ధతే–"

షష్ఠీవిభక్తి– "భాండాగార ధురంధర స్యబసవామాత్యస్య
దాస్యంభజే–"

సంబోధన– "భాండాగార దురంధరేశ, బసవామాత్యేశ
చూడామణీ–"

### మంత్రిపదవి బసవన ప్రత్యేకత

మంత్రి పదవిని నిర్వహించుటలో తక్కిన వారికన్న బసవన కొక ప్రత్యేకతయున్నది. అతడు బిజ్జలుని కొలువు చేరిన నాటికి నాతని వయస్సు17సంవత్సరములు మాత్రమే. ఇక అతడు మంత్రి పదవి వహించునాటికి అతనివయస్సు—20ఏండ్లు మాత్రమే. సాధారణముగా యిరువదవ యేటనే మంత్రి పదవిని వహించినవారిని మనము కానము. బసవన—తన 28వ యేటనే మంత్రిపదవినుండి విరమించినాడు. రాజకీయముగా నున్న యీ మంత్రిపదవి— అతని వీరశైవ మతవ్యాప్తికి చాలాగా తోడ్పడినది. కాబట్టియే బసవన వచనములలో నుట్టంకింపబడినది. దీనిననుసరించియే సోమనాథుడును మంత్రిపదవికి ప్రాధాన్యము నిచ్చియున్నాడు.

### 6 మహా ప్రస్థానము

ఈ శీర్షిక ఈ గ్రంథమునకు మకుటమని చెప్పవచ్చును. ఇది బసవన నిర్యాణమును గూర్చి చెప్పబడినదే తన, గ్రంథకర్త దీనికి మహాప్రస్థానమని పేరు పెట్టుట యెంతయు సమంజసము. మహాపురుషుల నిర్యాణము మహా ప్రస్థానము.

చారిత్రకదృష్టితో పరిశీలించిన పలుగల సహాయములు చాలా నూతనములు.

### బసవన నిర్యాణము 1167
### బిజ్జలుని హత్య - 1168

బసవనిగూర్చి నిన్నమొన్నటి వఱకు వ్రాసిన కన్నడాంధ్రాంగ్ల చరిత్రకారు లందఱు పై విషయములు రెండును సరియైనవనినమ్మి అతని గూర్చి వ్రాసిరి. కాని యెవ్వరును, ఆనాటి రాజకీయ పరిస్థితులనుగూర్చి పరిశ్రమ చేయలేదు. ప్రస్తుత గ్రంథకర్త ఆకాలము నాటి బిజ్జలుని శాసనములే గాక, అతని కాలమునవే కల్యాణి గద్దినెక్కిన రాయ మురారి సోవిదేవుని శాసనములను కూలంకషముగా పరిశీలించి పై యంశములు రెండింటిని—సంపూర్ణముగా ఖండించి — వారిరువురు — క్రీ. శ. 1167 తరువాత రమారమి ముప్పదేండ్లు అనగా క్రీ. శ. 1196 వఱకు జీవించి యుండిరని సోపపత్తికముగా శాసన ప్రమాణములతో ఋజువుచేసి యున్నాడు.

ఇంతవరకు చరిత్రకారులు బసవన నిర్యాణము క్రీ.శ.1167 అయిన తరువాతనే బిజ్జలుడు హత్య గావింపబడినాడని వ్రాసినారు. కాని ప్రస్తుత గ్రంథ పరిశోధన వలన — బిజ్జలుని హత్యముందే

జరిగినదనియు, ఆ వెనుకనే బసవన నిర్యాణము జరిగినదనియు, బసవన మంత్రి పదవి విరమణ అయిన తరువాత ఆతనికి బిజ్జలు నకు నెంతమాత్రము సంబంధములేదని నిశ్చితమగుచున్నది. ఆ వివ రములు — మొదటిది.

### బిజ్జలుని హత్య - క్రీ. శ. 1196

క్రీ. శ. 1168 లో బిజ్జలుడు హత్య కావింపబడలేదు. ఆతడు క్రీ. శ. 1196 వఱకు జీవించియేయుండెను. అందులకు శాసనాధారములు:

1) క్రీ. శ. 1168 లో బిజ్జలుడు వేయించిన శికారిపురి శాసనమున నాతడు తన కుమారుడైన రాయ మురారి సోవిదేవుని గద్దెనెక్కించి, తాను రాజపదవిని త్యజించి, రాజ్యతంత్రము నడుపు చుండెను.

(పుట. 161)

2) క్రీ. శ. 1172 వ సంవత్సరపు రాయ మురారి సోవి దేవునకు సంబంధించినదగు శాసనమునుబట్టి బిజ్జలు డప్పటికి జీవించి యుండెను.

(పుట. 174)

3) క్రీ. శ. 1183 వఱకు బిజ్జలుని కుమారులు కల్యాణిని పాలించిరి.

(పుట. 175)

4) క్రీ. శ. 1192 — హిప్పరిగె శాసనమున బిజ్జలుడు స్మరింపబడెను.

(పుట. 174)

పై శాసనములేగాక — రుద్రమునియను నతడు—బిజ్జలుని హత్య నలనామసంవత్సర వైశాఖ బహుళ విదియ మంగళవారమునాడు జరిగినట్లు వ్రాసియున్నాడు. అదినము క్రీ.శ. 16-4-1196కు సరిపోవుచున్నది. కాబట్టి అదియే బిజ్జలుని మరణదినము.

రెండవది బసవన నిర్యాణము.

### బసవన నిర్యాణము - క్రీ. శ. 1196

బసవని నిర్యాణము—క్రీ.శ.1167లో కానేలేదు. బసవనయే ముక్తి కంఠాభరణమను తన వచనమున తాను ముప్పది యారేండ్లు కల్యాణిలో నున్నట్లు చెప్పుకొన్నాడు.

"అయ్యా భక్తిగె బీడాదరు కల్యాణి
ముప్పత్తారు వరుష
అయ్యా శివ వదన వాదదు కల్యాణి
ఇప్పత్తేళు వరుష —
... ... కూడలి సంగమ దేవా"

పై వచనమున బసవన తాను కల్యాణిలో 36 వర్షములుంటి ననియు 27 వర్షముల క్రిందట శివసదనమును కట్టించితిననియు స్పష్టముగా తెలిపెను. ఇచ్చట బసవన కట్టించిన శివసదనమనగా

### "అనుభవ మంటపము"

బసవన దీనిని క్రీ. శ. 1169 లో నిర్మించెను. ఇదీ చరి త్రకు క్రొత్తది. ఈ అనుభవ మంటపముననే, అల్లమ ప్రభువు, చిన్న బసవన, మడికాలు మాధయ మున్నగు భక్తులు—అక్క మహా దేవి మొదలగు భక్తురాండ్రు తమ తమ యనుభవములను వెలువ రించిరి.

బసవన కల్యాణిలో 36 ఏండ్లున్నట్లు తెలిపినాడు. ఆతడు కల్యాణి ప్రవేశించి క్రీ. శ. 1160లో మంత్రి పదవి స్వీకరించెను. ఆ వెనుక 36 వర్షములు తాను కల్యాణిలో నుంటివనగా, ఆతడు క్రీ. శ. 1196 వఱకు నచ్చట నివసించెనని యర్థము.

అల్లమ ప్రభు వచనములలో నొకచోట బసవనను "రాక్షస సంవత్సర శ్రావణశుద్ధ పాడ్యమి మంగళవారమునాడు లింగైక్యము చెందుమని యాదేశించినట్లు కలదు. ఆ కాలము క్రీ. శ. 3-6-1196 కావున. ఆ దినమే బసవన నిర్యాణము లేక లింగై క్యము అని గ్రంథకర్త నిరూపించినాడు.

### బసవన నిర్యాణము - పండితారాధ్యుడు

ఆంధ్రదేశమున ఆరాధ్యమత సంప్రదాయ ప్రవర్తకుడైన మల్లికార్జున పండితారాధ్యుడు బసవన సమకాలికుడు. ఆతడు కల్యాణిలోనున్న బసవని చూచుటకు బయలుదేర దలచినాడు. కాని యాతడు బయలుదేరక మునుపే కల్యాణి నుండి భక్తులరుదెంచి బసవన ఎనిమిది దినముల క్రిందట నిర్యాణముచెందెనని తెలిపినారు. పండితుడును బసవని గూర్చి ఎంతో ప్రలాపించినాడు. ఈ విష యములన్నియు పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర మహిమ ప్రకరణమున వివరించి యున్నాడు.

పండితారాధ్యుడు క్రీ.శ. 1190 వఱకు జీవించియున్నాడు గావ, పై బసవని నిర్యాణకాలము సరియైనదే యని మనము నిశ్చయింపవచ్చును.

ఇట్లు ఎనుబదియేండ్లనుండి చారిత్రక సాహిత్య ప్రపంచ మున, పాతుకొనిపోయిన బసవన నిర్యాణ కాలము నేను గ్రంథకర్త నిర్నిద్ర పరిశోధన మూలమున ఖండితమై బసవని జీవిత కాల ముతో సునిశ్చితమై నిర్వివాదమైనది.

## బసవని జీవితము ప్రధాన ఘట్టములు

పై పరిశోధనా ఫలితముగ బసవని జీవితమున నీ క్రిందివి ప్రధాన ఘట్టములని నిర్ణయమైనది.

| | |
|---|---|
| జననము | 21-1-1140 |
| ఉపనయనము | 27-9-1148 |
| సంగమేశ్వర ప్రవేశము | 31-8-1154 |
| మంగళవాడలో నుద్యోగము | 1157 |
| కల్యాణిలో మంత్రి పదవి | 25-7-1160 |

| | |
|---|---|
| పదవీ విరమణ | 1168 |
| అనుభవ మంటప నిర్మాణము | 1169 |
| కల్యాణిని వదలినది— | 12-2-1196 |
| శివైక్యము | 3-7-1196 |

పై బసవన జీవితకాలము — 56 ఏండ్లు. ఈ రెండు అంకెలు 5+6 కలిపిన -11-సంఖ్య ఏర్పడును. 11 సంఖ్య ఏకాదశ రుద్రులను దెలుపును కావున బసవన ఏకాదశరుద్ర మూర్తియైన శివునిలో నైక్యమైనాడు.

## 7 భక్తియే మతము

ఇందు ఆగమముల ననుసరించి వీరశైవమత సిద్ధాంతము లన్నియు సాధికారముగా నిర్వచింపబడినవి. బసవన గూర్చి చారిత్రకముగనేకాక, బసవన ప్రతిపాదించిన వీరశైవమత తత్త్వసిద్ధాంతములను గూర్చి ప్రస్తుత గ్రంథకర్తకెంత ప్రగాఢ పరిజ్ఞానమున్నదో ఈ శీర్షిక సువ్యక్తము చేయుచున్నది. ఇంతవఱకు తెలుగున వీరశైవ మతతత్త్వమును గూర్చి తెలుపు గ్రంథములేదు. ఈ గ్రంథమువలన నా కొఱత చాలవఱకు తీరినది.

## 8. అనుభవ సాహిత్యము-ఆదర్శ జీవితము

ఇందు బసవని వచన సాహిత్య స్వరూపము ప్రతిపాదిత తత్త్వమే గాక జీవితమునకు సాహిత్యమునకుగల సన్నిహిత సంబంధము చక్కగా తెలుపబడినది. ఈ శీర్షికలో నొక విశేష మున్నది. కవిత్వము, ఆశ్రమ కవిత, ఆశ్రిత కవిత, అనుభవ కవిత—అని మూడు విధములుగా వర్గీకరింపబడినది. ఇది ఇంతవఱకు మనకు తెలియరాని నూతన వర్గీకరణము. బసవని అనుభవ కవితా స్వరూపమిందు సమీచీనముగా ప్రదర్శింపబడినది.

## 9. ఆంధ్రులు చిత్రించిన బసవన

పాల్కురికి సోమనాథుని బసవ పురాణాది కృతుల మూలమున బసవని ప్రభావముద్ర ఆంధ్రసాహిత్యముపై సుస్థిరముగా పడినది.

సోమనాథుని రచనలలో అనుభవసారము పండితారాధ్య చరిత్ర—(ఇది బసవనకే అంకితము) తప్ప తక్కినవన్నియు బసవ సంబంధ కృతులే. ఇందు సోమనాథుని బసవ పురాణము సమగ్ర సమీక్ష గలదు. సోమనాథుడేగాక బసవని గూర్చి యా వెనుక బసవని గూర్చి వ్రాసిన ఈ క్రింది కవుల యుదంతమిందు గలదు. వారు.

1: వీరసంగయ్య బసవ పురాణసారము.
2. వేలాల వీరభద్రకవి. బసవపురాణము
3. బచ్చు సిద్ధకవి—బసవ పురాణము
4 చెన్నాప్రగడ కవి — శైవసిద్ధాంత శిఖామణి.
5. నల్లనగండ్ల నాగనారాధ్యుడు—బసవ విజయము
6. తుమ్మలపల్లి నాగభూషణకవి—బసవ విజయము.

పై గ్రంథములన్నియు నముద్రితములే.

## పోతన-శ్రీనాథుడు

తెలుగు సాహిత్యమున—బసవేశ్వరుని స్తుతించిన శైవేతర కవులిద్దఱే—వారు. పోతన, శ్రీనాథులు.

పోతన వీరభద్ర విజయమున బసవని స్తుతించుటయేగాక ఆతని వచనములను గూడ ననుసరించినట్లుగా నిందు తెలుపబడుట క్రొత్త విషయము.

## శ్రీనాథుడు హరవిలాసమున (2-6)

గీ. "కలియుగంబున కల్యాణ కటక నగరి
నాడు భక్తుండు బసువరనాథుడొకడు"

అని శివునిచేత చెప్పించినాడు. తరువాతి తెలుగు కవులెవ్వరూ బసవని స్తుతింపలేదు.

## గ్రంథ విశిష్టత

బసవని గూర్చి, ఆతని కాలమును గూర్చి, ఆతని రచనలను గూర్చి — ఇంత సమగ్రము, సప్రామాణికము, సాధికారమునైన గ్రంథము తెలుగు వీరశైవ వాఙ్మయముననే గాక కన్నడ వీరశైవ వాఙ్మయమున కూడ వెలువడలేదు. ఇట్టి గ్రంథను తెలుగు భాషలోనే అవతరించుట విశేషము. దీనిని కన్నడ భాషలోనికేగాక—ఆంగ్ల భాషలోనికి అనువదింపజేసిన బసవనమూర్తి యావద్భారత వర్షమునకేగాక, ఖండాంతరములందును జ్యోతిర్మయముగా విరాజిల్లగలదు.

## అధోజ్ఞాపికలు

1 బసవ పురాణమును తిరిగి ఆంధ్రపత్రికాధిపతులు నేడు ప్రస్తుత వ్యాసకర్త పీఠికతో పునర్ముద్రణమ్ము గావించి యున్నారు. ఇది ప్రచారమున నున్నది.

2 తెలుగున వచన, గద్యలక్షణములకు చూడుడు. ఆంధ్ర వచన వాఙ్మయము ప్రస్తుత వ్యాసకర్త. దీనిని కాశీనాధుని నాగేశ్వరరావు, శివలెంక శంభుప్రసాదు ధర్మనిధి సంస్థవారు ముద్రించినారు.

3 పాల్కురికి సోమనాథుని బసవ పురాణము. చతుర్థాశ్వాసము మడివాలు మాచయ్య కథ.
"లాలితంబుగ నాల్గు లక్షలమీద
నోలి నిర్వదినాల్గువేల గీతములు"

4 పండితారాధ్య చరిత్ర—ఆంధ్రగ్రంథమాలా ముద్రణము.

**కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు**

శ్రీమతి ఆర్. వసుంధరాదేవి

# నాగరకతా-నిశ్చలతత్త్వమూ

మా యింటి చుట్టూ ప్రపంచం చకచకా పరుగెత్తుతూ వుంటుంది. బాల్కనీలో నుంచీనో, కిటికీలోనుంచీనో పైకి తొంగి చూస్తే తప్ప బెత్తెడంత ఆకాశంకూడా కనిపించదు మాకు. మా అయిదంతస్థుల భవంతిలో ఇరవై సంసారాలు కాపురముంటున్నారు. మాకు కుడిప్రక్కన రైల్వేలైన్లు, వెనుకగా రైల్వే ఓవర్ బ్రిడ్జి, ఎదురుగా రోడ్డుదాటగానే వర్క్‌షాపు, ఎడంప్రక్కన సరిగ్గా మా భవంతి లాంటిదే మరో భవంతివున్నది. అరగంటకోసారైనా ఒకరైలు పెద్దగా కూతలు పెట్టుకుంటూ రొదచేస్తూ పోతుంది. ఓవర్ బ్రిడ్జిమీద వివిధవాహనాలు రకరకాల హారన్ల శబ్దాలతో నిరంతరం పోతూనేవుంటాయి. వర్క్‌షాపు షిఫ్టుల్లో వుదయం ఆరునుంచీ రాత్రిపదివరకూ పనిచేస్తుంది.

తీరిక ఎరుగని యీ నాగరక ప్రపంచంలో రోజులు గడియారపు ముళ్ళలాగే, క్రమంతప్పకుండా, ఒకరోజుకీ మరోరోజుకీ మధ్యన ఏవిధమైన భేదంలేకుండా దొర్లిపోతూ వుంటాయి. దానిని 'యాంత్రిక జీవితం' అని ప్రత్యేకంగా నేను ఏమీ అనుకోలేదు. ఎందుకంటే యీ ప్రపంచంలో యంత్రం కానిది ఏమన్నా వుంటుందా!

ఒకసారి నాలుగురోజులు వరుసగా సెలవలు వచ్చాయి. ఊళ్ళు, పిక్నిక్‌లు అంటూ భవంతుల్లోని కుటుంబాలు చాలవరకు వెళ్ళిపోయారు. నా భర్త రమణ్ అజంతా గుహలుచూద్దామన్నాడు. నేను ఎందుకులే అనేశాను. ఎక్కడికో వెళ్ళామనీ, ఏదో చేశామనీ అనుకోవడం— ఏం ప్రయోజనం?— శుష్క ప్రయాస! అప్పటికే నాకు ప్రపంచమూ, మనిషి చెయ్యగల పనులూ అర్థశూన్యంగా, శవాల కదలికల్లాగా కన్పించడం ప్రారంభమైనది.

అప్పుడు అన్నిరోజుల్లాకాని ఒకరోజు వచ్చింది. వర్క్‌షాపు మూతవేశారు. ఓవర్ బ్రిడ్జిమీద కూడా ఎక్కువ రద్దీలేదు. రైళ్ల సంఖ్యకూడా తగ్గినట్లుంది. ఒకరైలురాకకీ, మరోరైలురాకకీ మధ్యనున్న నిశ్శబ్దం దీర్ఘమైంది. నిశ్శబ్దంలో వుండి వుండి పుట్టే ధ్వనులు...విచిత్రమైన, చావులాంటి నిశ్శబ్దం.

ఈ నిశ్శబ్దాన్ని నేను భరించలేకపోయాను. నా మనసు నిండా హోరు. ఏదో చెయ్యాలన్న తొందర, తొందర, తొందర. నేనేం చేస్తున్నానో నాకే తెలియకుండా అయిపోయింది. మా కారు ధావటంగాని, రమణ్ యింట్లోకి రావటంగాని నాకు తెలియలేదు. నేను గమనించేసరికి రమణ్ నా ఎదురుగా నిల్చుని, ఎన్ను విచిత్రంగా చూస్తూ వుండడం కన్పించింది. ''ఏమిటలా నిల్చున్నావ్ ? తొందరగా పరుగెత్తు' అన్నాను ప్రోత్సాహకరమైన చిరునవ్వుతో. ఆ మనిషిలో కదలిక అనేది వుంటేనా ! 'తొందరగా, తొందరగా' అని తొందరించాను. అప్పటికి కదిలాడు. ఎవరెవరో వచ్చారు. ఎక్కడికో పోయాము. తొందర తొందరగా వెళ్ళమని చెబుతూనేవున్నాను నేను...

వెనుకవన్నీ జ్ఞాపకంచేసుకుంటే యిప్పుడు నాకునవ్వొస్తుంది. నాప్రవర్తనలో పొరపాటు వుందనికాదు. కానేకాదు... ప్రపంచం ఎప్పుడూ పరుగెత్తుతూనే వుంటుంది. దానికడుపునిండా తొందరే. కాని ఆ నిజం నేను చెప్పిన వైనమే తమాషా...

రమణ్ నన్ను సైకియాట్రిస్ట్ దగ్గరకు తీసుకెళ్లాడు. ఆ డాక్టరు మాకు తెలిసిన వాడే. మంచివాడు. అతని మాటల్నిబట్టి నేను గ్రహించిందేమంటే—నాకున్నది వుత్తన్యూరోసిస్, కనుక కొంత సెడేషన్‌తోపాటు సైకో ఎనలిటిక్ ట్రీట్‌మెంట్ యివ్వాలనుకుంటున్నాడని, నేను యిదివరకే యీ సంబంధమైన పుస్తకాలు చదివాను. కాని యిప్పుడు నేను రోగిని. కాసేపు డాక్టరుతో చచ్చు కబుర్లు మాట్లాడి రావటమే నా పని. అతను చెప్పేమాటలు పెద్ద జబ్బుల్ని నయం చెయ్యగల గొప్పవిషయాలేమీకాదు కావాలనుకున్న పదార్థాలే తినాలట. 'వాటిని 'నేను ఫలానాది తింటున్నాను' అనుకుంటూ ఆనందంగా నమిలి నమిలి తినాలట. తింటున్నపుడు పుస్తకాలు చదవటం, పాటలు వినటం లాంటి పనులు చెయ్యగూడదట. స్నానం చేస్తున్నపుడు నీళ్లవేడికి ఒంట్లో నెత్తురు పరుగెత్తుతూ, హాయిగా ఒళ్లుతేలిక పడుతూంటే, నిదానంగా పోసుకోవాలట... అతనిమాటలకు అతనిఎదురుగా నేను నవ్వలేదు. అన్నీ మాటలు! వుత్తమాటలు! వూరికే అట్లామాట్లాడాలి !

ఇవాళ ప్రపంచం చురుగ్గా చాల గొడవ గొడవగా వుంది. రమణ్ ఎవరో స్నేహితులింటికి వెళ్ళాడు. రైళ్లు గబగబా పోతున్నాయి. ఓవర్ బ్రిడ్జి మామూలు రద్దీతో పగిలిపోతున్నది. వర్క్‌షాపు నిర్విరామంగా ధణధణలాడుతున్నది.

తొందర. తొందర. పరుగు. పరుగు...

ఆ తొందరా, పరుగూ నాగుండె మీదికి పాకాయి. బరువు ఆవేశం ఆయాసం. కళ్లుమూసుకుని సోఫాలోకూర్చుండిపోయాను.

నేను కళ్లు తెరిచేసరికి ఒక పారదర్శకమైన, లేత నీలపు గోళంలో వున్నాను. అది లేత మంచుతోనో, ఆకాశంతోనో చేసినట్లుంది. అక్కడ కాలం, చలనం, శబ్దం లేవు. సంపూర్ణమైన ప్రశాంతత, నిశ్చలత వున్నది ..ఇది నాచుట్టూ ఏర్పడిందా !

లేక నేను ఎలానో ఇందులోకి వచ్చిపడ్డానా? ఇందులోంచి బయటకి పోవటానికి మార్గం వున్నదా?

దేనికీ సమాధానం దొరకలేదు.

సరే, ఎలాగూ ఇందులో కొచ్చాను. ఈ లోకంసంగతి చూద్దామని అనుకున్నాను. చాలదగ్గరగా నన్ను చుట్టినట్టున్న ఆ గోళాన్ని తాకిచూద్దామని చెయ్యిచాచాను. అందలేదు. ఒంగినా అందలేదు. ఇలా ప్రయోజనం లేదని లేచాను, దాని దగ్గరకు వెళ్దామని. నేను ఎంత దూరం నడిచినా అది అందకుండానేవుంది! చుట్టూ నడిచి, నడిచి యిహ లాభంలేదని కూర్చున్నాను.

నేను, నా చుట్టూ నాగోళం.

విచిత్రమేమంటే, నాకేమీ భయం వెయ్యటంలేదు. ఇదంతా నా సొంతమైనట్టూ,ఇక్కడ నేను సర్వ స్వతంత్రురాలినైనట్టూ అనిపిస్తున్నది.

నిదానించి గమనించగా యీ నిశ్శబ్దంలోనికీ ఎక్కడో దూరాన్నుండి శబ్దాలు—రైళ్ళు, బస్సులు, మోటార్లు,వర్క్‌షాపులు లీలగా వినిపిస్తూనే వున్నవి. అయితే అవి మామూలుగా వినిపించే శబ్దాలుకావు. ఈ నిశ్శబ్దరంగంలోకి వస్తున్న, స్ఫుటమైన, దేనికదే ప్రత్యేకమైన శబ్దాలు. అవి వాటిపాటి కవి వస్తున్నవి, పోతున్నవి. వాటినెవరూ పట్టుకోవటంలేదు.

ఇక్కడ మరోవిచిత్రం యీ వెలుగు. దేనినైనా చూడాలనుకున్నప్పుడు అది కాంతివంతమైన అన్నిటినీ చూపెడుతున్నది. అవసరం లేనప్పుడు దానంతటికదే తగ్గిపోయి లేవెలుగుగా మారిపోతున్నది.

ఈ లోకం నాకు అర్థంకాలేదు. నేను నాగరకప్రపంచపు తెలివి నుంచీ యీనిశ్చల ప్రపంచపు స్తబ్ధతలోకి వచ్చానా? లేక.. 'నేను' నేను కాదా ?

అసలు 'నేను' అంటే ఏమిటి?

కొంచెంసేపు ఆలోచించి ప్రయోజనం లేదని ఒదిలేశాను.

ఏది ఏమైతే ఏమిటి? నాకిక్కడ హాయిగా, సుఖంగా వున్నది !

అలానే కూర్చుండి పోయాను.

రమణ్ వచ్చాడు. నేను నా ప్రపంచంలో చాల దూరాన, చాల లోపలగా వున్నాను. అయినా కన్పించాడు. 'ఏమిటలా కూర్చుండి పోయావ్. వంట చెయ్యలేదా?' అన్నాడు. ఆ మాటలు స్పష్టంగా వినపడ్డై నాకు.

నేను చాల దూరానవున్నట్టు అతనికి తెలిసినట్టు లేదే ! నాకు కన్పిస్తున్నది అతనికేమీ కన్పించటం లేదా?

రమణ్ రాకతో నా ప్రశాంతత కరిగిపోతున్నది. నాగోళం మరింత పారదర్శకమై సమసిపోతున్నది.

'నేను యిక్కణ్ణుంచీ బయటకు రాలేను' అన్నాను.

'రాలేక పోవటం ఏమిటి?... సరే, యివాళ్టికి హోటల్లో భోంచేద్దాం, రా' అన్నాడు.

అతనలా అనగానే బయటకు వెళ్ళగలనని నాకూ తెలిసిపోయింది. కళ్ళు తెరిచి బయట కొచ్చేశాను.

కాని నాకు జరిగిన అద్భుతం గురించి రమణ్‌తో చెప్పలేకపోయాను. ఇది నిద్రలాగా నాకే ప్రత్యేకమైనది. నాది మరొకరితో పంచుకునేది కాదు. ఇంకొకరికి చెప్పే విషయమూ కాదేమో!

నాకిప్పుడు రెండు లోకాలున్నై. రెండూ పూర్తిగా భిన్నమైనవి. నేను ఒక లోకం నుంచీ మరో లోకంలోకి వెళ్తూవున్నాను. నిజానికి 'వెళ్లటం' అనేది అర్థంలేని మాట. నేను చాలా దూరంగా వుండీ దగ్గరగా వుంటాను. దగ్గర వుండీ దూరంలో వుంటున్నాను. నేను యీ లోకంలో వున్నా, ఆలోకపు ప్రశాంతి, ఛాయ నాలో వుంటూనే వున్నది. 'తొందర' అనేది ఎక్కడో జారిపోయింది. ఎంతగా జారిపోయిందంటే, నాకసలు ఏపనీ చెయ్యాలనివుండదు. పని చెయ్యడం శ్రమ. దండగశ్రమ. దేనికీ విలువ,ప్రయోజనం లేవు!నేను క్రమంగా ఒక నిరంతర నిశ్శబ్దంలోనికి మునిగిపోతున్నాను. కాదు. శబ్దంలో నుంచీ పైకి తేలుతున్నానేమో! ఏదైతే ఏమిటి? ఇక్కడ నేను స్వతంత్రురాలిని. బరువు, బాధ్యతలు లేని స్వేచ్ఛా జీవిని!

'ఇదివరకటి చురుకూ, చాక చక్యమూ లేవు. మనిషిచాలా చప్పబడిపోయింది, పాపం'! రమణ్ చెల్లెలు చిత్ర అంటున్నది.

చిత్ర నాకంటే కొంచెం పెద్దది. నేను బొంబే వచ్చినప్పటి నుండి మేమిద్దరం కలసి మెలసి వుంటున్నాం. ఆమె భర్త ఒక కంపెనీలో మేనేజరు. మాకు ఎడంప్రక్క భవంతిలోనే ఒక భాగంలో వాళ్ళుంటున్నారు. మేమిద్దరం చాల పనులు కలిసి చేశాము. మా మధ్యన ఎప్పుడూ పోటీనే.

చిత్ర కూతుళ్లిద్దరూ మంచి కాన్వెంటులో చదువుతున్నారు. సంగీతం, డాన్సు, యీత నేర్చుకున్నారు. పెద్దమ్మాయి ఇంగ్లీషు నాటకాల్లోనూ, రెండో అమ్మాయి చిత్రలేఖనంలోనూ ప్రత్యేకత చూపిస్తున్నారు. ఇక్కడి మిగతా కుటుంబాల పిల్లల్లాగా వాళ్ళూ ప్రతిభావంతులుగానే వున్నారు.

చిత్ర కూడా క్షణం వూరుకునే మనిషికాదు. ఫ్యాబ్రిక్ పెయింటింగ్, బేకరీ, ఫ్లవర్ — ఎరేంజ్‌మెంట్, స్వీట్స్ అండ్ డెస్సర్ట్స్, ఎంబ్రాయిడరీ కోర్సులు చేసింది. ఇంటీరియర్ డెకరేషన్ డిప్లొమాకు చదువుతున్నది. నేనూ చిత్రతోపాటే అన్ని కోర్సులూ చేశాను. అన్నింట్లోనూ తనకంటే ఎక్కువ సామర్థ్యం చూపించాను. ఇంటీరియర్ డెకరేషన్‌కు పోకుండా యిలా నిలిచిపోయాను.

చిత్ర నన్ను గురించి జాలిపడటం నాకు అసలు నచ్చలేదు. గబుక్కున కోపం వచ్చింది. ఆవిడ గొప్పదనం ఏమిటి? నా సంగతి

వాళ్లకేం తెలుసు? ఒక మహత్తర లోకంలోకి నాకు ప్రవేశంవుందని వాళ్లకు తెలియదు. వాళ్ల జీవితం ఎంత నిస్సారమైందో వాళ్లు గ్రహించలేరు!

ఏదో బరువు నాలో పుట్టి ఆత్రంగా, గజిబిజిగా అల్లుకు పోతున్నది...ఆవేశం, ఆయాసం పైకి వస్తున్నవి కళ్ల మూతలు పడిపోయినై. ఏదో సుఖంలోకి జారిపోయాను...తేవెలుగు చిక్కనై సాంద్రమైంది. ఒక నిశ్శబ్ద నిశ్చల మహాసముద్రం కనిపించింది... శబ్దం, చలనం అందులోని తరంగాలు...ఈ సముద్రంలో సుఖం... సుఖం...ఎంత హాయిగా వుంది!...

డాక్టరుగారు ఏం చెప్పారంటే, మనస్సు స్వరూపం పరిసరాలమీద ఆధారపడి వుంటుందట. ఒక చిత్రం చూపించారు. నల్లని బాక్‌గ్రౌండ్ నడుమ తెల్లని చిత్రం. నలుపు బాక్‌గ్రౌండ్ అనుకుంటే తెల్లని చిత్రం ఒక ఆకారంలో వున్నది. నలుపే ఆకారమనుకుంటే చిత్రం మరో అర్థంలో కనిపిస్తున్నది.

'మీరు చెప్పేది గెస్టాల్ట్ సైకాలజీ. ఇటువంటి బొమ్మలు వారపత్రికల్లో కూడ వస్తుంటాయి. మేము చిన్నప్పుడు యిట్లాంటివి వేసేవాళ్లం' అన్నాను విసుగ్గా.

అతను చెప్పేవన్నీ నాకు తెలుసు! అవన్నీ ఇదివరలో నేను చదివినవే. నాకు పరిష్కారంకాని విచిత్రమైన సమస్య ఒక్కటే వున్నది—గోళం లోపలుండే నేను నిజమా? లేక బయటుండే నేను నిజమా?

★ ★ ★

రమణ్‌రావు భార్య అమల బాగా చదువుకున్నది. నిశితమైన ఆలోచనా పటిమ గలది. ఆమెకు చాల విషయాలు తెలుసు. అందువలన ఆమె ఆత్మకథ యింతవరకూ చెప్తూవచ్చిన విధంగా సాగి వుండవచ్చునేమో, ఆమెకు ప్రమాదం జరిగి వుండకపోతే.

## 2

కాని అలా జరగలేదు.

అమల చాలా నిదానస్తురాలు. ఆమె చిన్నపిల్లగా వున్నప్పుడు 'ఎందుకంత మందగొడిగా వుంటావు? ఎవరైనా నిన్ను మందమతి అనుకుంటారు' అని చాలసార్లు విసుక్కునేది వాళ్లమ్మగారు. అమల తనంత తానుగా ఏ పనీ చేసేదికాదు. స్తబ్దంగా వుండిపోయేది. కాని ఏ పనినైనా ప్రారంభిస్తే దానిలో మంచి బుద్ధి నైశిత్యం కనిపించేది. ప్రతివిషయంలోనూ తనకు తోచినట్లు చేసేదే గాని ఎవరు ఎంతగా చెప్పినా మరోవిధంగా చెయ్యని మూర్ఖపు పట్టుదల వుండేది. క్రొత్తగా పెళ్లయి బొంబాయి వచ్చినప్పుడు అక్కడి జీవితపు వేగాన్ని చూచి 'లక్ష్యంలేని పరుగు' అనుకున్నది.

అమలకంటే చాల ముందుగా బొంబాయి వచ్చి, నాగరక ప్రపంచంతో పరుగెడుతున్న చిత్ర అమలను తనతో రమ్మని పిలిచినప్పుడు వెళ్లలేదు. చిత్రా, నాగరకతా కూడా అమలను ఒదిలేశారు. ఆమె ఒంటరిగా మిగిలిపోయింది.

క్రమంగా ఆనందపూర్ణమైన ఒక అమనస్క స్థితిలోకి జారిపోయింది అమల...

ఇలా కూడా జరిగివుండొచ్చు అమలకు, ఇతరులను లెక్క చెయ్యని గుణం వుండివుంటే ...

## 3

కాని నిజంగా జరిగింది యీ క్రింది విధంగా వుంది —

అమల స్వభావత, నిదానస్తురాలు. మొదట్లో బొంబాయి నగర జీవితపు వేగానికి తట్టుకోలేక బాధపడింది.

చూడటానికి, తెలుసుకోవడానికి, నేర్చుకోవడానికి ప్రపంచం నిండా విషయాలు.చీరలో,కట్టులో, బొట్టులో, తీరులో, మాటలో ఎప్పటికప్పుడు మార్పులు. మేధస్సుకు పదునుబెడుతూవుండటం, క్రొత్త ప్రయోజనాలను సాధిస్తూవుండటం యీ కాలపు విలువలు. అలా చెయ్యనివారు జీవంలేని మొద్దులు.

భర్త ప్రోత్సాహంతో, చిత్ర సాహచర్యంలో తొందరలోనే ఆ జీవితానికి మానసికంగా అలవాటుపడిపోయింది. ఆమెలో ఒక చిన్న భేదం మాత్రం ఏర్పడింది. ఎప్పుడైనా ఒకసారి పని మధ్యలో ఆపి శూన్యంలోకి చూస్తున్నట్లు నిలిచేది. మరుక్షణంలోనే తిరిగి మామూలు స్థితికి వచ్చేది. మిగతాగా చాల చురుగ్గా వుండేది. చిత్రతో పోటీగా, చిత్రకంటే మిన్నగా చాల కోర్సులు చేసింది.

ఇంటీరియర్ డెకరేషన్ కోర్సులో చేరేరోజు వచ్చింది. చిత్ర వచ్చింది. అమల కాఫీపెట్టి యిస్తానని స్టౌ దగ్గరకు వెళ్లింది. 'త్వరగా బయల్దేరాలి, అమల్' అంటూ అక్కడే కుర్చీలో కూర్చున్నది చిత్ర.

అమల అగ్గిపుల్ల గీచింది. కాని స్టౌ ముట్టించలేదు. మండుతున్న పుల్లను అలాగే పట్టుకుని చెయ్యిదించింది. నైలాన్ చీర ముట్టుకుని నిముషంలో మంటలు అలుముకుపోయాయి. చిత్ర నిస్సహాయంగా కేకలు వేస్తుండగానే అమల భగ్గున మండిపోయింది

ఆమె కావాలనే ఆత్మహత్య చేసుకుందా? లేక పొరపాటు జరిగిందా? అన్న విషయం తేలలేదు.

అమల చురుకైనదీ, సున్నితమైన మనస్సుగలదీ, దయనీయురాలూ అయిన నాగరక యువతి.

# కృషితో నాస్తి దుర్భిక్షమ్

కర్షకుడు కాయకష్టం చేసినప్పుడే మన రాష్ట్రం సిరి సంపదలతో తులతూగుతుంది. అందుకే మన పంచవర్ష ప్రణాళికలు యిన్నాళ్లనుంచి అధికాహారోత్పత్తికి అత్యధిక ప్రాధాన్యం యిచ్చాయి. ఆంధ్రప్రదేశ్ గత సంవత్సరం **94.32** లక్షల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తిచేసి సరికొత్త చరిత్రకి శ్రీకారం చుట్టింది.

కరువు బాధిత ప్రాంతాలలో కొరత పరిస్థితులు కొన సాగకుండా నివారించడానికి అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు, మహబూబునగర్, నల్లగొండ, ప్రకాశం జిల్లాల్లో క్షామ నివారణ పథకాలు అమలు జరుపుతున్నారు.

సన్నకారు రైతునూ చిన్నచూపు చూడడంలేదు. సన్నకారు రైతుల అభివృద్ధిసంస్థ, లాభసాటికాని రైతులు, వ్యవసాయ కార్మికుల అభివృద్ధిసంస్థ **878.86** లక్షల రూపాయలు ఖర్చుపెట్టాయి. అంతేకాదు, **23.92** కోట్ల రూపాయల మేరకు సంస్థలద్వారా ఆర్థిక సహాయం లభింప జేశాయి. **6** లక్షల **97** వేల మంది సన్నకారు రైతులు, లాభ సాటిగాని రైతులు, వ్యవసాయి కార్మికులు గుర్తించబడ్డారు.

*డైరెక్టర్, సమాచార పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*

23/77–78



శ్రీ జి. రామశేషయ్య

# కనుబొమ్మల్లో...భాషాశాస్త్రం- "బొమముడి"

జూలై 1977 'భారతి' లో శ్రీ కుంటముక్కల లక్ష్మీనారాయణ శర్మగారు భాషాపరమైన విశ్లేషణ (శైలీశాస్త్రపు పూర్వస్థితి) దృష్ట్యా కీ॥శే॥ శ్రీనండూరి వేంకటసుబ్బారావుగారి యెంకిపాటల్లో ఒకటైన ''కనుబొమ్మ''ను పరిశీలించిన వ్యాసం ప్రచురితమైనది.

''ఈ విశ్లేషణలు సాహిత్యాన్ని అర్థం చేసుకోవడానికి ఎంత వరకు తోడ్పడుతాయన్నది సందేహాస్పదమే' అన్న శ్రీ శర్మగారి అభిప్రాయం కలిగించిన అభిప్రాయాన్ని నాకు తోచిన క్రమంగా ఈ దిగువ పొందు పరుస్తున్నాను.

ఇది పల్లవి ఇవి, చరణములు అనే దృష్టితో కవి ఈ పాటను రచించలేదని తోచుచున్నది. వరుసగా ప్రతి మూడు పాదాలు ఒక ఖండంగా పాటమొత్తం నాలుగు ఖండాల సమైక్యరూపంగా రచితమైనది. ('కనుబొమ్మ సూడాలి' అనేపాదం బహుధా ప్రయుక్తమైనను గాన కాలమున స్వతంత్రముగా పునరుక్తమగుటకు సహించదు. తన తరువాతి—కరిగిపోవాలి,కరువుదీరాలి, కమ్మగుండాలి, కతలు తెలియాలి—అనే విభిన్నవాక్యాలతో సంబంధమున్న పాదమిది. కనుక ఈ పాదము పల్లవి సంబంధి లక్షణ పూర్ణమైన దనుట పొసగదు)

నన్ను తలుసుకు యెంకి కన్నుమూయాలి (నిద్రపోవాలి) అని కవి (నాయుడు) మొట్ట మొదట ఊహించినాడు. తానుఊహించిన స్థితిలో యెంకి ఉండగా ఆమె 'కనుబొమ్మ' ను చూసి కరిగిపోవాలని ఆతని ఆశయము.(తాను కరిగిపోయేటంత ఆకర్షణీయంగా ఆమె కనుబొమ్మ ఉంటుందని భావము) ఆ తరువాత 4,7,10 పాదాల్లో తాను ఊహించిన మూర్తి విశేషక్రమ పరిణామ దశలను అదే 'కనుబొమ్మ' ఏ విధంగా ప్రదర్శిస్తుందో భావించాడు. ఆ భావనా ఫలితాలను — కరువు దీరాలి, కమ్మగుండాలి, కతలు తెలియాలిగా క్రమంగా నిరూపించుకొన్నాడు. ఈ విధమైన పరిశీలనము వలన ఈ పాట యొక్క నిర్మాణ మార్మికత సుస్పష్టం అవుతూనేఉంది.

ఈ పాట మాత్రాచ్ఛందస్సులో వ్రాయబడింది.

1, 4, 7, 10 పాదాల్లో 18 మాత్రలు
2, 5, 8, 11 పాదాల్లో 10 మాత్రలు
3, 6, 9, 12 పాదాల్లో 8 మాత్రలు

ఈ విధంగా ఒక్కొక్క ఖండంలోని వరుసపాదాల యందలి మాత్రల సంఖ్య క్రమంగా మరొక ఖండంలోని వరుస పాదాల యందలి మాత్రల సంఖ్యకు సమానమై ఉండడం గమనింప దగిన విశేషం. అంతే కాక—

1, 4, 7, 10 పాదాలు (10+8) మాత్రల చొ॥న రెండు భాగాలుగా
2, 5, 8, 11 పాదాలు (5+5) మాత్రలు చొ॥న రెండు భాగాలుగా
3, 6, 9, 12 పాదాలు (3+5) మాత్రల చొ॥న రెండు భాగాలుగా

విడిపోవడం ముఖ్యంగా దృష్టియందుంచు కొనదగిన మరో సువిశేషం.

''ఏవంవిధ మాత్రాచ్ఛందస్సంబంధి సౌందర్య ఫలితము కూడా 'యెంకి' సర్వకాల సర్వావస్థలయందు 'సజీవ'గానే కాక 'సుజీవ'గా చిరంజీవి యగుటకు దోహదకారి'' అని చెప్పనగును.

ఇక— 'కను బొమ్మ సూడాలి' అనే పాదం 'క' వర్ణంతో ప్రారంభం. దీని వెంట నంటి వచ్చే పాదాలు ఆయాఖండాల్లోని ప్రథమ పాద సంబంధి ఊహాపరమైన దర్శనీయ పరిణత స్వరూప భావనాను గుణమైన అనుభగాతి విశేషవ్యంజకములైన——'కరిగిపోవాలి' ఇత్యాది పాదాలు కూడా 'క' వర్ణంతో ప్రారంభమై పాద ప్రారంభ వర్ణ పునరుక్తిని సంపాదించినవి. నిజమే — ఇది తెలుగు కవితకు సహజమైన యతి (వడి) వంటిదే.

1,4 పాదాలు 'న' వర్ణంతో ప్రారంభం. అనగా హల్వర్ణ సంపూర్ణ పునరుక్తి అజ్వర్ణ సంపూర్ణ పునరుక్తి పాటింప బడిం దని శ్రీ శర్మగారు తెలిపిరి. 7, 10 పాదాల్లో హల్వర్ణ అసంపూర్ణ పునరుక్తి ఇమిడి ఉందన్నారు. 'న్, ప్' అనునవి ఈ పాదాల ప్రారంభ హల్వర్ణములు. ఇవి విభిన్న హల్ వర్ణములు. వీటికి సంబంధించి అసంపూర్ణ పునరుక్తి ఏమిటి? ఒకే హల్లు ఆ వృత్తి పొందిన కదా 'పునరుక్తి' యనుట పొసగును! ? అంతేకాక 7,10 పాదాల ప్రారంభ శబ్దాలు ''నిదుర—పిలుపు'' అనునవి. ''ని'' వర్ణమునందలి 'ఇ' అను అచ్చునకు, ''పి'' వర్ణమునందలి 'ఇ' అను అచ్చునకు బాంధవ్యము నంట గట్టి ఇది అజ్వర్ణ సంపూర్ణ

పునరుక్తి యనుట భాషా శాస్త్ర దృష్టికి సమంజసమేమో కాని సహృదయ పాఠకులకిది ఇంపు కలిగించు పరిశీలనము కాదు. ఈ అచ్చు (ఇ) యొక్క పునరుక్తి సుదూరప్రవర్తితం. దీని వలని ప్రయోజనం వృగ్యం కాదు — శూన్యం.

ముఖ్యంగా 1,4,7,10 పాదాల్లోని నాద సౌభాగ్యంపాద ప్రారంభవర్ణ పునరుక్తివలన సిద్ధించినదికాదు. పాదములందే ఒదిగి ఉన్నది. (ఈ నాలుగు పాదాలను రెండుజంటలుగా పరిశీలించుట అసమంజసము)

'నన్నుతలుసుకు యెంకి। కన్నుమూయాలి, ఈపాదము ఇది వరకే తెలిపినట్లు (10+8) గా విడి పోవుచున్నది. ఇట్లు విడి పోయిన రెండు భాగముల యొక్క ప్రారంభశబ్దములు 'నన్ను—కన్ను' ఈశబ్దముల ప్రారంభవర్ణములు హ్రస్వములగుటయేగాక ద్వితీయ వర్ణమైన (న్ను)సంపూర్ణఅజ్వర్ణపునరుక్తితోపాటు ద్విరుక్త సంపూర్ణ హల్వర్ణపునరుక్తిని పొంది రెండు శబ్దములకు సంబంధించిన ఉచ్చారణ సమత్వమును సంపాదించి పాదమునకంతటికి ఒకతూగును సంతరించి గానానుకూల్యతను పెంచినది. ఇది 'ప్రాసయతి' గా తెలుగు కవితకు సహజమైనలక్షణమే. ఇట్లే 7వ పాదమునందలి 'నిదురసదురు.' 10వపాదము— పిలుపేదొ యినగానె। తెలివిరావాలి ఇక్కడ 'పిలుపేదొ' అనునప్పుడు''పే'' యందలి దీర్ఘత దాదాపు ప్లుతస్థాయిని అందుకొనుచు (పిలుపు+ఏదొ) ''పిలుపు'' అను పూర్వభాగమునకు స్ఫుటత్వము నిచ్చి, ''తెలివి''తో సంవదించు చున్నది. ఇక4వపాదము—'నన్నుకలలో గాసి। నవ్వుకోవాలి' 'నన్ను—నవ్వు'— ఇక్కడ ప్రత్యేకముగా శబ్దద్వితీయ వర్ణములందలిహల్లులు భేదించినను వాని వాని ద్విత్వములు అజ్వర్ణ పునరుక్తితో ప్రయుక్తములై ఉచ్చారణ కాల సమత్వమువలన సౌందర్య పోషకములగు చున్నవని చెప్పవచ్చును. కాని ఇక్కడ 'న' వర్ణ పునరుక్తి ప్రధానము.ఇది తెలుగున యతి (వడి)గా ప్రచలితమే.

ఇక పాదాంత ''లి'' వర్ణంలో హల్వర్ణ సంపూర్ణ పునరుక్తి అజ్వర్ణ సంపూర్ణ పునరుక్తి గమనించ వచ్చునని శ్రీ శర్మగారు తెలిపిరి. ఈ ''లి'' వర్ణము ప్రతి పాదాంతమందును దర్శన మిచ్చు చున్నది. ఇది తెలుగు గేయ కవిత (పాటలు)కు ప్రధాన ప్రముఖ లక్షణమైన అంత్య ప్రాసమే కదా! దీని కోసం సంపూర్ణ అజ్వర్ణ హల్వర్ణ పునరుక్తి అనే భాషా శాస్త్రం వివేచనం ఎందుకు ? 'లి' వర్ణానికి ముందున్న వర్ణాలు దీర్ఘాచ్చరకాలై (ఆ) ఉచ్చారణ సమత్వం కలిగిశ్రుతి సుభగమైన లక్షణాన్ని మరింత దీప్తం చేస్తున్నవి మొత్తం మీద ''వర్ణ నిర్మాణ దశ — పొందిక — వర్ణ పునరుక్తి సూచిక'' అంటూ భాషా శాస్త్ర దృష్ట్యా శ్రీ శర్మగారు చేసిన పరిశీలనం తెలుగు కవితకు ప్రసిద్ధమై సహజ సౌందర్య పోషకములైన యతి (వడి), ప్రాసయతి, అంత్యప్రాసలను గుంట

చిక్కుల్లో పడేసింది. అంతేగాని పాట యొక్క నిర్మాణమునకు సంబంధించినంత వరకు సహృదయ రంజకంగా ఏ కొత్త విషయాన్ని చెప్పింది ?

ఇక ధ్వనిమార్పుభాగం—కధ — కత, శిఖ — శిగ — సిగ కరవు — కరువు, నిదుర —నిదర— ఇత్యాదుల్లో మహా ప్రాణత్వ లక్షణం|సజాతి అల్పప్రాణత్వంగా మారిందనీ అభిహితతాలు వర్త్స్య ఊష్మం వ్యవహారంలో అనభిహితదంత్యోష్మంగా మారిందనీ ఈభాషా శాస్త్ర దృష్టి పాటను బోధపరచుకోవడానికి ప్రత్యేకంగా తేల్చి చెప్పిందేమిటి ? ప్రకృతులకు బదులు వికృతులు వాడబడ్డాయనీ, ప్రామాణిక (గ్రాంధిక) శబ్దరూపాలు వ్యవహారంలోని ఉచ్చారణకు తగినట్లు|పొదుగ బడ్డాయనేగా. కాపువారి యాసభాషలో ప్రాశానని కవి నండూరి చెప్పుకొన్నాడు కదా! పాటకు తగిన తూగు కోసం, తాము భావించిన రూపం ప్రసాదించిన సౌందర్యానుభూతిని పాటలో ప్రదర్శించు కోవడం కోసం వ్యవహార భాషలోని పదాల్నే వాడినాడు కాని ''కధ''కు బదులు''కత'' వాడుకోవాలనీ, ''శిఖ'' కు మారుగా (శిగ) సిగ వేయాలని కానీ ముమ్మాటికి కవి ఉద్దేశ్యం అయి ఉండదు. (ఒక్కొక్కసారి గణభంగం జరగకుండా ఉండేందుకు పద్య కవులు ప్రకృతి బదులు వికృతిని వాడుకుంటారు. అంతే) పాటను దానిలోని మాధుర్యాన్ని బోధపరచుకోవడానికి శ్రీ శర్మగారు చూపిన శబ్దస్వరూప పరిణామ విశేషనిష్పన్నతాదృష్టి ఎంతవర కవసరమో బోధపడదు.

వాక్యనిర్మాణ దశలో పాటలోని ఒక్కొక్క వాక్యం శతర్ధకమనీ, క్త్వార్ధకమనీ ఇత్యాదిగా వింగడించి చెప్పారు. ఈ వింగడింపు పాటలోని భావసమైక్యతను అర్ధంచేసుకోవడానికి ఎంత వరకు సహకరిస్తుంది ?? ప్రతి వాక్యం వ్యాకరణ దృష్ట్యా(కాకుంటే శైలీ శాస్త్రం) క్త్వార్థమో, హేత్వర్ధమో, అనుభవార్థకమో మరేదో కాక తప్పదు కదా !

ఇక అర్థ సంబంధి దశ — శ్రీ శర్మగారి వ్యాసంలో కనుబొమ్మను అర్థం చేసుకోవడానికి సహకరించే భాగమిది అయితే ఈ భాగం కవిత్వ పంక్తుల్లో ప్రముక్తమయ్యే శబ్దం సామాన్యార్థాన్ని కాక మార్పు చెంది బోధించే అర్ధం గూర్చి చెప్పింది. (కనుబొమ్మ పాటలో ప్రయోగిత పదం పరిణతార్ధ ప్రదర్శకమైన తీరును శ్రీ శర్మగారు సూచించారు. వారిచ్చిన రూఢ్యర్ధాలు ఫరవాలేదు —కాని నూపుతో మాటాడే యెంకి ''కతలు'' ''మాటల్లో'' ఒదగనివే. ఊపిరితో తెనిగించే కవి నండూరి మరి. ఇలాంటి కవుల కవితల ముగింపుల్లోని ప్రతిభ అపారం. ఏ ఖండ కావ్య ఖండికకైనా మనుగడను సంతరించేది ముగింపే. ''సంవిధాన శిల్పం మహాకావ్యాన్నెట్లు ప్రకాశమానం చేస్తుందో ముగింపులోని 'భావశబలత' ఖండకవితనట్లు వెలిగిస్తుంది,'' అని నా అభిప్రాయం. నేను చెప్పుకున్న 'భావశబలత' కనుబొమ్మ కవితలో 'కతలు' అనే పదంతో ప్రతీయమానంఅవుతున్నది ఈపదానికిఅర్థంచెప్పడానికివాయిచాలదు వాక్కు చాలదు. సహృదయుడైన పఠిత హృదయం ఏ అర్థాన్ని బోధపరచు కొని రసానందాన్ని పొందుతుందో అదే ఆ అర్థం అని చెప్పాలి. అంతే.) కవిత్వ పంక్తుల్లోని శబ్దం విశేషార్థ సమర్పక మనే అభిప్రాయాన్ని ప్రాచీనాలంకారికులెందరో బహుధా ప్రవచించియే యున్నారు.

మొత్తం మీద అసలైన కవిభావన తనకుతానై సిసలైన భాషను వెతుక్కొని బహిర్గత మవుతుంది. ఆ భాష తప్పక ఒక తూగులో ఊగుతుంది. ఏ భాషా కవిత కైనా ఇది సహజం అనవచ్చును.

భాషాశాస్త్రం (శైలీశాస్త్రం) చెప్పే వర్ణపువరుక్తి ఇత్యాది ప్రకరణము ప్రాచీన కావ్య శాస్త్రవేత్తలు వివరించిన ''రీతి''దానికి సంబంధించిన విశ్లేషణలు అనే వాటికన్న ఎక్కువగా సాహిత్యాన్ని బోధపరచుకోవడానికి మాత్రం అంతగా దోహదకారి|కాదనిపిస్తున్నది. హృదయస్పర్శియైన కవిత్వకళను పర్యాలోచించినవారు రసస్పర్శకాకరములైన విషయములను గూర్చి ఎన్నో సిద్ధాంతాలను ప్రతిపాదించియున్నారు. ముక్కలు చెక్కలు చేసే ఈ శైలీశాస్త్రంవలని ప్రయోజనం శ్రీ శర్మగారు అన్నట్లు '''సందేహాస్పదమే.'''

''భాషా పరమైన విశ్లేషణలు సాహిత్యాన్ని అర్థంచేసుకోవడానికి ఎంతవరకు తోడ్పడుతాయన్నది సందేహాస్పదమే'' అన్న శ్రీ లక్ష్మీనారాయణ శర్మగారి ''సహృదయత''కు నమోవాకము లర్పిస్తున్నాను.



శ్రీ సి. పి. రావు

# వైజ్ఞానికరంగంలో సృజన

## "సృజనాత్మకత" (Creativity) అంటే ఏమిటి?

"సృజన" పదంలో 'సృజ' ధాతువుకు అర్థాలు ఇలా ఉన్నాయి: "జారుట," "చైతన్యశక్తి—రూపమేలేనిది, వర్ణనాతీతమైనది — అవ్యక్తదశనుండి వ్యక్తదశకు జారుట"—అని. దీనినే సృష్టిలేక సృజన కార్యమని ఆర్యఋషులు భావించారు.

మానవజీవితంలో అన్నిరంగాలలో బహుముఖంగా ప్రకాశించే ఈ సృజనాత్మకత ఆయారంగాలలో ప్రతిభ (Excellence) కు ఆధారభూతమని పాల్‌టారెన్స్‌వంటి విద్యావేత్తలు అభిప్రాయపడ్డారు

"వినూత్నమైన ఊహలను ప్రేరేపించేశక్తి"అని సృజనాత్మకతను సాధారణంగా నిర్వచించవచ్చు.

"ఈ ప్రేరేపణ దేనివల్ల కలుగుతోంది?" అని ప్రశ్నవేసిన ఓస్‌బోర్న్ అనే శాస్త్రజ్ఞుడు, "బహుశా మానవుడు ఈ ప్రశ్నకు జవాబు కనుక్కోలేడేమో? ఇది జీవరహస్యాని కన్న రహస్యం అయి ఉండవచ్చు. సృజనాత్మక "ఉహ" హృదయస్పందనం వంటిదా? లేక దానికన్న దివ్యరహస్యమేమో ? ఏది ఏమైనా 'ఊహాశక్తి' ఈ సృజనాత్మకతకు ప్రాణం వంటిదని మాత్రం చెప్పవచ్చు" అని వ్యాఖ్యానించాడు.

"జ్ఞానం కన్న ఊహాశక్తి చాలా ముఖ్యమైనది" అని ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ అన్నారు. వైజ్ఞానిక పరిశోధనా సమస్యల పరిష్కారానికి ఆధారం సృజనాత్మకతయే కాబట్టి "పరిశోధనా సమస్యలను పరిష్కరించగల సామర్థ్యమే సృజనాత్మకత" అనే నిర్వచనం ఏర్పడింది. అలాగే "కార్యోన్ముఖమైన ఊహాశక్తి సృజనాత్మకత" అనికూడా అంటారు. అసలు దీనిని నిర్వచించడం గ్రుడ్డివాడు ఏనుగను వర్ణించడం వంటిదని జపనీస్ విద్యావేత్త యమమోటో అన్నాడు.

పరిశోధకులు, విద్యావేత్తల అభిప్రాయాలెలా ఉన్నా, అందరికీ ఆమోద యోగ్యమైన నిర్వచనమింతవరకూ ఏర్పడలేదు. కానీ, ప్రతి మానవుడిలో వినూత్నమైన ఊహలను ప్రేరేపించే నిగూఢ శక్తికి — సృజనాత్మకతకు అవినాభావ సంబంధ మున్నట్లు మాత్రం అందరూ అంగీకరించారు.

## సృజనాత్మకతను ప్రేరేపించగలమా?

ఏ వ్యక్తులలో, ఏ దశలతో, ఏ పరిస్థితుల్లో, ఏవిధంగా సృజనాత్మక శక్తి వ్యక్తమౌతుందో వైజ్ఞానిక పరిశోధకులుచెప్పలేకుండా ఉన్నారు. అయితే, "ప్రశ్న" వేయడమే సృజనాత్మకతకు ముఖ్య సాధనమని మేధావులు గుర్తించారు. దీన్నిగురించి సోక్రటీస్ ప్రస్తావిస్తూ కొత్త 'ఊహ' లను మనస్సులో కనేందుకు 'ప్రశ్న' మంత్రసాని వలె సహాయపడుతుందన్నాడు.

వైజ్ఞానిక పరిశోధనా "సమస్య" అంటే ప్రపంచంలో ఎవరికీ జవాబు తెలియని "ప్రశ్న" అన్న మాట.

ఏదో ఒక విషయంపై ప్రశ్న వేసి, మనస్సును సవాలు చేసే ఆసక్తిని— కుతూహలాన్ని రేకెత్తించి ఓ "సమస్య" ను సృష్టించాలి. ఇది ఆ వ్యక్తిలో తగినంత ఆసక్తిని, ఉత్సాహాన్ని ప్రేరేపించగలిగితే, ఆ సమస్యను ఎదుర్కొని, పరిష్కరించేందుకు తహ తహ పడి, ఏకాగ్రచిత్తంతో అహర్నిశలూ కృషిచేయడంవల్ల ఆ వ్యక్తిలోని సృజనాత్మక శక్తి ప్రేరణ పొంది,వినూత్నమైన ఊహా వైవిధ్యంతో విజృంభించగలదని చెప్పవచ్చు. వజ్ర సదృశమైన దృఢసంకల్పం, అంతులేని ఉత్సాహం, అనంతమైన ఓర్పు, అవిరామకృషి, అత్యుత్తమమైన— విలక్షణమైన ఫలితాలనిస్తాయని సృజనాత్మక ప్రతిభను వ్యక్తం చేసిన ప్రఖ్యాత శాస్త్రవేత్తల జీవిత చరిత్రలు తెలియ జేస్తున్నాయి.

విఖ్యాత భౌతిక శాస్త్ర వేత్త ఐజాక్ న్యూటన్‌ను "క్రొత్త సంగతులెలా కనిపెడుతున్నార"ని అడిగితే, "నిరంతరమూ ఆ సమస్యలపై చింతించడం ద్వారానే" అని జవాబిచ్చాడు. ప్రపంచ శాస్త్రవేత్తలను తన పరిశోధనా ఫలితాలతో దిగ్భ్రాంతులను చేసిన జగదీశ్ చంద్రబోస్, "తాను స్వయంగా పరిశోధనలు చేస్తూ, సత్యాన్వేషణ కృషిలో విజయం పొందిన గురువు, తన జీవితాదర్శంతో శిష్యునిలో ఆసక్తి, ఉత్సాహాలను ప్రేరేపించగలడ"ని అంటూ, "ఒక వెలిగేమైనపు వత్తి మరో దానిని వెలిగించినట్లు, అయస్కాంతం ఇనుపముక్కను అయస్కాంతంగా మార్చినట్లు, సృజనాత్మక శక్తి యుతులైన వ్యక్తులు ఇతరులలో ఈ శక్తిని ప్రేరేపించగలర"ని తెలిపాడు.

ఎలెక్ట్రిక్ బల్బ్, గ్రామొఫోన్ వంటి వందలాది అద్భుత సాధనాలను సృష్టించిన ప్రతిభాశాలి థామస్‌ఆల్వా ఎడిసన్‌ను "మీ అసామాన్య ప్రతిభ (Genius) కు కారణమేమిట"ని ప్రశ్నిస్తే, "నాలో ప్రత్యేక ప్రతిభ అంటూ ఏమీ లేదు; అదంతా 98శాతం

చెమటోడ్చి చేసిన కృషి ఫలితం, 2శాతం అతీంద్రియస్ఫురణ'' అని జవాబిచ్చాడు.

''సృజనాత్మకత'' ప్రతి వ్యక్తిలోనూ ఉన్నదనీ, దానిని గుర్తించి, ప్రేరేపించి, పోషించి, వృద్ధిచేసి, పటిష్ఠంచేసే అవకాశ మున్నదని ఆధునిక పరిశోధనల ద్వారా విద్యావేత్తలు తెలుసుకో గలిగారు

''సృజనాత్మకత'' ఒక కళ— అన్ని కళల మాదిరిగానే ఈ కళ కూడా తగిన శిక్షణ ద్వారా అభ్యసించి, సాధన ద్వారా అభివృద్ధి చేసుకోవచ్చునని విద్యావేత్తలు, పరిశోధకులు భావిస్తున్నారు. దీనినే మన ఋషులు, కవులు, ''దైవాంశ''గా పరిగణిస్తూ వచ్చారు.

## సృజనాత్మకతపై పరిశోధనలు సృజనాత్మకతను గుర్తించడం, ఊహల విలువ

దీనిపై పరిశోధనలు సుమారు 20 సంవత్సరాల (2దశాబ్దాల) క్రితమే ఆరంభమైనాయి. మానవ చరిత్రలో ఇన్ని శతాబ్దాలుగా దీనిని గురించి పరిశోధించాలన్న ''ఊహ'' ఎవరికీ రాకపోవడం చాలాఆశ్చర్యకరమైన విషయం వ్యక్తులలో సృజనాత్మకతను గుర్తించి, దానివిలువ లెక్క గట్టేందుకు కృషిచేసిన విద్యాపరిశోధకులలో ప్రథముడు ప్రొ. గిల్‌ఫర్డ్—ఊహల సంఖ్య, ఊహలలో వైవిధ్యం, ఊహలలో వినూత్నత—అనే మూడు గుణాలు ఆధారంగా ఒక పరిశోధనావిధానం రూపొందించాడు. తర్వాత పాల్‌టారెన్స్, మెక్‌కినాన్‌వంటి పలువురు విద్యావేత్తలు మరికొన్ని పద్ధతులను ప్రతిపాదించారు. 'టారెన్స్‌పరీక్షావిధానం' అన్న పద్ధతి విస్తృతంగా ఆమోదం పొందినట్లున్నా, వీటిని మార్పుచేసి, అభివృద్ధి పరిచేందుకు ఇంకా పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి.

''సృజనాత్మకత'' అన్నది అతిక్లిష్టమైన, సూక్ష్మాతిసూక్ష్మమైన , బహుముఖప్రకాశమానమైన అద్భుతశక్తికి సంబంధించిన అంశం గనుక దీనిని 'గుర్తించడం,' 'విలువ నిర్ణయించడం' అంత సులభసాధ్యమైన విషయంకాదు. సృజనాత్మకతను అభివృద్ధి పరచి, శిక్షణనిచ్చేందుకు ప్రస్తుతం అనేక పద్ధతులున్నాయి 1. ఊహలతుఫాన్ పద్ధతి (Brain storming technique), 2 స్వరూపవర్ణన—సంయోగం (Morphological synthesis) 3. మార్పుల ప్రశ్నల పట్టిక (Checklist method) 4.స్వరూప వర్ణన—విశ్లేషణ (Morphological analysis) ; 5.సైనెక్టిక్స్ (Synectics) 6. బయోనిక్స్ (Bionics) —అనేవి ముఖ్యమైనవి.

సృజనాత్మకతపై ప్రపంచవ్యాప్తంగా సుమారు 500 కు పైగా పరిశోధనా వ్యాసాలు, గ్రంథాలు ప్రచురించబడి వున్నాయి వైజ్ఞానిక రంగంలో సృజనాత్మకతపై సుమారు 100వ్యాసాలు, గ్రంధాలు ఉన్నాయి. గణిత, ఇంజనీరింగ్ శాస్త్రాలలో పాశ్చాత్యులనేకులు పరిశోధనా ఫలితాలను ప్రచురించారు. భారతదేశంలోని ఆలీఘర్ విశ్వవిద్యాలయంలో ''భౌతికశాస్త్రబోధనలోసృజనాత్మకత'' పై పరిశోధనా కార్యక్రమం (Creativity in teaching physics) నిర్వహిస్తున్నారు. మనరాష్ట్రంలోని నెల్లూరులో ''సృజనాత్మకత ప్రవృద్ధి—పరిశోధనసంస్థ'' (Creativity promotion & Research Mission-Regd.)అధ్వర్యంలో జీవశాస్త్రబోధన—అభ్యాసం—సృజనాత్మకత' అనే అంశంపై పరిశోధనలు జరుగుతున్నాయి. పూనాలోని ''Institute of Creative Development'' వ్యాపార సంస్థలు, కర్మాగారాల యజమానులకు సృజనాత్మకతపై శిక్షణ ఇస్తోంది. అమెరికా, రష్యా తదితరదేశాలలో ఇటువంటి కృషివిస్తృతంగా జరుగుతున్నది.

## సృజనాత్మకశక్తిగలవారి లక్షణాలు

ఈ పరిశోధనలలో కొన్ని వింత విశేషాలు బయటపడ్డాయి. ప్రఖ్యాతులైన కొన్ని వందలమంది జీవిత చరిత్రలను పరిశీలిస్తే, వీరిలో కనబడిన లక్షణాలు సాధారణంగా ''చెప్పినమాట వినే బుద్ధిమంతుడికి ఉండవలసినట్టు'' లేవు !

1 తనదారినతాను—తన ప్రత్యేకమైన త్రోవలో పోవాలని యత్నించడం. 2 అధికారాన్ని, క్రమశిక్షణ నిబంధనలు—వీటిని వ్యతిరేకించే ధోరణి. 3. ఇలాచేస్తే ఏమవుతుంది? అలాచేస్తే ఏమవుతుంది? అనే కుతూహల దృక్పథం. 4. అసాధ్య కార్యాలను సాధించాలనె కోరిక. 5 తన భావాలపై మొండిపట్టుదల. 6. అహంకారం. 7. ఉద్రేకపూరితంగా వాదించడం. 8. తప్పులుపట్టే ధోరణి. 9 సమయస్ఫూర్తిపైననే ఆధారపడటం : ఇలాంటి గుణాలు ముఖ్యంగా ఉన్నాయి.

వీరు తమ సమకాలికులకన్నా ఊహాశక్తిలో 'కొన్ని దశాబ్దాలు' ముందడుగు వేసినవారు కావడంచేత, వీరు సాధించే ఫలితాలు వెంటనే ఆమోదం పొందకపోగా, ఒక్కోసారి ఈ వ్యక్తుల హింసకు కూడా దారితీయవచ్చు. జె. సి బోస్, లూయిపాశ్చర్, గ్రిగర్ మెండల్ సాధించిన ఫలితాలు ఆమోదం పొందేందుకు కొన్ని దశాబ్దాలు పట్టింది. డార్విన్, గెలీలియోలు హింసలకు గురికావలసి వచ్చింది !

## మార్కులు - తెలివి - సృజనాత్మకత

విద్యాలయాలలో జరిపిన పరిశోధనలలో తేలిన అంశం— ఎక్కువ మార్కులతో, ఎక్కువ తెలివిగలవారుగా (I. Q· High) పరిగణించబడినవారిలో సృజనాత్మకత చాలా తక్కువగా ఉందట! డార్విన్, మెండల్, పాశ్చర్‌వంటి ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రజ్ఞులు కొందరు విద్యార్థి దశలో మార్కులకు బదులు రిమార్కులు తెచ్చుకుని మొద్దబ్బాయిలుగా పరిగణించబడ్డారు!

[అలాగని మొద్దబ్బాయిలందరూ సృజనాత్మక ప్రవీణులని చెప్పలేము. నోబెల్ బహుమతి పొందిన చాలామంది, విద్యార్థి జీవిత

మంతా ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనవారే! ఉదా : మేడమ్ క్యూరీ, హరగోవిందఖొరానా...]

## వయస్సు - సృజనాత్మకత

చిన్న వయస్సు బాలబాలికలలో, 3–4 తరగతులవరకూ 'ఊహాశక్తి' అత్యుత్తమస్థాయిలో ఉండి, వయస్సు పెరిగేకొద్దీ పెద్దల వాతావరణ ప్రభావంవల్ల తగ్గిపోతూ, హైస్కూలు—కాలేజ్ దశలలో చాలా తక్కువస్థాయికి చేరుతుందట! కానీ, ఈ ఊహాశక్తిని ఏ దశలోనైనా పునర్వృద్ధి చేయవచ్చు.

చిన్న వయస్సులోనే వైజ్ఞానిక సత్యాలు కనుగొన్నవారు అనేకులున్నారు—లినెయస్, పాశ్చర్, న్యూటన్, డార్విన్, సి. వి. రామన్, ఓపెన్ హైమర్, విద్యార్థిగానే నోబెల్ బహుమతి పొందిన సట్టన్ మొదలైనవారు.

## మానవజాతి పురోగమనం విజ్ఞానశాస్త్రాల్లో సృజన

సృజనాత్మక శక్తియుతులైన వ్యక్తులు గతంలో చేసిన పరిశీలనలు, పరిశోధనాకృషి ఫలితాలే ఆధునిక విజ్ఞానశాస్త్రాలు. ప్రకృతి సత్యాలను అన్వేషించాలనే కుతూహలం, ఆసక్తి — ఇవే అరిస్టాటిల్, గేలీలియో, న్యూటన్ మొదలైనవారి కృషికి ప్రోద్బలం. ఈ కృషివల్ల ప్రపంచానికి లాభమేముంటుందిలే అని గాని, తామేదో ప్రయోజనాన్ని ఆశించిగానీ కాకుండా, ''ఇదేమిటి? అదేమిటి?'' ఇత్యాది ప్రశ్నలకు సమాధానం కనుగొనాలనే జ్ఞానతృష్ణవల్లనే, ఆ తృప్తికోసమే ఈ అన్వేషణలు చేశారు. ఇప్పటిలాగా ''శాస్త్ర పరిశోధన'' అంటే అదేదో—విశ్వవిద్యాలయంలో పి హెచ్.డి.వంటి పట్టాలు పొందేందుకు చేసేకృషి—అనే భావనలేదు. ప్రకృతి సత్యాలను అన్వేషించే కుతూహలం, ఆసక్తి, ఉన్నవారెవరైనా ఇలాంటి కృషిచేసి, స్వేచ్ఛగా తమ పరిశీలనలను గురించి చర్చించేవారు, ప్రచురించేవారు. గెలీలియో, డార్విన్, లామార్క్, ల్యూయెన్‌హాక్, ఫారడేవంటి ఖ్యాతినార్జించినవారు అనేకులు కాలేజీ, యూనివర్సిటీల డిగ్రీలు పొందలేదు. లూయీ పాశ్చర్ రసాయనికశాస్త్ర పట్టభద్రుడైనప్పటికీ జీవశాస్త్రంలో పరిశోధనలు చేశాడు. జగదీశ చంద్రబోస్ భౌతిక శాస్త్రాచార్యుడైనప్పటికీ వృక్షశాస్త్ర విభాగంలో విశ్వవిఖ్యాత పరిశోధనలు జరిపాడు. అంటే, సృజనాత్మక కృషికి ప్రకృతి సత్యాన్వేషణలో ఆసక్తి, ప్రగాఢవాంఛ ముఖ్య కారణం, ప్రోద్బలం అని చెప్పవచ్చు. జ్ఞానార్జనే ధ్యేయంగాగల ఈ శాస్త్రకృషి "Fundamental Sciences" (ప్రాథమికప్రకృతి సత్యాన్వేషణ) అనబడుతున్నది. ఈ కృషిఫలితాలవల్ల మానవాళికి వెంటనే లాభం కనపడకపోవచ్చు. సూక్ష్మబుద్ధి, దూరదృష్టి ఉన్నవారు; ఆయా శాస్త్రాలతో పరిచయమున్నవారు మాత్రమే వీటి ఘనతను గుర్తించగలరు.

పైన చెప్పిన ప్రాథమిక సత్యాలపై ఆధారపడి, మానవాళికి ఉపయోగపడే సూత్రాలను, యాంత్రిక పరికరాలను కనుగొనే కృషి విభాగాన్ని "Applied Sciences Technology" (సాంకేతిక విజ్ఞానశాస్త్రాలు) అంటున్నారు. ఈ రంగంలో జరిగే సృజనాత్మక కృషి ఫలితాలు మానవజాతికి వెంటనే ఉపయోగపడుతున్నాయి. కనుక వీటి లాభాలను, గొప్పతనాన్ని సామాన్యులు కూడా గ్రహించగలరు. ప్రపంచరూపాన్ని, మానవ జీవన విధానాన్ని విప్లవాత్మకంగా మార్చివేసిన 15 సాధనాలను కనుగొన్న వ్యక్తుల సృజనాత్మక కృషి ఫలితాలను వీటికి ఉదాహరణలుగా స్మరించవచ్చు.

ఆవిరి యంత్రాన్ని కనుగొని రైలుబండి యుగానికి నాంది పలికిన జేమ్స్‌వాట్; అదే సూత్రం ఆధారంగా స్టీమ్ లాంచ్ నిర్మించిన రాబర్ట్ ఫుల్టన్; పంటల కోత యంత్రాన్ని రూపొందించిన సైరస్ మెకార్మిక్; కుట్టు మిషన్ తయారుచేసిన ఎలియస్ హో; టెలిగ్రాఫ్‌ను ఆవిష్కరించిన మోర్స్; టెలిఫోన్‌ను మనకు అందించిన గ్రాహంబెల్; టైప్‌రైటర్‌కు రూపకల్పం చేసిన షోల్స్; వార్తాపత్రికల ప్రచురణకు లైనోటైప్ యంత్రాన్నిరూపొందించిన ఆట్మర్ మెర్గం థాలర్; గ్రామొఫోన్, ఎలక్ట్రిక్‌బల్బ్ వంటి వెయ్యి పరికరాలను తయారుచేసిన ఎడిసన్; ఆధునిక హైడ్రో ఎలక్ట్రిక్ పవర్ స్టేషన్ రూపొందించేందుకు ఎ. సి. మోటారులను ఉత్పత్తి చేసి ఇంటింటా విద్యుద్దీపాలను వెలిగించి, విద్యుచ్ఛక్తి యుగారంభం చేసిన నికొలాటెస్లా; వృత్తిరీత్యా సైకిల్ మెకానిక్‌లైనా, విమానాన్ని సృష్టించి ఆకాశయాన శకానికి నాంది పలికిన రైట్ సోదరులు; మోటారు కారును నిర్మించిన హెన్రీఫోర్డ్, రేడియో వాల్వ్‌ను కనుగొన్న లీడీ ఫారెస్ట్; చలన చిత్రాలను సృష్టించి, సినిమా యుగాన్ని ప్రారంభించిన విలియం ఫ్రీజే గ్రీన్; ట్రాన్సిస్టర్‌ను రూపొందించి ఎలక్ట్రానిక్స్‌లో విప్లవం తెచ్చిన షాక్లీ, బ్రాటెన్, బార్డీన్—

ఇంకా ఇలాంటి ఉవేతలు [Inventors] వందలాది మంది ఉన్నారు. ఇదే విధంగా (జీవశాస్త్రంలో) పెన్సిలిన్‌ను కనుక్కున్న అలెగ్జాండర్ ఫ్లెమింగ్‌వంటి శాస్త్రజ్ఞులనేకులు పశువుల, పంటల, మానవుల రోగనివారణకై కృషిచేసి, అద్భుత ఫలితాలనుసాధించారు.

## భవిష్యత్తులో . . .

సమీప భవిష్యత్కాలంలో సృజనాత్మక కృషి సాధించబోయే ఫలితాలను గురించి పలు 'ఊహలు', 'ఆశలు' వివిధ విజ్ఞానశాస్త్ర శాఖల్లో వ్యాప్తిలో ఉన్నాయి.

సైబర్నెటిక్స్ అనే శాస్త్ర విభాగంలో మనిషి మెదడు చేసే పనులు చేయగలిగిన యంత్రాలను సృష్టిస్తున్నారు. ఇవి మేస్టర్ల

లాగా చదువులు చెపుతాయి, వివిధ భాషలు నేర్పుతాయి, భాషాను వాదాలు చేస్తాయి, పరీక్షలను నిర్వహించి—ఫలితాలు ప్రకటిస్తాయి. డాక్టర్లకు మల్లే రోగి లక్షణాలను పరిశీలించి – వ్యాధి నిర్ణయం చేసి – మందులు సూచిస్తాయి, వంటలు, ఇంటిపనులు, ఆఫీసు పనులు – ఒకటేమిటి, మానవుడు చేసే పనులన్నీ చేయగలిగిన యాంత్రిక మానవుల వంటివి ఈ యంత్రాలు. మెదడులో కోట్ల కొలది జీవకణాలున్నాయి. ఇవన్నీ ఏమేం పనులు, ఏవిధంగాచేస్తాయో తెలుసుకునేందుకు పైన చెప్పిన యంత్రాలను ఉపయోగించడానికి ప్రయత్నిస్తున్నారు. వైద్య పరిశోధనలలో ఇతః పూర్వం అసాధ్య మనుకున్న వాటిని సాధించవచ్చునని ఆశిస్తున్నారు.

''మీకెలాంటి జీవులుకావాలో చెప్పండి, పరిశోధనాలయంలో వాటిని తయారుచేయగలం – సమీప భవిష్యత్తులో...'' అంటు న్నారు డి. ఎన్. ఎ. లేదా 'జీన్' అనబడే గుణకారకాలను కృత్రిమంగా సృష్టిస్తున్న జన్యు శాస్త్రవేత్తలు.

'క్లోరోఫిల్' అనే హరిత పదార్థాన్ని, వరి మొ॥న మొక్కలు తయారుచేసుకునే పిండి పదార్థాన్ని, తదితరమైన ఆహార పదార్థాలను శోధన నాళికల (Test tubes) లో చేయబోతున్నామని జీవ రసాయనిక శాస్త్రజ్ఞులు ఎదురు చూస్తున్నారు. మానవ శరీరంలో ''ఎర్ర – తెల్ల'' కణాల మాదిరి ''హరిత కణాల''ను కూడా ఉత్పత్తి చేసి, మొక్కలకు మల్లే ఆహారాన్ని తమ శరీరంలోనే తయారు చేయగలిగిన ''ఆకలి లేని హరిత మానవుల'' ఆగమనావకాశాలను గురించి యోచిస్తున్నారు మరికొందరు.

మానవ జాతికి అవసరమైనంత విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయవచ్చునని పరమాణు శాస్త్రవేత్తలు, సూక్ష్మజీవ శాస్త్రజ్ఞులు ఆశిస్తున్నారు.

అనంతంగా లభ్యమయ్యే సూర్య తేజోశక్తిని నిత్య జీవితావసరాలకు వినియోగించేందుకు కృషి చేస్తున్నారు భౌతిక రసాయన శాస్త్రవేత్తలు.

ఆకాశంలో నగరాలు నిర్మిస్తామని, గ్రహాంతరయానం చేయగలమని, అంతరిక్ష శాస్త్రజ్ఞులు కలలు కంటున్నారు.

మానసిక తత్త్వ శాస్త్రవేత్తలు ఆదునిక ఎలాక్ట్రానిక్ పరికరాలతో అతీంద్రియ మానసిక శక్తులను పరిశోధిస్తూ, ఆశ్చర్యకరమైన ఫలితాలను సాధిస్తున్నామంటున్నారు. బల్గేరియాలో రెండు సంవత్సరాలు నేర్పే ఫ్రెంచ్ భాష పాఠాలు—20 రోజులలోనే విద్యార్థులకు నేర్పారట. ''సజెస్టోపేడియా'' [Suggestopedia] అనే ఈ పద్ధతిని, భారతీయ యోగులు 'శవాసనం' ద్వారా సాధించే మానసిక స్థితి ఆధారంగా రూపొందించామని కూడా ఆ బల్గేరియన్ విద్యావేత్తలు తెలియజేశారు. రష్యా, తదితర దేశాలలో కూడా ఈ ''సజెస్టోపేడియా'' పద్ధతిని అందరికీ ఉపయోగపరిచేందుకు కృషి చేస్తున్నారు. రెండు, మూడు సంవత్సరాల పాటు నేర్పే పాఠాలు – వయస్సుతో నిమిత్తంలేకుండా —20, 30 రోజులలో నేర్చుకునే మానసిక స్థితి అందరికీ ఉన్నది, దానిని ఎలా వినియోగించుకోవాలో తెలిస్తే. ఇలాగే ధ్యానయోగం, మానసిక స్థితులు, ప్రజ్ఞాదశలు వీటన్నిటినీ గురించి పరిశోధనలు చేస్తున్నారు.

సృజనాత్మక కృషితో మానవుడు సాధించలేనికార్యంలేదేమో? నమ్మలేనంత అద్భుత ఫలితాలను సాధించేందుకు వివిధ శాస్త్ర విభాగాలలో కృషి చేస్తున్నారు. ఈ విప్లవాత్మక ఫలితాల ప్రభావం మానవజాతి రూపు రేఖలనెలా తీర్చి దిద్దుతుందో చెప్పడం అసాధ్యమే! కానీ, రాబోయే లాభనష్టాలను ఊహించి కథలు–నవలల రూపంలో చిత్రించారు కొందరు శాస్త్రవేతలు. నిన్నటి అసాధ్య ఫలితాలు, కలలు రేపటి నిజాలుగా మార్చే అద్భుతశక్తి 'సృజనాత్మకత' అని గ్రహించి దీనిని గురించి ప్రత్యేక శ్రద్ధ వహించడం జరుగుతోంది. కానీ, ఇంత ప్రగతి సాధించినప్పటికీ, 'జీవి', 'ప్రాణం' అంటే ఏమిటి? 'శక్తి' అంటే ఏమిటి? 'ప్రేమ' అంటే ఏమిటి? 'నేను' అనేదేమిటి? 'ఈ విశ్వాంతరాళమెక్కడుంది?' ఇలాంటి కొన్ని జటిలమైన ప్రాథమిక సమస్యలు ఆది నుంచీ మానవ మేధను వేధిస్తూనే ఉన్నాయి. భావి వైజ్ఞానిక సృజనాత్మక కృషి ఈ సమస్యలను పరిష్కరించగలదేమో వేచి చూడాలి.

## భారతదేశంలో విజ్ఞాన శాస్త్ర బోధన-సృజనాత్మకత

మన విద్యావిధానంలో వైజ్ఞానిక పరిశోధనా కృషికి విశ్వవిద్యాలయాల్లో, ఉన్నత తరగతులలో మాత్రమే స్థానం ఇవ్వబడింది. ఆంధ్రప్రదేశ్‌లో ఎస్. యస్.సి. దశలో కూడా ఇటువంటి కృషికి అవకాశం లేదు ప్రాథమిక విద్య మొదలు కళాశాల దశ వరకూ దీనిని సమూలంగా పెకలించి వేసి, నిర్మూలించారు. దీనికికారణం – 'సృజనాత్మకత' ను గురించి తల్లి దండ్రులలో, అధ్యాపకులలో (ఎలిమెంటరీ ఉపాధ్యాయుల నించీ యూనివర్సిటీ ప్రొఫెసర్ల వరకూ) విద్యాధికారులలో విస్తృతంగా, అపారంగా ఉన్న అజ్ఞానమే! ఉన్నతమైన యూనివర్సిటీ డిగ్రీలున్న వారే వైజ్ఞానిక పరిశోధనలు చేయగలరన్న ప్రగాఢమైన 'మూఢ విశ్వాసం' మరో పెద్ద ఆటంకం.

పరిశోధనా దృక్పథం, సృజనాత్మకత లను ప్రాథమిక విద్యా దశ నుండి ప్రోత్సహించి, పోషించాలనే సత్యాన్ని గ్రహించ లేక పోయారు. సృజనాత్మకత ఉన్న వ్యక్తుల విలక్షణ వ్యక్తిత్వాన్ని గుర్తించి, సానుభూతితో సహకరించక పోగా, వారిని 'పనికి మాలిన పిచ్చిపనులు చేసే వారు'గా, 'తమ దారిన తాము పోయే పెడసరులు'గా, 'పెద్దలను ప్రశ్నించి ఎదురు చెప్పే అహంకారులు' గాను పరిగణించి ఈ ప్రశ్నించే ధోరణిని, పరిశోధన దృక్పథాన్ని, విద్యాలయాలనుండి, విద్యార్థుల నుండి బహిష్కరించారు.

"విద్యార్థిని ఆలోచించ నివ్వకుండా వీలైనన్ని ఆటంకాలు కల్పించడమే భారతదేశంలో విద్యగా కనబడుతుంది. భగవద్గీత, బైబిల్, వేదమో అన్నట్లు పాఠ్యపుస్తకాలు పారాయణ చేయడం చదువేనా ?

విద్యార్థిలో జిజ్ఞాస రేకెత్తించగలది చదువు, తనకు తాను ప్రయోగాలు చేసి స్వతహాగా కనుక్కొనేందుకు అవకాశాలిచ్చేది విద్య గానీ, అరిగిపోయిన గ్రామఫోన్ రికార్డుల వంటి విద్యార్థులను తయారు చేసేది విద్యేనా ?'' అని బ్రిటిష్ విద్యావేత్త డేవిడ్ హార్స్‌బర్గ్ విమర్శించారు.

1976 మార్చిలో ఢిల్లీలో జరిగిన విద్యాధికారుల, విద్యా మంత్రుల జాతీయ సమావేశంలో ప్రసంగిస్తూ శ్రీమతి ఇందిరాగాంధీ, "సృజనాత్మక శక్తిని బాల బాలికలలో ప్రోత్సహించే మార్పుల విద్యా విధానంలో తీసుకు రావాల''ని నొక్కి వక్కాణించారు. (ఆంధ్రపత్రిక. 8–3–76)

వందకు పైగా విశ్వవిద్యాలయాలు, పరిశోధనాలయాలు ఉన్న, ప్రపంచంలోని సాంకేతిక నిపుణులలో 1/3వ వంతు ఉన్న ఇంత పెద్ద భారతదేశం 75సంవత్సరాలలో విజ్ఞాన శాస్త్ర రంగంలో ఒకే ఒక 'నోబెల్ బహుమతి' (సర్ సి.వి.రామన్–ఫిజిక్స్) పొందగలిగింది. అదే కాలంలో జర్మనీ(45), ఆస్ట్రియా, స్వీడన్ వంటి చిన్న దేశాలు కూడా మనకన్నా ఎక్కువ నోబెల్ బహుమతులు పొందగలిగాయి.

ఇలాంటి వైజ్ఞానిక పోటీలలో అంతర్జాతీయ స్థాయినందుకోలేక పోవటానికి కారణం స్వామి వివేకానంద అన్నటు "స్వతంత్ర భావావేశం, ఆత్మవిశ్వాసం'' పెంపొందే విద్యా విధానం లేక పోవడమేనని గ్రహించాలి. సృజనాత్మక శక్తి అత్యుత్తమ స్థాయిలో వృద్ధి చెందే అవకాశాలున్న విద్యావిధానాన్ని రూపొందించాలి

ఆత్మవిశ్వాసం, భావస్వాతంత్ర్యం లేని "వైజ్ఞానిక కూలీలను'' తయారుచేసే ఈ బానిస విద్యావిధానానికి స్వస్తి చెప్పి, విశ్వ విద్యాలయాలలో గణనీయమైన మార్పుల ఆవశ్యకతను గుర్తించినప్పుడే మనదేశం త్వరితంగా పురోభివృద్ధి చెందగలదు.

## సృజనాత్మకతకు పోషణ-ప్రోత్సాహం

విజ్ఞాన శాస్త్రాలలో సృజనాత్మక శక్తిగల బాలబాలికలను గుర్తించి, వారికి ప్రత్యేక శిక్షణ ఇవ్వవలసిన ఆవశ్యకతను, వివిధ దేశాలు తీసుకోదగిన చర్యలను, లండన్‌లో జరిగిన "ప్రపంచంలోని సృజనాత్మక బాలలగురించిన సమావేశం'' (World Conference on Gifted Children)లో చర్చించారు. ఇందులో భారత ప్రతినిధులు కూడా పాల్గొని మన దేశంలో జరిగిన కృషిని వివరించారు ఎన్. సి. ఇ. ఆర్. టి. వారు అఖిలభారతస్థాయిలో "వైజ్ఞానిక ప్రతిభాన్వేషణ పరీక్ష'' ("National Science Talent search Exam") నిర్వహించి, ఎన్నికైన విద్యార్థులకు ప్రత్యేక శిక్షణ, ఆర్థికసహాయం, ఇస్తున్నారు. పరిశోధనచేసి, ఒక వ్యాసం సమర్పించడం ఈ పరీక్షలో ఒక ముఖ్యాంశం. ఎన్. ఆర్. డి. సి. వారు కొత్త పరికరాలను సృష్టించినవారికి రూ: 25,000 వరకూ బహుమతులిస్తున్నారు విద్యార్థులకు ప్రత్యేకంగా "సృజనాత్మకతా పోటీలు'' కూడా నిర్వహిస్తున్నారు.

ఇకమీదట, కేంద్ర సెకండరీ విద్యాబోర్డు అధ్వర్యంలోఉండే సెకండరీ విద్యాలయాలలో 10వ తరగతి విద్యార్థులు పరిశోధనలు చేసి, పరిశోధనా వ్యాసాలు సమర్పించేటట్లు సిలబస్‌నే మార్చారు. హర్షణీయమైన ఈ విధానం రాష్ట్ర ప్రభుత్వాల యాజమాన్యంలో ఉండే విద్యాలయాలకు వ్యాపించేందుకు ఎంతకాలం పడుతుందో?

అంతర్జాతీయ సైన్స్ క్లబ్ ఉద్యమం, జిల్లా మొదలు అంతర్జాతీయస్థాయి వరకూ నిర్వహిస్తున్న సైన్స్ ప్రదర్శనలు (Science Fairs) ఇవన్నీ విద్యార్థులకు "వైజ్ఞానిక సదస్సులు–చర్చావేదికలు''గా (Science Congress వలె...) ఉంటాయని, వైజ్ఞానిక సృజనాత్మకతను ప్రోత్సహించాలని ఏర్పాటు చేయబడుతున్నాయి. కానీ, వాటి నిర్వహణ సృజనాత్మకతను గురించి అవగాహన లేనివారి చేతుల్లో పడినపుడు అవి "సైన్స్ జాతరలు''గా మారి, జరగవలసినంత ఆదర్శప్రాయంగా జరగడంలేదు. పైన చెప్పినట్లు శాస్త్ర పరిశోధన దృక్పథాన్ని పాఠ్యప్రణాళికలో భాగంగా గుర్తించినప్పుడు ఈ సైన్స్ ప్రదర్శనలు "సైన్స్‌కాంగ్రెస్''లుగా రూపొందవచ్చు.

## వైజ్ఞానిక పరిశోధకులు నిష్కామ కర్మయోగులే !

ప్రపంచవ్యాప్తంగా కోటానుకోట్ల మానవుల శ్రేయస్సుకోసం కృషిచేస్తున్న సృజనాత్మకతను పోషించడం పుణ్యకార్యంగా గుర్తించి యూరప్, అమెరికాలలోని ధర్మసంస్థలు [ఫోర్డ్ ఫౌండేషన్, రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ వంటివి... ] పరిశోధనా కృషికి, గ్రంథాలు–పరికరాలు కొనుగోలుకు ధనసహాయం చేస్తున్నాయి.

భారతదేశంలో టాటా—బిర్లా ధర్మసంస్థలేగాక ''హరిఓం ఆశ్రమం''వంటి మత సంస్థలు కూడా ఇటువంటి కార్యక్రమాలు చేపట్టాయి. ఇది చాలా శుభసూచకం. ఫ్లెమింగ్, బోస్, మేడమ్ క్యూరీ, ఐన్‌స్టీన్ మొదలైన వైజ్ఞానికులకృషి, మానవాళికంతటికీ ఉపయోగకరమైన సేవాకార్యంగా, నిష్కామకర్మగా గుర్తించబడి ఈ శాస్త్రవేత్తలు—ప్రకృతి సత్యాన్వేషకులు నిష్కామ కర్మయోగులే నన్న అవగాహన సామాన్య ప్రజలలో కలిగినప్పుడే మన దేశపు వైజ్ఞానిక పరిశోధనాకృషికి కావలసినంత పోషణ, ప్రోత్సాహం లభిస్తాయి. తత్ఫలితంగా వైజ్ఞానిక సృజనాత్మకత, ప్రతిభ పరిపూర్ణ వికాసం చెందగలవు.

భావి భారత శాస్త్రవేత్తలు, ప్రకృతి సత్యాన్వేషకులైన విద్యార్థులను తగినవిధంగా రూపొందించాలి. మన విద్యార్థులు అనుకరణపరులు, పాఠాలు బట్టీ పట్టేవారేకాదు—నూతన విజ్ఞానాన్వేషకులు కావాలి; చదువరులేకాదు—స్వతంత్ర ఆలోచనా సమన్వితులు కావాలి; గ్రంథస్థ విషయం పాండిత్యమే కాదు—గ్రంథాలలో లేని విజ్ఞానమెంతో ఉన్నదన్న ఎఱుక కావాలి; ''చెప్పినమాట విని, చెప్పినట్లుచేసే బానిసప్రవృత్తిగల గానుగెద్దులు''గాక, సాహసోపేతులై, స్వతంత్ర భావావేశం, ఆత్మవిశ్వాసం ఉన్న ఆదర్శ యువజనులు కావాలి.



# "వర్షాడంబరము"

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

## ఉత్సాహ వృత్తము :-

అమృతమూర్తి దాల్చి మింటి కరుగుదెంచె — గాఢమై
సమద మంద మంద గతుల సాగి నీల మేఘముల్
తమను కవిసినట్లు జగతి తనరె — నంత మేఘ మ
ధ్యమున నుండి పొంగె వైద్యుత స్ఫురత్ప్రకాశముల్ !!

ఇంద్ర నీలమణి రజంబు నెత్తిపోసినట్లు — ని
స్తంద్ర తమ సుధార గట్టి ధరకు దిగినయట్లు — నా
గేంద్ర తండ తుండ నికర మేమొ యన్నయట్లు — నా
య్యైంద్రి వాన కాళ్లు దిగియె — నతి వినీల కాంతులన్ !!

కొలది కొలది చినికి చినికి కురియు — నంతలో నెన
గ్గలపు జడులు తోచు — హోరుగాలి వీచు — కుండపో
తలుగ మారునంతలోనె !! ధరణి పగులునట్లుగా
ఫెళ ఫెళ మని మొఱసె నుఱుము—పిడుగుపడెనొ దవ్వులన్ !!

హోరుమంచు కురియు వర్షమూళ్లు పూళ్లు ముంచె — త
ద్వారి వర్ష పాతమునకు పొంగె మడుగు లెల్లెడన్
నీరు దొత్తవాడ దొడగె నీటి మడుగులందు — దు
ర్వార దారుణారవములఁ బంచె భేక సంఘముల్ !!

ఛిన్న కదళి వనము — భిన్న శీర్ష నారికేళ సం
ఛన్న ధరణి తలము — విగత సర్వఫల సుమమ్ము— వి
చ్ఛిన్న వృక్షశాఖి మయము — శిథిల పత్రధామమై
యెన్న రానిదయ్యె ప్రకృతి — యియ్యమోఘ ఝంఝుకు !!



శ్రీ ఓలువకొలను సదానంద

# నగ్నరాత్రి

(గతసంచిక తరువాయి)

## 11

బుసులో ఎలకలా, గంపకింద ఒంటరిగా చిక్కుకుపోయిన కోడి పిల్లలా—ఊరంతా అల్లిబిల్లిగా తిరిగాడు చక్రపాణి.

వాడి మనస్సు నిలకడగా లేదు

ఏం చెయ్యటానికీ పాలుపోలేదు.

కూర్చున్నచోట కూర్చోలేకపోయాడు.

నుంచున్నచోట నుంచోలేకపోయాడు.

ఆ నాలుగో జాతివాడి పెళ్ళాం శయనసుందరి ఒక్కసారిగా ఇద్దరు ముండగాళ్ళతో సరసాలాడుతోంది!

కోరికలు తీర్చుకుని కుమారి బ్రతుకులో కొరివిపెట్టినవాడి కులసతి మొగుడి ముఖానికి ముసుగేసింది!

ఒరే అంకుల్! నీ బతుకులో నా చెప్పు! మా అక్కను ఉసురు పెట్టుకున్నావ్ కదూ? ఊరికే పోతుందా ఆ పాపం? నీ బతుకు తివాచీమీద బురదకాళ్ళు తుడుచుకుంటున్నారు చూడ వోయ్ నీ డియర్ ఫ్రెండ్స్!

శేషఫణి కుమారిని తొలిసారి బలవంతంగా లొంగదీసుకుంటుంటే, ఆమె ఏడ్చిన ఏడుపును—జీవితంలో మరిచిపోలేదు చక్రపాణి.

ఆరోజు ఆమె వేళకు యింటికి రాలేదు:

'బ్యాంకుకు వెళ్ళి చూసిరారా' అంది తల్లి.

వెళ్ళాడు చక్రపాణి.

ఫైనాన్స్ కార్పొరేషన్ ఆఫీసు మేడమీదుంది.

పక్కన సందులోంచి మేడమీదికి మెట్లున్నాయి.

మేడ మెట్లెక్కుతూంటే, దడాలున తలుపుమూసి లోపల గొళ్ళెం పెట్టిన చప్పుడు వినిపించింది పైనుంచీ.

తలుపు దగ్గిర నిలబడ్డాడు చక్రపాణి.

లోపల ఏమిటో గడబిడ!

'ఛీ...వొదులూ...'

ఎవరిదా గొంతు? ...కుమారిదే!

'ఇంక తప్పించుకు పోలేవు...'

వాడెవడూ? ...శేషఫణి!

గింజుకుంటున్నట్లు ముక్కుతూ మూలుగుతోంది కుమారి.

ఒడిసి పట్టుకుంటున్నట్లు రొప్పుతూ రొజుతూ వున్నాడు శేషఫణి.

పరిగెడుతున్నట్టు ... తరుముతున్నట్టు ... కిందా మీదా పడ్డట్టు...కాళ్ళూ చేతులూ డొక్కుపోతున్నట్టు...చప్పుళ్ళు!

కుర్చీలు దొర్లాయి.

గాజులు ముక్కలై కలుక్కున కిందపడ్డాయి.

చక్రపాణి రోమాలు నిక్కబొడుచుకున్నాయి. ఒంట్లో నెత్తురు ఉరకలు పెట్టింది. గుండె గొంతుకలో కొట్టుకులాడింది. తలుపులు దబదబా బాదాడు.

సైరన్ గుయ్యిమంటూ ఆవులించింది, బ్రహ్మరాక్షసిలా.

చక్రపాణి చేతులు పడిపోయాయి.

మేత దొరికిన భూతంలా సైరన్ నోరు మూసుకుంది.

అన్ని శబ్దాలూ ఆగిపోయాయి లోపల.

సారాయి తాగుతూ నరమాంసం నంజుకుంటున్న రాకాసిలా వికటంగా నవ్వుతున్నాడు శేషఫణి.

గొల్లున ఏడ్చింది కుమారి.

ఆ ఏడ్పుకు ఉపమానమే లేదు

పాము కోరల్లో చిక్కుకున్న కప్ప—కుమారి ఏడ్చినట్టు ఏడుస్తుందేమో!

తలుపు దగ్గిరే కూలిపోయాడు చక్రపాణి.

కుమారి ఏడుపు ఆగిపోయింది.

వల్లకాట్లో చీకటి కౌగిట్లో ఒదిగిపోయిన శవంలాంటి నిశ్శబ్దం!

గోడలమీది పటాలలో కొలువుదీరిన ఇలవేలుపుల ప్రీత్యర్థం ఆమె శీలాన్ని బలిగొంటున్నాడు కుంటికాలి శేషఫణి.

చక్రపాణికి చెమటలు పోశాయి.

ఒక్క ఉదుటున మేడమెట్లు దిగాడు.

పేగులు తెగినవాడు పొట్టను చిక్కబట్టుకుని పరిగెత్తినట్లు గబగబా నడిచాడు.

ఇంటికి వెళ్ళలేదు. ఏటొడ్డుకి వెళ్ళాడు.

ఇసుక తిన్నెలమీద కూలబడి గొల్లున ఏడ్చాడు.

పాముకోరల్లో చిక్కుకున్న కప్పకంటే జాలిగా కుమారి ఏడ్చిన ఏడుపును ఎలా మరిచిపోవటం?

మరిచిపోవటానికి మందు ఏది ?

శేషఫణి నెత్తురు !

ప్రాణంకంటే పరువు గొప్పదికదా?

వాడి వేలితో వాడికన్నే పొడవాలి.

వాడి కళ్ళకు గంతలుకట్టి బట్టలిప్పేసుకుని తైతక్కలాడుతున్న వాడి పరువును వాడి కళ్ళముందు నిలబెట్టాలి.

అవమానంతో వాడు ఉడికిపోయి, ఉరేసుకోవాలి!

మళ్ళీ వెనక్కి వచ్చాడు చక్రపాణి. బయటి తాను పెట్టిన గొళ్ళెం పెట్టినట్లే వుంది.

లోపలినుంచి సన్నటి నవ్వులు వినిపిస్తున్నాయి.

పాతసినిమా పాటలు పాడుతున్నారు ముగ్గురూ.

తాగిన మైకంలో వాళ్ళ పాటలు కూడా తప్పటడుగులు వేస్తున్నాయి.

చక్రపాణి క్లబ్బువైపు పరుగందుకున్నాడు.

డబ్బు లెక్కపెట్టుకుంటున్నాడు శేషఫణి.

'అంకుల్! ఇలా రా లేచి! అర్జంట్!'

'పిల్ల నాయాలా! ఎక్కడి కెళ్ళావురా యింతసేపు?'

'నీ యింట్లోంచే వస్తున్నానుగానీ, ఆ డబ్బులక్కడ పారేసి రా! ఎంతసేపూ డబ్బుమీద ధ్యాసేగానీ, ఇంట్లో పెళ్ళానికి ఏం గతి వచ్చిందో కాస్తయినా కనిపెడుతున్నావా? సిగ్గుమాలినోడా!'

'ఏమిట్రా ! కళ్ళు తిరుగుతున్నాయా?' అంటూ చేయి పైకెత్తుకుని లేచి వచ్చాడు శేషఫణి.

'పిచ్చోడా! నామీద చెయ్యి జేసుకుంటావేం?... అక్కడ నీ పెళ్ళాన్ని నిలువుదోపిడీ చేస్తున్నారు...'

మంత్రించినట్లుగా ఆగిపోయాడు శేషఫణి.

'నిలువుదోపిడీ చేస్తున్నారా! ఎవరు?'

'పద!...చూపిస్తా!'

ముందు చక్రపాణి, వెనక శేషఫణి తొందర తొందరగా నడిచారు.

'ఒరే! పశువూ! మా అక్కయ్యను దిక్కులేనిదాన్ని చేసి, దాన్ని తోలుబొమ్మలా ఆడించావు కదూ? పరువు కోసం బలవంతంగా చచ్చిపోయిందిరా అది! ఇప్పుడు నీ పరువు కుప్పి పోయింది. లోపలికెళ్ళి చూడు. దూలానికి ఉరేసుకో!' అంటూ గొళ్ళె తీసి తలుపు తోశాడు చక్రపాణి.

సుడిగాలిలా లోపలికి వెళ్ళాడు శేషఫణి.

గుండె తెగిపోయేటంత ఆనందంతో కొండజాతి వాడిలా నృత్యం చేశాడు చక్రపాణి.

ఔట్ ! శేషఫణి ఈ రోజు ఔట్ !

గునపం తీసుకుని శేషఫణి గాణ్ణి తరుముకుంటున్నట్లే వుంది! గునపంతో వాడి రెండో కాలు విరగ్గొడుతున్నట్లే వుంది! గునపం రొమ్ముల్లో దిగేసి, నెత్తురు జుర్రుకుంటున్నట్లే వుంది!

చాల్సాలు ! చింతకాయలా వుడికి పోతున్న గుండెకు ఇంత శాంతిచాలు !

పావుగంట సేపు వేచి చూశాడు చక్రపాణి.

వాడి ఊహాలు తారు మారైనాయి.

లోపల్నుంచి ఏవిధమైన హంగామా వినిపించలేదు.

చంపుకోలేని కుతూహలంతో చక్రపాణి లోపలికి నడిచాడు.

మిత్తవ గుండెలమీద మొత్తినట్లుగా ఆగిపోయాడు.

తేళ్ళూ జెర్రులూ వాడి శరీరాన్ని తొలిచేసి, నెత్తురులోకి ప్రాకిపోయాయి. మెదడునిండా కుమ్మరపురుగులు కమ్ముకున్నాయి. వాడికి పిచ్చెత్తినట్లయింది.

ఆ పరిస్థితిని వాడు ఊహించలేదు.

ఆ దృశ్యాన్ని చూడలేకపోయాడు.

వాడికళ్ళెదుట్ట సాక్షాత్కరించిన వన్నీ నగ్న పిశాచాలు !

దగ్గరకు చేరవేయబడిన మంచాలు రెంటిమీద అడ్డంగా, వెల్లకిలా పడివుంది శయన సుందరి. మరచెంబు కోడు పట్టుకుని నేల మీద పడివున్నాడు అకిలాలి. మంచం క్రిందికి పాకుతున్నాడు బసవరాజు.

సీసా చేత్తో పట్టుకుని ముఖం మీద ఒలక బోసుకుంటూ, గోడమీదున్న గాంధీ పటం దగ్గర నిలబడ్డాడు శేషఫణి. 'ముసిలోడు ముఖం తిప్పేసుకున్నాడోయ్....' అంటూ గాంధీ వైపు చూచి, గొల్లున నవ్వుతున్నాడు.

'ఒరేయ్ ఫణీ! నా గుర్రానికి కళ్ళెం తెగిపోయిందిరా ఒరేయ్ ఇంక నీదే రాజ్యం !...' అంటూ కేక వేశాడు, మంచం కింద దూరిన బసవరాజా.

'నేను నా గుర్రమెక్కి నాంచారు దగ్గరకి పోతాను...' అంటూ గొణిగాడు, మంచం కోడును పట్టుకున్న అకిలాలీ.

'చిత్తం, చిత్తం !... నేను నా గుర్రమెక్కి మంచం మీద సవారిజేస్తాను—' అంటూ మంచం మీద పడ్డాడు శేషఫణి. మంచం కిర్రుమంది.

'జాగర్త ! మంచం యిరిగిపోతుంది...' అంది శయన సుందరి, పిచ్చిదానిలా నవ్వుతూ.

ఇందాకా యిరిగి పోని మంచం యిప్పుడిరిగి పోతుందంటే ఎర్రి మొగమా !— పరవాలేదులే !' అంటూ కొత్తనీటి వరదలా ఆమె మీదికి ప్రాకాడు శేషఫణి.

అతడిమీద — భరించలేనంత అసహ్యం వేసింది చక్రపాణికి. గాలి పోటుకు తూలిపడే వానజల్లులా వెళ్ళి శేషఫణి మీద పడ్డాడు.

'ఒరే నాలుగో జాతోడా ! నీదీ ఒక బతుకేనా ? ఇంతకంటే ఉరేసుకు చావరాదూ ? థూత్...' అంటూ అతడి మీద కలబడి కాళ్ళతో తన్నాడు. ముఖం మీద పిడిగుద్దులు గుద్దాడు.

మంచం పైన్నుంచి దొర్లిపడ్డాడు శేషఫణి.

'ఎవుడ్రా వాడు ? సెకరట్రీగాడా ?' అన్నాడు బసవరాజా, మంచం కింది నుంచి పాకివస్తూ.

తలపైకెత్తి చూచి, 'చక్రంగాడు !' అన్నాడు అకిలాలీ !

జారిపోయిన పంచెం కోసం తారాడుతూ అన్నాడు శేషఫణి. 'తాగొచ్చావేమిట్రా నీ యక్కా ! వెళ్ళిపో ఇక్కణ్ణుంచి !'

'పోతాన్రా ! నీ పీక కొరికేసి నెత్తురు తాగేసి పోతాను.' అంటూ చక్రపాణి పులిపిల్లలా దూకి శేషఫణి గొంతు పట్టుకున్నాడు. శేషఫణి వాణ్ణి విదిలించుకుని లేచి నిలబడ్డాడు. వాణ్ణి లాగి ఒక్క దెబ్బ కొట్టాడు. గోడమీదికి వెళ్ళి పడ్డాడు చక్రపాణి.

'చంపేస్తా, వెళ్ళిపో !'

వెళ్తాన్రా ! వెళ్ళి నీ బతుకంతా బజార్లో పెడతాను...'

చరచరా గుమ్మం దగ్గరకి వెళ్ళినుంచున్నాడు శేషఫణి.

అకిలాలీ, బసవరాజా చివాలున లేచి నుంచున్నారు.

మంచం మీద రబ్బరు పాములా పడుకునివున్న శయన సుందరి లేచికూర్చుంది. 'పట్టుకోండి వాణ్ణి ! చంపేయండి !'అంది

'చక్రపాణి చుట్టూ మృత్యువు మూడు కోణాలో నిలబడి. మిడిగుడ్లు మిటకరించింది.

కళ్ళు తేలవేశాడు వాడు. వాణ్ణి చుట్టుముట్టిన వాళ్ళు మనుషులు కారు. జంతువులు ! ఒకటి తోడేలు ! రెండోది ఎలుగొడ్డు ! మూడోది పులి !

'నిన్నొదిలి పెడతామనుకున్నావట్రా ?...' అంటూ వాణ్ణి ఒడిసి పట్టుకున్నాడు శేషఫణి.

రేచుకుక్కల్లా ముసురుకున్నారు ముగ్గురూ.

దబదబా బాదేశారు.

ఎముకలు పిండేశారు.

హూనమైపోయింది ఒళ్ళు.

చూర్ణమైపోయాడు చక్రపాణి.

ప్రాణం విలవిలలాడింది.

చంపేస్తారు వీళ్ళు!... ఈ మృత్యుగహ్వరంలోంచి బయట పడకపోతే, ఈ మృగాలు చీల్చి తినేస్తాయి!

జవసత్వాలుకూడదీసుకున్నాడు చక్రపాణి. వాళ్ళఉక్కు చేతుల్లోనుంచి తప్పించుకుని తుపాకీగుండులా బయటకు దూసుకు పోయాడు.

'తప్పించుకున్నాడు దొంగనాయాలు! పట్టుకో, పట్టుకో! పోనివ్వకు...' అంటూ వెంటబడ్డారు ముగ్గురూ.

జింకపిల్లలా వీధిలో పరిగెడుతున్నాడు చక్రపాణి. రేచు కుక్కల్లా తరుముతున్నారు ముగ్గురూ—పడుతూ, లేస్తూ, తూలి పోతూ. ఆ ముగ్గిరిలోనూ కుంటి శేషపణి ముందున్నాడు. అతడికి బారెడు దూరంలోనే అందీ అందకుండా పరుగుతీస్తున్నాడు చక్రపాణి.

నిద్రపోకుండా జాగారం చేస్తున్న మూడురోడ్ల కూడలిలో ఒక్కక్షణం ఆగి, తటపటాయించి, మళ్ళీముందుకు ఉరకలు పెట్టాడు వాడు. వాణ్ణి వెంబడిస్తున్న విచిత్రమృగాలను చూసి, టీకొట్లోని వాళ్ళు, బ్రిడ్జికింది బిచ్చగాళ్ళు ముక్కున వేలేసుకున్నారు.

అందరికంటే వెనక వస్తున్నఅకిలాలీ మూడురోడ్లకూడలిలో తక్కున ఆగిపోయాడు. రోడ్డు ప్రక్కన మేడచాటు క్రీనీడలలోకి చొచ్చుకుపోయాయి అతడి చూపులు.

అక్కడ రహీం నిలబడివున్నాడు, సూట్ కేసుతో.

మెడచుట్టూ పైటకొంగు చుట్టుకొని నాంచారు అతడి పక్కన నిలబడివుంది.

వాళ్ళదగ్గరికి నడిచాడు అకిలాలీ.

అతన్ని చూచి భయంతో బిగుసుకుపోయారు వాళ్ళిద్దరూ.

అకిలాలీ ఒక నిమిషంసేపు ఏమీ మాట్లాడలేదు.

ఆఖరికి యిలా అన్నాడు,

'సిగ్గుందా మీకు?'

అతన్ని ఓమారు ఎగా దిగా చూసి 'నీకుందిలే మహా...సిగ్గు! అంటూ ముఖం తిప్పుకున్నాడు రహీం.

'చీ! మీ ముఖాలు చూపించకండి నాకు! అంటూ మళ్ళీ రోడ్డుదారి పట్టాడు అకిలాలీ.

శేషఫణి పరిగెత్తలేక ఆయాసంతో ఆగిపోయాడు. వెనక వస్తున్న బసవరాజా అతణ్ణి మోదుకుని కిందపడి పైకిలేచాడు.

ఇద్దరు పోలీసులు ఎదురుగావస్తూ 'అయ్యా, నమస్కారం, అన్నారు.

'పట్టుకోండి వాణ్ణి! పాతెయ్యండి!' అన్నాడు బసవరాజా.

'అలాగే! అందుకు మేమున్నాంగా? మీకెందుకు శ్రమ?' అంటూ పోలీసులిద్దరూ చక్రపాణి వెంట బడ్డారు.

వీధి దీపాలు వెనకబడి పోయాయి.

ఊరు దాటుకున్నాడు చక్రపాణి.

ఏరు దాటుకున్నాడు.

పోలీసులు విడిచిపెట్టలేదు. తరిమి తరిమీ కొట్టారు లాటీలతో.

కాళ్ళల్లో సత్తువ చచ్చిపోయింది, చక్రపాణికి. రొమ్ములు పగిలి పోయేలా రొప్పుతూ రోడ్డు మీద కూలిపోయాడు.

పోలీసులు వాణ్ణి చెరోక తన్ను తన్నారు. వాడి జేబులోవున్న డబ్బులు లాక్కున్నారు. 'పెద్దవాళ్ళతో పేచీ పెట్టుకుంటావా? పిల్ల వెధవా! పో!' అనేసి ఊళ్ళోకి దారితీశారు.

గొల్లున ఏడ్చాడు చక్రపాణి.

ఊళ్ళోని ఒంటరి తనానికి — ఊరిబయటి కారు చీకట్ల ఒడిలో తలపెట్టి, గుండె కరిగి పోయేంతవరకు కన్నీళ్ళు కార్చాడు చక్రపాణి.

కళ్ళు తుడుచుకుని లేచి నిలబడ్డాడు.

ఊరివైపు చూచి తుపుక్కున వుమ్మేశాడు.

చీకటిలో దారి వెతుక్కుంటూ ముందుకు నడిచాడు.

వాడివెనక — ఊళ్ళోని పిరికిదీపాలు మినుకు మినుకుమంటూ అంగలార్చుతున్నాయి.

ఊరికీ వాడికీ మధ్య అంతరం ఒక్కొక్క అడుక్కీ పెరిగిపోతోంది.

వెనక నుంచీ వెలుతురు తరుము కొచ్చింది.

బస్సు హారన్ వినిపించింది.

వాడి నీడ ముందరికి సాగింది.

అడ్డంగా నిలబడి చెయ్యి పైకెత్తాడు.

బస్సు ఆగింది.

బస్సులోకి చొరబడ్డాడు.

బస్సు కదిలింది.

బస్సునిండా జనం!

ఓవర్‌లోడ్!

పురుగు మెదిలేందుకైనా సందులేదు.

ఆఖరి సీట్లో అకిలాలీ చిన్న పెళ్ళాం పక్కన అతడి పెద్ద కొడుకు కూర్చుని వున్నాడు. బస్సును అర్ధాంతరంలో ఆపినందుకు విసుక్కుంటూ చక్రపాణి వైపు చిరాగ్గా చూశాడు.

'ఎక్కడికి?' అన్నాడు కండక్టరు.

'బస్సు ఎక్కడికిపోతే అక్కడికి!'

కండక్టరు వాడివైపు చిత్రంగా చూశాడు.

'ఐదు రూపాయలివ్వు!'

జేబుల్లో చేతులు వేశాడు చక్రపాణి. పోలీసులు శుభ్రంగా వూడ్చేశారు వాటిని.

'లేదు.'

కండక్టరు ఈల వేశాడు.

బస్సు ఆగింది.

కండక్టరు తలుపు తెరిచి, వాడి మెడమీద చెయ్యివేసి కిందికి నెట్టాడు.

చాపచుట్టగా వెళ్ళి రోడ్డుమీద పడ్డాడు చక్రపాణి.

బస్సు వెళ్ళిపోయింది.

దాని మెడమీద చెయ్యేసి ముందుకు నెట్టుకుంటూ పరుగిడుతోంది చీకటి!

నేలమీద చేతులుమోపి లేచికూర్చున్నాడు చక్రపాణి.

చేతుల్తో నేలమీద దబదబా చరిచాడు.

నెత్తి నేలమీద మోపి, నిట్టూర్పు విడిచాడు.

అమ్మా, భూదేవీ! ఎంత ఓవర్‌లోడ్ మోస్తున్నావు తల్లీ! డబ్బుంటే చాలు, నీ ఒడిలో ఎందరికైనా చోటుంది ... మంచీ మమతా, దయాదాక్షిణ్యాలు, నీతీ న్యాయం వాళ్ళకు లేకపోయినా సరే! అవన్నీ వుండి డబ్బు లేనివాడికి నీ ఒడిలో స్థానం లేదు! ఆహా, నీ సహనాన్నీ, నీ సమదృష్టినీ ఆ ఆదిశేషుడే మెచ్చుకోవాలి!

చేతులు దులుపుకుని నిలబడ్డాడు చక్రపాణి.

దారీ తెన్నూ తెలియకుండా చీకట్లో ముందుకు సాగాడు.

'డబ్బు!'

'డబ్బు!'

'అందరికీ చోటిచ్చేది డబ్బు!'

'అందర్నీ రక్షించేది డబ్బు!'

'ఎక్కడుంది డబ్బు?

'ఎక్కడ దాక్కుంది?

గొణుక్కుంటున్నాడు వాడు.

ధనవంతుల్ని దోచి దరిద్రులకు పంచిపెట్టే విప్లవవీరుడు— వాడిలో పరకాయప్రవేశం చేశాడు.

## 12

ఇంకో పదిబారల దూరంలో వుంది డాక్టరుగారి యిల్లు.

ఉన్నట్లుండి ఉల్కలాగా ఎదురుపడిన వ్యక్తినిచూచి దేవముని కాళ్ళు ఆగిపోయాయి.

అతడి గుండె ఝల్లుమంది.

ఎదురుపడినవాడు, పిచ్చిదొర!

అతడి చేతిలో కత్తి!

పిచ్చిపట్టిన మృత్యుదేవతలా భీకరంగా నవ్వాడు పిచ్చిదొర. 'ఎంగిలిపాయసం తినే నాయాలా! నీ కోసమే వొచ్చా్ననా! నీలాంటోళ్ళు బతకటానికి వీల్లేదు...మెడకాయ్ నొంచూ!'

గడగడలాడిపోయాడు దేవముని

గిరుక్కున వెనక్కి తిరిగాడు.

రాముడు వేసిన బాణంలా రివ్వున పరుగందుకున్నాడు

'ఎక్కడికి పోతావురా ఒరేయ్! నీ తలకాయ్ కింద పెట్టేసి పో!' అంటూ కత్తి పైకెత్తి పట్టుకుని, కత్తి గట్టిన కోడిపుంజులా తరుముకున్నాడు పిచ్చిదొర.

మలుపు మలుపునా ఆగి వెనక్కి తిరిగి చూశాడు దేవముని. విష్ణుచక్రంలా వెన్నంటి వస్తున్నాడు పిచ్చిదొర.

వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి.

దయమాలిన వీధిదీపాలు దయ్యాల్లా నిలబడి నవ్వుతున్నాయి

దగ్గరికొచ్చేస్తున్న యముణ్ణిచూసి ధిగ్గుమంటోంది గుండె.

చచ్చిపోతున్న కుక్కలా చావుకేకలు పెట్టాడు దేవముని.

వీధులన్నీ ముసుగుతన్ని నిద్రపోతున్నాయి.

... అయ్యో, తెల్లవారి లేచి ఏ తల్లి ముఖం చూశానో, దిక్కులేని చావు చస్తున్నాను కదా! ఈ గండం నుంచి కాపాడే వాళ్ళెవరు? ఏ నీడలో తలదాచుకోను? ఎవరిని శరణువేడను?

గ్రామపంచాయతీ సర్పంచ్ — ఊరికంతా పెద్ద తలకాయ— తన కావ్య కన్యక 'స్వాతంత్ర్య లక్ష్మి'ని పరిగ్రహించినవాడు — బసవ రాజా — వాడే కాపాడాలి!

బసవరాజా దగ్గరికి పారిపోదామనుకున్నాడు దేవముని.

సంకల్పమాత్రం చేతనే సాక్షాత్కరించాడు బసవరాజా. పంచాయతీ ఆఫీసు ముందర, తూలుతూ తిరుగుతున్నాడతను. మూసేసివున్న గేటు తలుపుల్ని పట్టుకుని పైకెక్కి కూర్చున్నాడు.

గేటు ముందర నిలబడి కాళ్ళు నులుముకున్నాడు దేవముని. 'ప్రెసిడెంటుగారూ! ప్రాణం తీస్తానంటున్నాడు పిచ్చోడు! కాపాడండి!' అంటూ చేతులు జోడించాడు.

'ఒరేయ్ పాకీనాయాళ్ళా! ఈ నెల్లోకూడా మీకు జీతాల్లేవ్...' అన్నాడు, గేటుమీద కూర్చున్న బసవరాజా.

తప్పతాగి, బట్టలు విప్పేసుకుని రచ్చమీద కూర్చున్నాడు... ఇక వీడేం కాపాడగలడు?

దగ్గరికొచ్చేశాడు పిచ్చిదొర.

కాలికి బుద్ధి చెప్పాడు దేవముని.

ఇంకెవరు దిక్కు?

ఊరికంతా కుబేరుడిలాంటివాడు — శ్రీవేంకటేశ్వర శతకాన్ని అంకితం పుచ్చుకున్నవాడు — అకిలాలీ — వాడే రక్షించాలి!

అనుకుంటూ వుండగానే, అక్కడికక్కడే అవతరించాడు అకిలాలీ.

ఓ పాకముందర నిలబడి తలుపు దబదబా బాదేస్తున్నాడతను.

'ఒరేయ్ సిద్దిగా! నా కంట్లో కారం కొడతావుట్రా?... నీ కూతురు లేచిపోయిందిరా!...'

పాకలోంచి ముసలాడిగొంతు వినిపిస్తోంది.

'అది లేచిపోతే నన్నేం చెయ్యమంటావు?'

'అదంతా నాకు తెలియదు. నీ కూతురు లేచిపోయింది.'

ఎందుకు లేచిపోయింది?'

'ఎందుకో దాన్నే అడుగు!'

'ఎక్కడుందది?'

'వాడితోనే!'

'ఎవడితో?'

'వాడే! నాకు పుట్టిన్నాకొడుకు!'

'నీ కొడుకుతోనేగా లేచిపోయింది. నీ సొత్తు నీ కొడుకు తింటే, నా యింటికొచ్చా వెందుకూ?'

'అదంతా నాకు తెలియదు. నీ కూతురు లేచిపోయింది.'

దేవముని కళ్ళు నులుముకున్నాడు చేతులు జోడించాడు. 'అకిలాలీ గారూ! పిచ్చోడు వెంటబడుతున్నాడు. ప్రాణాలు కాపాడండి!'

'అదంతా నాకు తెలియదు. నీ కూతురు లేచిపోయింది.!

శ్రీ వేంకటేశ్వర శతకం లేచిపోయిందా! ఇలాంటివాణ్ణి కట్టుకుంటే లేచిపోక ఏం జేస్తుంది?

తప్పతాగి, బట్టలు విప్పేసుకుని రచ్చకెక్కాడు... ఇక వీడేం రక్షించగలడు?

దగ్గరి కొచ్చేశాడు పిచ్చిదొర.

కాళ్ళకు హితవు జెప్పాడు దేవముని.

ఇంకెవరు గతి?

తన నీతికథా గుచ్ఛానికి కృతిభర్త — శేషఫణి — వాడే ఆదుకోవాలి!

ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు నడిచివస్తున్నాడు శేషఫణి. మళ్ళీ వెనక్కి తిరిగాడతను. ముందుకు నాలుగడుగులు, వెనక్కి నాలుగడుగులూవేస్తూ పీర్లెత్తుకున్నవాడిలా తిరుగుతున్నాడు.

అతడి చేతిలో పేకముక్కలు నాలుగువున్నాయి. వాటిని పైకెత్తి పట్టుకుని, 'ట్రంపు చీట్లన్నీ మనవేరా గురూ! భయపడకు! నూరు ఆరైనా, మనదే గెలుపు!' అంటున్నాడు.

దేవముని కళ్ళు నులుముకున్నాడు చేతులు జోడించాడు 'శేషఫణిగారూ! పిచ్చోడు చంపుతానంటున్నాడు. ప్రాణభిక్ష పెట్టండి!'

'ట్రంపు ముక్కలన్నీ మనవేరా గురూ! దిగులుపడకు! ఆరు నూరైనా మనదే గెలుపు!'

తప్పతాగి, పంచె ఎక్కడో పోగొట్టుకుని, పైన చొక్కాతో బజార్న పడ్డాడు... ఇక వీడేం ఆదుకోగలడు?

దగ్గరి కొచ్చేశాడు పిచ్చిదొర.

కాళ్ళకు కొరడా తగిలించాడు దేవముని.

ఇక దేవుడే దిక్కు !

రామా! కృష్ణా! కేశవా! మాధవా! గోవిందా! నారాయణా! దీనబంధో! దయాసింధో!

గుడిదగ్గర ఆగాడు దేవముని.

గుడి తలుపులు మూసివున్నాయి.

తలుపుల దగ్గర సాగిలబడిపోయాడు.

'భక్తపావనా! పిచ్చోణ్ణి చంపేసి, నా ప్రాణాలు నిలబెట్టు తండ్రీ!'

గుడిలోంచి దేవుడు కదిలి రాలేదు.

దగ్గరి కొచ్చేశాడు పిచ్చిదొర.

చెంగున లేచి ప్రాకారం చుట్టూ పరిగెత్తాడు దేవముని. పిచ్చిదొర కూడా ప్రదక్షిణం ప్రారంభించాడు.

దేవమునికి నీరసం వచ్చేసింది. బట్టలు చెమటతో తడిసి పోయాయి. వగర్పుతో గుండె గుల్లబారిపోయింది. ఏడుపు గొంతుక లోకి పొంగి వచ్చేసింది.

పరిగెడుతున్నాడు. పాదాలు పుండ్లయిపోయినై. కాళ్ళు మెలి కలు పడుతున్నాయి.

పిచ్చిదొర బారెడు దూరంలోకి వచ్చేశాడు!

మూరెడు దూరంలోకి వచ్చేశాడు!

మెడమీద కత్తి !

మెడకూ కత్తికీ మధ్య వెంద్రుకంత దూరం!

బేరుమన్నాడు దేవముని.

ఒక్క ఊపున పోలీస్ స్టేషన్‌లోకి చొరబడ్డాడు. సరాసరి కొట్లోకి దూరిపోయి, కమ్ముల తలుపు మూసేసుకుని, బాబ్బాబూ! మీకు పుణ్యం వుంటుంది! బయట తాళం పెట్టేయండి! బతికి నంతకాలం యిక్కడే వుండిపోతాన్నేను!, అంటూ ప్రాధేయ పడ్డాడు. పోలీసులు తెల్లమొహాలు వేశారు

గేటు దగ్గిరే ఆగిపోయాడు పిచ్చిదొర. కొట్లోదూరి తలుపు మూసుకున్న దేవమునిని చూశాడు పగలబడి నవ్వాడు. 'ఎంగిలి తినే నాయాలా! నువ్వుండాల్సిన చోటేదో తెలుసుకున్నావ్‌గదూ? అక్కడే వుండు ఆఖరుదాకా!''

కత్తి భుజాన వేసుకుని, తిరుగుముఖం పట్టాడు

మఠం దగ్గర వీధిదీపంకింద ముసలాడి శవం పడివుంది.

శవం దగ్గరికి నడిచాడు పిచ్చిదొర.

తలవైపున కూర్చున్నాడు.

కీచురాయిలా గుయ్యిమంటూ ఏడవటం మొదలెట్టాడు.

'రోడ్డు పక్కన, దిక్కులేని చావు చచ్చావా దేవుడో...'

పిడికెడు మెతుకులైనా లేకుండా కడుపుమాడి చచ్చావా దేవుడో...'

చింకిపేలికైనా లేకుండా చల్లో కొయ్యబారి చచ్చావా దేవుడో...'

కర్ర నేలమీద తాటిస్తూ వస్తున్నాడు గూర్ఖావాడు.

'హారా హుషార్!'

వీధుల్లో పీనుగులున్నాయి,

'హారా హుషార్ !'

చచ్చిన పీనుగులు లేచొచ్చి కన్నాలు పెడతాయి,

'హారా హుషార్!'

పేటలో పిచ్చివాళ్ళు తిరుగుతున్నారు,

'హారా హుషార్!'

పిచ్చివాళ్ళొచ్చి పీకల్నురిమేస్తారు,

'హారా హుషార్!'

పిచ్చిదొర పైకి లేచాడు.

'మనుషుల్ని తినే మృగాలు వీధుల్లో తిరుగుతున్నాయి' హారా హుషార్! గోచిపాతల్లేని కొరివిదయ్యాలు కోతుల్లా ఆడుతున్నాయి; హారా హుషార్!' అంటూ గొంతెత్తి కేకలు పెట్టాడు.

వీధిదీపం బిక్కు బిక్కుమంటోంది—అదనపు ఊలాలకోసం ఎదురుచూచే పరాజితుడిలా!

[ అయిపోయింది ]



శ్రీ మాదిరాజు రంగారావు

# అధివాస్తవిక చిత్రం

భౌతిక మానసిక భూమికల్లో నిర్మాణ శిల్పం కలిగిన కవిత ''మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళ్లుతున్నాను.'' ఈ ఖండిక చివరి పాదమే దీని శీర్షిక. ఇందులో కవి ఒకపాత్రగా కన్పిస్తాడు. దీని నిర్వహణం, వ్యక్తావ్యక్తమైన మనస్స్థితిలో వ్యంగ్యవిలసితమైంది. కవి మనస్తత్వచిత్రణాత్మకమైన నిర్మాణ ప్రతిభను దర్శింపజేసేది.

ఇందులోని బాహ్యమైన రూపంవేరు. ఆంతరమైన రూపం వేరు. చదువుతూంటే సామాన్యార్థం వెనుకనుండి విశేషార్థస్ఫూర్తితో మనస్సునావరించిన ఆశావహమైన కాంతి రూపం అనుభవానికి వస్తుంది. మధ్యమధ్య అమూర్త (abstract)మైన లక్షణమూ లేక పోలేదు. రచన సాంద్రమైన (Intensive)భావ రూపాలతో కూడి ఉన్నా, ప్రతీకాత్మక (symbolic) గతిలో కవినేర్పువల్ల అక్లిష్టంగా ఆవిష్కృతమైంది. స్పష్టత దాశరథి సహజమైన కవితాగుణమైనా భావనలో గాఢత్వం సిద్ధింప జేసేప్పుడు, అర్థాంతరం విశేషమైన స్ఫూర్తి చకితంగా ఉండాలనుకున్నప్పుడు ఏదో ఒకవిధంగా స్పష్టతపై మంచుపొర ఆవరించకతప్పదు. ఇదేప్రతిభా కాంతి ప్రసారంచేత ఒకవిధమైన అందాన్నీ, అనుభవవిశేషాన్నీ ఒక దశలో కలిగిస్తుంది ఈ లక్షణం అర్థాంతరానికి గభీరతను కలిగించేంతవరకు, గుణంగానే పర్యవసిత మౌతుందనడంలో సందేహం లేదు. కవి ఉద్దేశాన్నిబట్టి దోహదకారిగా పరిణమించడ మన్నది మనస్తత్వ ప్రధానమైన కవితలో ఉన్నదే.

ఈ కవిత చదివేప్పుడు అనుభవ ప్రసారకాంతిలో విశేషార్థం స్ఫుటమౌతూఉంటుంది. ఒక ఆలోచన తరువాత మరొకటి తరంగాల వలె క్రమిస్తూ, ఒదవడం ముగించగానే తీరానికి చేరినట్లుంటుంది. ఇదిమొదటి దశ. రెండోది—తీరంచేరగానే మనస్సులో కదలే ప్రయాణానుభవస్మృతి చిత్రం వంటిది. ఫ్రాయిడ్ చెప్పిన పూర్వచైతన్య (preconscious) దశలోని అక్షణం ,అక్షణం ఒక విషయం తెలిసి ఉండకపోయినా మరోక్షణంలో వెంటనే బుద్ధికి గోచరించే అనుభవ రూపం గుర్తించవచ్చు.

## II

''చెట్లు నడిస్తే ఎంత భయంకరమో
అట్లా చీకట్లు నడుస్తున్న ఈనాడు
అంతా నిదుర పోతున్నారు నీడల్లో
కాల రాక్షసి అడుగ జాడల్లో''

చీకట్లు నడుస్తున్నవి. ఈ భావచిత్రం, కవితాకృతియొక్క ఆరంభ రేఖ. చీకట్లు ఎప్పుడునడుస్తున్నవి ? ఈ నాడనిసమాధానం చీకటి వచ్చేది ప్రకృతిలో. రోజూ సూర్యాస్తమయం తరువాతనే ఈనాడేమిటంటే, కవిఇక్కడ సాధారణమైన సమయఖండాన్ని అధిగమించి దేన్నో ఉద్దేశిస్తున్నట్లు స్పష్టం చీకటి దేన్నీ కన్పించనీయదు. అందుకని ఏదీ కన్పించకుండానే సమయం గడిచిపోతూంది. ఇద మిత్థమని వివేచించడానికి వీల్లేని అజ్ఞానాకృతి చీకటి. ఏమీ కన్పించకపోతే మానేరనుకుంటే, అలా సరిపెట్టుకోనివ్వకుండా భయపెడుతూన్నవి. ఈ భయం గాఢమైయింది తీవ్రమైంది. దీన్ని ఒక ప్రమాణంలో కవి భావించడం జరిగింది అదే చెట్లు నడిస్తే! ఒకచోటు నుండి మరోచోటికి; మరేమన్నా ఉందా ? ఇది జరిగేది కాదు, కాని జరిగితే! చమత్కారంగా ఊహిస్తే ! మెదలేది ఆశ్చర్యకరమైన ఘటన యొక్క ఘోరమైన దృశ్యం ! అందువల్ల ప్రకృత భయావహస్థితిని స్ఫురింప జేసే భావచిత్రం, గాఢమైన రేఖలతో ప్రస్తుతమైంది.

అజ్ఞానంవల్లనో భయంవల్లనో అంతా నిదుర పోతున్నారు ఎక్కడ ? అన్న ప్రశ్నకు సమాధానం కాలరాక్షసి అడుగు జాడల్లో అన్న మరో భావచిత్రం అనుసరిస్తుంది సమయం యొక్క సుదీర్ఘమైన రూపం కాలం. ఇక్కడ కాలం రక్షస్స్వభావాన్ని వహించి ఉంది ఇదీ భయదమైన క్రూరమైన తత్వాన్ని సూచించేది. కాలం ఆగేనా ? నడుస్తూంటేనే అడుగు జాడలేర్పడేది. ప్రజలు ఎక్కడ వాళ్ళక్కడ నిశ్చలంగా పడి ఉన్నారు. ఇది వారి విభీతమైన అశక్తమైన, మనస్స్థితిని సూచిస్తూంది.

అందరూ నిదుర పోతూంటే, ఎక్కడో ఎవ్వడో మేల్కొన్నాడనీ ఎవడో అన్నమాట. అర్ధరాత్రి మేల్కొనే దెవడు ? అన్న సంశయంతో విశ్వాసం కుదరలేదు. అయినా చూచి రావడం మంచిదని బయలు దేరాడు. అయితే చిత్రంగా ఒక అనుమానం వచ్చింది. అది ఇతడు మాత్రం మేల్కొని ఉన్నాడనా ? లేదు ఇదీ కలలోని ప్రస్తావనే,

''కలలో నైనా మేల్కొన్న వాణ్ణి చూడ్డం
ఘన విషయం కాదా ? ఈ నాటి లోకంలో''

అని చమత్కారమైన సమాధానంలో మెలకువ ఎక్కడా సంభవం కాదన్న యథార్థస్థితి వివృతమైంది ఇదంతా కలలోని మాటే. దీన్ని ఇలాసమర్థిస్తాడు కవి. మేల్కొన్నవాడే కరువైనపుడు కలలోనైనా మేల్కొన్న వాణ్ణి చూడడం గొప్ప విషయమేను. ఈ మాట వ్యక్తావ్యక్తమైన మనస్స్థితిని సూచించేవి. ఒక్కొక్కపుడు

మనస్సు స్వప్నం లేదా స్వప్నతుల్యమైన స్థితిని పొందే అనుభవ లక్షణాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకో వలసి ఉంటుంది.

శవం బ్రతకడమెంత విచిత్రమో మనం మేల్కొడమూ అంతే నంటాడు. శవం బ్రదకడం అనూహ్యమూ అసాధ్యమూ ఐన విషయం. ఇది ఊహ్యమూ, సాధ్యంగా పరిణమించడం శవ సదృశమైన స్థితిని స్ఫురింపజేస్తుంది. ఇదీ అసాధారణమైన ఘటనా విశేషమే.

"ఎవడో కొత్తరకం మేటి వైద్యుడు
ఏదో కొత్త తరహా ఔషధం వాడి ఉండాలి"

లేనిది ఇన్నాళ్ళుగా అలముకొన్న నల్లమందు మత్తులో పడి ఉన్న వాళ్లు ఒక్క మారు చీకటిలో అర్ధరాత్రి మెలకువతో వెలుగులై క్రమించడం సాధ్యంకాదు. ఈ భావ చిత్రం ఈ ఖండికకు తుది రేఖగా కన్పిస్తుంది. మొదట చెప్పినట్లు మంచు పొరవలె నున్న అస్పష్టత క్రమంగా పూర్తిగా విచ్చి పోవడం గమనించవచ్చు.

"ఏమైతేనేం వెళ్ళి చూచిరావడం మంచిది
మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళ్ళుతున్నా"

ఈ ఔషధం కొత్త తరహాది. అమృత తుల్యమైంది. కొత్త జీవనాన్ని ప్రసాదించేది. వైద్యుడూ కొత్తరకానికి చెందిన మేటి! దీన్ని ఉపయోగించే విధానమూ బాగా తెలిసిన వాడు. కవి స్వయంగా ఒక పాత్ర రూపంలో మనస్స్థితిని వ్యాఖ్యానించడం, వస్తువును ఎక్కడికక్కడ, సంశయం పరిష్కారం; ప్రశ్న సమాధానంతో అల్లుకొని పోతూ రహస్యాన్ని చీకటిలో వెన్నెలవలె ప్రకాశింప జేసిన తీరు రచనా శిల్పం దృష్ట్యా విచిత్రమైంది. దీన్ని గురించి ఆలోచిస్తే నాకు దొరికిన సమాధానం ఇది.

అంతరమైన సంభాషణాత్మక నిర్వహణం మొట్ట మొదట పై శిల్పానికి ఆధారం. తరువాతది అంతశ్చైతన్యంలోని ఆలోచన, అనుభవ దశ్యంగా రూపుదిద్దుకోవడం. వీటితో పాటు మరికొన్ని అంశాలు: 1. అధివాస్తవిక తరంగ ధోరణిని గుర్తింప జేయడం: స్వప్నం లేదా స్వప్న తుల్యమైన దశలను వ్యాఖ్యానించి ప్రాముఖ్యాన్ని వహింపజేయడం, ఉంది (2)మనస్సులోని రహః ప్రదేశాలపై వెలుగు ప్రసరింపజేసి అక్కడ గుప్తంగా ఉన్న ఆలోచనా రూపాలు ఆవిష్కరించడం జరిగింది. (3) మనస్సును సాధారణమైన లౌకిక నియమాలనుండి విముక్తం చేసి స్వేచ్ఛగా సంచరింపజేసి బహిర్ (Exterior) వాస్తవికతను,. అంతర్ (Interior) వాస్తవికతను సమైక్యపరచిన అనుభవదశ చిత్రితమైంది. కవి మనస్సులో చిత్రార్పితమైన కవిత్వం వెనుకదాగిన ఆలోచనా విధానం ఇది.

# III

ఇప్పుడొక్కమారు ఈ ఆలోచనా తరంగాలు దాటి తీరానికి వస్తే కన్పించే ప్రతిబింబంవేరు చిరకాలంగా దాస్యంలో మగ్గే జాతి భయదమైన స్థితీ, నిరభిజ్ఞకమైన జీవితం గడిపే దుర్దశా రూపం, మనస్సు పొరలో మెదలుతుంది. వందల ఏండ్లుగా కాలం నిరంకుశంగా గడచిపోతూంటే చరిత్రలో చీకటి దారుల్లో వ్యక్తిత్వ రహితంగా జడ ప్రాయంగా మత్తుగా పడి ఉన్న జాతి జీవనంలో ఒక్కమారు గాంధీ మహాత్ముని ప్రబోధంతో విరిసిన చైతన్యం కళ్ళ ముందు సాక్షాత్కరిస్తుంది. ప్రాణం పల్లవించి, స్వేచ్ఛ, సాహసం త్యాగం మొదలైన ఉదారగుణాలతో రాశీభూతమైన వ్యక్తిత్వం వచ్చింది. ఇది కలలోని మాటా ? అన్నంతగా నమ్మడానికి శక్యం గాని ఆశ్చర్యకరమైన వాస్తవరూపాన్ని ధరించింది.

భౌతికంగా మేల్కొని ఉన్నా మానసికంగా ఇంకా నిదుర పోతున్న జాతి మనస్తత్వం భావితమైంది. చిరకాలంగా దాస్యంలో మగ్గిన జాతి జీవనంలో శుభోదర్కమైన సమయానికి నాందిగా అమృతక్షణం వచ్చింది! స్వాతంత్ర్యం సిద్ధించింది. ఈ ఊహకు బలమైన కారణం, 'అర్ధరాత్రి మేల్కోవడం., మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది అర్ధరాత్రే కదా! స్వాతంత్ర్యం సిద్ధించినా జాతి మానసికంగా ఇంకా పూర్తిగా నిద్రావస్థను వీడ లేదన్న భావమూ సూచితమైంది. సంపూర్ణమైన జాగ్రత్ స్థితిని పొంది ఉదయబింబం చూడవలసి వుంది, ప్రయాణంసాగించవలసి ఉంది. భౌతికమైన మానసికమైన, అవస్థల్లోని యధార్థరూపాలు ఒకదానితో మరొకటి సంబంధంకలవే. రెండూ కలిసి భవిష్యత్తును తీర్చే ప్రయోజనాన్ని అభిలషిస్తాడుకవి. శవ సదృశమైన స్థితి నుండి మేల్కొల్పే కొత్త తరహా ఔషధం, జాతిని ఉత్తేజితం చేసేది. దీన్ని ఉపయోగించే నేర్పుగల గొప్ప వైద్యుడు మహాత్ముడు. కాకపోతే దీన్ని ఒక స్థలానికీ కాలానికీ పరిమితంచేయకుండా ఉంటే ఈలాంటి స్థితిలోనే మరో మహాపురుషుడు కావచ్చు. ఇక్కడ పేరూ పేర్కొనక పోవడంతో భావకుని ఊహ అపరిధీకృతమై, రచన విశ్వజనీనత్వాన్ని పొందుతూంది

వ్యక్తి వికాసంలోనే జాతి అభ్యుదయం, మానవాళికి భవితవ్యం ! ఇక్కడ నిఖిల మానవచైతన్యరూపం (Spirit of man) కవి వైయక్తిక దర్శనంలో వ్యక్తమైంది. వ్యక్తుల సమాహారమే సమాజం కాబట్టి వైయక్తిక (Individual) చేతన నుండి సామూహిక లేక సామాజిక (Social) చేతన పరోక్షంగా ఆవిష్కృతమైంది. ఇందులో వ్యక్తి చేతన సాధనంగా (Poeticaction) కవితా గతిసాగింది. ఈ కవిత కొన్ని భావచిత్రాల సంకలనం. మధ్య మధ్య ఒక పాత్ర రూపంలో కవి వ్యాఖ్యానమూ ఉంది. కవితా రేఖలతో మానసికమైన అంచలాలు స్పృశిస్తూ స్మృతిచిత్రాన్ని బింబించే అధివాస్తవిక కళా రూపం, "మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళ్ళుతున్నాను."

# కలగూరగంప

## కాశీవిలాస క్రియాశక్తి

'భారతి' సెప్టెంబర్ (పుటలు 29, 36) నెల సంచికలోని శ్రీ శర్మగారి వ్యాసం విద్యానగర స్థాపనకు ప్రేరకులు క్రియాశక్తి కాదని, కులగురువు, రాజగురువు అసలేకాదని, విద్యానగర స్థాపన విద్యారణ్యుని ప్రేరణవల్లనే జరిగిందని, బుక్కరాయలకు కుల గురువు, రాజగురువు విద్యారణ్యుడే అని తీవ్రమైన వాదధోరణిలో నడచింది. అందులో కొన్ని వాక్యాలకు వివరణ ప్రయత్నం ఇది.

(1) రాజగురువు అనగా రాజుయొక్క గురువు కానక్కర లేదు. గురువులలో ప్రధాన గురువు అని కూడా చెప్పకోవచ్చు. (రాజరాజువలె)

(2) హేమాద్రి మంత్రిపేర శాసనాలు లేవన్నారు. ఉన్నాయి. చూ. తానాప్లేట్స్. రాయల్ ఏషియాటిక్ జర్నల్. 5. 183. ఆవిధంగానే కృష్ణరాయశిరః ప్రధానుడు సాళ్వ తిమ్మ రుసు పేర అనేక శాసనాలు వెలువడినాయి. ఓపిక ఉంటే దక్షిణదేశ శాసన సముచ్చయ సంపుటాలు, రంగాచారిగారి లిస్టు, తిరుమల తిరుపతి దేవస్థాన శాసనావళి తిరగవెయ్యండి.

మాధవు సాయణులకు అగ్రహారాలు లేవన్నారు. సాయణు లకు 1376లో నెల్లూరి జిల్లా కావలి తాలూకా కావలికి నైరృతి భాగంలో ఉన్న బ్రాహ్మణక్రాక గ్రామంలోని కొన్ని వృత్తులు ఇచ్చి నట్లు

''యో భీష్యకృద్ధీమాన్
మాయణాచార్య నందనః
అసౌ శ్రీ సాయణాచార్యో భారద్వాజో యజుర్నిధిః''

అనే పంక్తులు శిలోట్టంకితాలయినాయి. ('భారతి' క్రోధన ఫాల్గుణ పుటలు 33–95) శాసనాధారాలు లేవని ఆవేశంతో రాసిన వాక్యాలు సత్యదూరమైనవని మనవి చేసుకొంటున్నాను.

దేశ చరిత్ర రచనకు శాసనాలూ, తరువాత సమకాలీన విదేశ, స్వదేశ పర్యటకుల రాతలూ, వాఙ్మయం పరమ ప్రామాణికమైన ఆధారాలు. అవి ఉత్తరోత్తర బలీయాలు.

(3) కాశీవిలాస క్రియాశక్తి సమాసానికి అర్థాలు రాయటం వ్యర్థం.

ఈ క్రియాశక్తి గురువులు కాశ్మీర దేశాన్నుండి వచ్చిన కాలముఖ శైవాచార్యులు. వారి ప్రధానపీఠం కర్ణాటదేశంలో బలి గ్రామంలోని కేదారేశ్వరమఠం. వీరు రాజగురువులు. వీరశైవ విజృంభణంలో కాలాముఖ మఠంయొక్క వైభవ ప్రాభవాలు సన్నగిల్లి పోయినాయి. రాజాదరణ తగ్గినది. కాలాముఖ దేవాలయాలు వీరశైవ దేవాలయాలుగా మారిపోయాయి. కాని పీఠాలు, గురు పరంపర మిగిలిపోయాయి. (పుష్పగిరి, శ్రీశైలం) విజయనగర రాజ్యస్థాపన ఇటువంటి తరుణంలోనే వెలిసింది. శ్రీనాథుడు తన కవిసార్వభౌమ బిరుదం చంద్రభూషక్రియా శక్తివద్ద పొదుకొల్పితి నని చెప్పకొన్న చంద్రభూష క్రియాశక్తి కాశీవిలాస క్రియాశక్తి శిష్యుడు. (చూ. వివరాలకు: కీ. శే. నేలటూరి వేంకటరమణయ్యగారి 'వాఙ్మయ వ్యాసమంజరి.')

ఇంతకీ వ్యాసంలో విద్యారణ్యుడే విజయనగర స్థాపనాచార్యు డని, కులగురువని, రాజగురువని స్పష్టంగా నిరూపితం కాలేదు. ఆ సమస్య శాసన వాఙ్మయాధారాలను సుష్ఠుగా పరిశీలించిన పరి శోధకులకే కొరకరాని కొయ్యగా నిలిచినది.

*శ్రీ సుందరేశ్వరరావు*

## బిందువూ - బంధువూ

సెప్టెంబర్ 1977 ''భారతి''లో శ్రీమతి కృష్ణకుమారి గారు 'బిందువూ–బంధువూ' అనే రెండు పదాలని ఇద్దరమూ [శేషేంద్రశర్మగారూ, తనూ] వచన పాదాల్లో వాడడం అనుకరణ కాదనీ, ఆ పదాలు ఎవరిసొత్తూ కావనీ వాదించారు. అసలు కవిత్వ మంటేనే పదాలని విశిష్టంగా కూర్చడం. పూర్వం రాజులు నాణేలు ముద్రించినట్లు, భాషలో ప్రతిభావంతుడైనకవి, తన పదబంధాలని ముద్రించి చలామణీ చేస్తుంటాడు. ఇక్కడ 'బిందువూ–బంధువూ' అనేకూర్పు, లేక ముద్ర శర్మగారిది! దాని అనుకరణ శ్రీమతి కృష్ణ కుమారిగారిది అని చెప్పక తప్పదు. ఇదొక్కటేకాదు, అదే పద్యంలో ఆమె ''ఇంతగా పేరిన తిమిరంమీద సమరం చాటిస్తున్నా''అన్నారు. ఇందులో 'తిమిరం–సమరం' అనేది శ్రీదాశరథి ముద్రవేసుకొన్న పదాల కూర్పు! కాదని ఆమె అనగలరా? శ్రీదాశరథి పుస్తకం, అందులో ''తిమిరంతోసమరం,'' అనే ఖండిక, 1973లో ముద్రణ. శ్రీమతి కృష్ణకుమారి ఖండిక 1975 జనవరిలో వచ్చింది. ఇంతే కాదు, శ్రీశ్రీ తన ''మహాప్రస్థానం''కావ్యాన్ని ''కొంపెల్ల జనార్దన రావు కోసం'' అంటూ వ్రాసిన అంకితం ఒక గొప్పఎలిజీ. శ్రీమతి కృష్ణకుమారి, డా॥ శ్రీదేవి మరణించినప్పుడు వ్రాసిన ఎలిజీలో ''తలవంచుకు వెళ్లిపోయావానేస్తం'' అనే మాటని ఎలా అనుకరిం చారో ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు! ఇలాంటి అనుకరణలు గర్హ్యము అని చెప్పడం లేదుగానీ, అనుకరణచేసిన కవియొక్క ప్రతిభకూ, విశిష్టతకూ ఇలాంటివి కొరత తెచ్చిపెడుతూనే ఉంటాయి. ప్రతిభ వంతమైన, తనదైన, కవిత్వం వ్రాయగల్గిన శ్రీమతి కృష్ణకుమారి ఇటువంటివి ఎరువుతెచ్చుకోకుండా, వాటిని బుద్ధిపూర్వకంగా యిక మీదనైనా పరిహరిస్తే ఆమె కవిత్వం మరింత రాణిస్తుంది! అంతే గానీ 'భాష ఒకరి సొమ్ము కాదు,' అంటూ వాదించడంలో సబబు కన్పించదు! కవి తనదైన భాషను సృష్టిస్తాడు. ముఖ్యంగా పద బంధాల్లో. పెద్దన, శ్రీనాథుని ముద్రపడిననాణేలు ఎన్నో వాడ

కున్నాడు. ఆ సంగతి ఈనాటికీ మనంగుర్తిస్తున్నదేకద! అందువల్ల శ్రీమతి కృష్ణకుమారి వాదం చెల్లదు.

పై విషయం ఎలాఉన్నా, శ్రీమతి కృష్ణకుమారి, శ్రీశర్మ గారి పద్యాన్ని దుమ్మెత్తి పోయడం, అది సహృదయత లోపించడమే కాదు, చాలా అసందర్భంగా కూడా ఉన్నది. ''మండేసూర్యుడు,'' ఖండికలో సూర్యుడు దేనికి ప్రతీకయో, శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారు,శ్రీశర్మగారి కవితాసంపుటికి,[ఎమెస్కోపాకెట్‌బుక్స్.1975] వ్రాసిన పరిచయంలో చెప్పేఉన్నారు.''మానవుడు శ్రమజీవి, ప్రేమ జీవి, వేదనాజీవి. మానవ చరిత్ర ఒక సముద్రం· కానీ మానవుడూ మానవతానిర్వచనానికి అందవు. మానవుడు 'చెప్పిచేసే' శిల్పంకాదు ఎప్పటికప్పుడు రూపుదిద్దుకొనే ఒక సృజనాత్మకశక్తి. మానవునిలో ఉండి, మానవతగా అభివ్యక్తమయ్యేశక్తి,—దీనికీ, ప్రాణికోటికి జీవనాధారమైన సూర్యరశ్మికీ,తాదాత్మ్యం ఊహించినప్పుడు మండే సూర్యునికీ, జాగృతమై ప్రజ్వరించే కవి హృదయానికి గల తాదాత్మ్యం మనకు బోధపడుతుంది.'' ఈవ్యాఖ్యానంతో ఖండికను అన్వయించుకొనే ప్రయత్నం చేస్తే శ్రీమతి కృష్ణకుమారి లేవ దీసిన సందేహాలు, ప్రశ్నలు, అన్నింటికీ సమాధానం లభిస్తుంది. చెమట బిందువు అంటే మానవుని సృజనాత్మక శక్తి పొందిన ఒకానొక రూపం, అంతేగానీ ''కవి'' కాదు! ఈ సృజనాత్మక శక్తి,— ''సింధువంత చరిత్ర నా పిడికిట్లో ఉన్నా చెప్పకుండా మనిషిని చెక్కిన శిల్పిని'' అన్నప్పుడు అది కేవలం సృష్టిహేతువైన పరా శక్తిఅనీ చరిత్రనుంచీ దానిలక్ష్యాన్నీ, నైనాన్నీ నిర్వచించడం, సాధ్యం కాదనీ అర్థం. సృష్టికి హేతుభూతమైన శక్తే, మానవుని ఆశల్లో, ఆశయాల్లో, విప్లవచైతన్యంలో, నిరాశలో, నిస్పృహలో, అన్నింటా అనంతముఖాల దర్శన మిస్తున్నది అని కవి హృదయం ఒకవైపు విప్లవ చైతన్యం, మరొకవైపు నిరాశా నిస్పృహ, ఈరెండింటి మధ్యా దేశ చరిత్రని నెమరు వేసుకొంటూ దేశమాతపాదాలు పెనవేసుకొంటున్న కవీ,అతని కవిత్వమూ తర్వాతి వాక్యాల్లోఉన్నాయి.

[''స్మృతులతో అల్లిన పైట చెరగు పట్టుకొని, నా దేశం పాదాలు పెనవేసుకొంటున్నా''] శ్రీమతి కృష్ణకుమారిగారు ఇక్కడ ''చెమట బిందువు ఆడా, మగా ?'' అంటున్నారు. చెమట బిందువుని ప్రతీకగా అర్థం చేసుకున్న సహృదయమేనా ఈ ప్రశ్నవేసేది? తర్వాత ''పంచల మంచు బిందువులై వ్రేలాడుతున్నారు'' అనడంలో త్యాగమూర్తులైన దేశభక్తులూ, కన్నీటి బిందువులూ, ప్రాతఃకాలపు నైర్మల్యం - ఇలా ఎన్నో స్ఫురిస్తాయి. ఇది ప్రతీక కవిత అనే అవగాహన లేకుండా ఏమిటేమిటో వ్రాసుకుపోయారు. ''ఇది తెలుగు భావమా ? తెలుగుగుండె రూపుకట్టించే భావమా?'' అని ప్రశ్నించారు. అసలు తెలుగుదనం అంటే వీరి అభిప్రాయ మేమిటి ? — మొదట్లో మనవి చేసినట్లు భాషలో చలామణీ అయ్యే పాత నాణేలని మాత్రమే ఉపయోగించుకోవడమా ? కవి క్రొత్త నాణేలని ముద్రిస్తాడు. తద్వారా భాషను సంపన్నం చేస్తాడు. అందువల్ల ''తెలుగుదనం'' అనేదేమిటో ? అది నిత్య నూతనమా లేక నిర్జీవమైన పదార్థమా ? ఎవరికి వారు సహృదయతతో తేల్చుకోవలసిన సంగతి.

''ఇదిగో నాది ఇనుప పిడికిలి. కాలపు కఠిన శిలల్లోంచీ కాంతిజ్వాల త్రవ్వి తీస్తా''. ఇక్కడ ఇనప పిడికిలి వజ్రసంకల్పాన్ని సూచిస్తుంది. ఎవ్వరి సంకల్పం? అంటే సృజనాత్మక శక్తియొక్క సంకల్పమే ! అంతేగానీ పిడికిలితో కాంతిజ్వాల త్రవ్వి తీయడం అనే వచనం తాలూకు అన్వయం కుదరదు. అది తర్వాతి వాక్యం కదా !

సముద్రం ఒక్కటే ఐనా ఎన్నో సముద్రాలూ ఉన్నాయి. చరిత్ర ఒక్కటే ఐనా ఎన్నో చరిత్రలూ ఉన్నాయి. నీళ్ళు ఒక్కటే ఐనా ఎన్నో నదులూ ఉన్నాయి. ఇక్కడ 'నదులు' ఉద్యమాలకూ, 'సముద్రాలు' చరిత్రలకూ, ప్రాతినిధ్యం వహిస్తున్నాయి.

'సీతాకోకచిలుక' అంటే వర్ధమాన కవులకు ప్రతీక. పువ్వు అంటే ప్రవృత్తి లేక ఆశయం అని అన్వయం. శ్రీ శర్మగారి ప్రతీక కవితలో ఉన్న గొప్ప లక్షణం ఏమిటంటే ప్రతీకలు మారక పోవడం. అంటే 1974 లో వ్రాసిన ''మండే సూర్యుడు,'' 1976 లో వ్రాసిన ''నీరై పారిపోయింది'' — ఈ రెండు కవితల్నీ దగ్గర పెట్టుకొని పరీక్షించితే, ప్రతీకల వ్యంగ్యార్థంలో సమన్వయమే ఉన్నట్లు తెలుస్తుంది. సీతాకోకచిలుక, పువ్వు — ఇలాంటి ప్రతీకల అర్థాలు రెండింటిలోనూ ఒకటే !

శ్రీమతి కృష్ణకుమారి వ్రాసే కవిత్వం, వచనం తాలూకు అన్వయంతో ఉంటుంది. శ్రీ శర్మగారి కవిత్వం ఫ్రెంచి సింబలిస్టుల ప్రతీక పద్ధతిలో ఉంటుంది. దీన్ని ''మండూక ప్లుతి'' అన్నా బాధలేదు ! మరి అన్వయ పద్ధతిలో ఇంత భేదం ఉందని తెలిసికూడా శ్రీమతి కృష్ణకుమారి, శ్రీ శర్మగారి కవిత్వంమీద దాడి చేయడం భావ్యమేనా ?

**కూమారి. భవాని**

# లేఖలు

## కళింగాంధ్రంలో సాహిత్య వికాసం : గోష్ఠి

డా. బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను ఇటీవల అనకాపల్లిలో జరిగిన కవితా సమితి స్వర్ణోత్సవ సందర్భంగా కళింగాంధ్ర సాహిత్యంపై ప్రత్యేకమయిన గోష్ఠి జరిగింది. ఈ గోష్ఠికి స్థానిక కళాశాల చరిత్రాధ్యాపకులు శ్రీ తల్లాప్రగడ సత్యనారాయణమూర్తి అధ్యక్షత వహించిరి. వారు తమ ఉపన్యాసంలో కళింగాంధ్రంలో సాహిత్యం ఎలా అభివృద్ధి చెందుతూ వచ్చిందోచెప్పి, విజయనగరం మొ॥న సంస్థానాలలో జరిగిన కృషిని సమీక్షించారు. తరువాత ఈ సాహిత్యం ప్రధాన లక్షణాలను కొన్నిటిని స్పష్టపరిచారు. గోష్ఠి ప్రారంభంలో మాట్లాడుతూ కార్యదర్శి డా. గంటి శ్రీ రామమూర్తి కళింగాంధ్రంలోని భాష పరిశోధనకు ఎంతగానో

ఉపయోగిస్తుందని, కొన్ని ప్రాచీన రూపాలు ఈ ప్రాంతంలోనే లభ్యమౌతున్నాయని, రచయితలు ఈ భాషాసాహిత్యాలపై దృష్టిని కేంద్రీకరించాలని చెప్పారు. అనంతరం జరిగిన గోష్ఠిలో శ్రీయుతులు వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి [అడిదం సూర కవిని గూర్చి], పూడి పెద్ది లక్ష్మణమూర్తి [వద్దిపర్తి కోనరాట్కవిని గూర్చి], ఏ.ఎల్.నరసింహం [ఆకొండి వెంకటశాస్త్రిగారిని గూర్చి] పత్రాలను సమర్పించారు. సాయంత్రం గోపాలరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన మహాజన సభలో డా గంటి శ్రీరామమూర్తి కళింగాంధ్ర సాహిత్యచరిత్రను శాస్త్రీయమైన దృక్పథంతో ఆధునిక పద్ధతిలో కవితాసమితి రాయించాలన్న తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. సభవారు ఏకగ్రీవంగా అంగీకరించారు. ఈ చరిత్ర రచన సందర్భంగా ఈ క్రిందివారి సహాయంతో ఆయా సంఘాలను ఏర్పాటు చేయాలని కూడా తీర్మానించారు.

## 1, సంపాదకవర్గం

డా. పురిపండా అప్పలస్వామి

డా. గంటి శ్రీరామమూర్తి

శ్రీ తల్లావఝల సత్యనారాయణమూర్తి.

## 2. సలహా సంఘం :

డా. రాయప్రోలు సుబ్రహ్మణ్యం,

డా. ఐ. సూర్యనారాయణమూర్తి,

డా. సి. రామచంద్రరావు,

డా. వై. యశోదారెడ్డి,

డా. కంభపాటి సత్యనారాయ మూర్తి,

శ్రీ ఆరుద్ర.

శ్రీమతి అల్లాడి వైదేహి

శ్రీ ఎన్. కృష్ణమూర్తి

## 3. నిధి సంపాదక సంఘం :

డా. గంటి శ్రీరామమూర్తి (కన్వీనర్)

శ్రీ తెన్నేటి విశ్వనాధం

శ్రీ గణపతిరాజు అచ్యుతరామరాజు

,, పుప్పల శ్రీరామమూర్తి

,, భైరవభట్ల విశ్వనాధం

,, మళ్ల సాంబశివరావు

,, తాటికొండ నూకయ్య చెట్టి

,, గ్రంధి రంగారావు

శ్రీ దాడి వీరభద్రరావు

,, తమ్మన సుబ్బారావు.

## సంయమనంలేని సోమసుందర్

అక్టోబరు 'భారతి'లో సోమసుందర్ రచనల్ని చదివాను. వెంటనే "Some will say critics are a kind of tinkers that make more faults than they mend ordinarily" అన్న బెన్ జాన్సన్ మాటలు స్ఫురించాయి. ఇష్టమైనవాళ్ళ రచనల్ని ఆకాశానికి ఎత్తెయ్యడం, ఇష్టంలేనివాళ్ళ రచనల్ని దుమ్మెత్తి పొయ్యటం నేటి విమర్శల్లో ఎక్కువగా కనబడుతోంది. 'విమర్శకుడు' అంటే గుణదోషాల్ని నిర్ణయించే న్యాయనిర్ణేత అన్న అర్థం నేడు విమర్శకులు మరిచేపోయారు. విమర్శకుడికి కావల్సిన నిర్మమకారం, సంయమనం, సహనం అనే ముఖ్యలక్షణాలు నేటి విమర్శకుల్లో కనిపించటంలేదు. అటువంటి విమర్శకుల్లో సోమసుందర్ ఒకరన్న అభిప్రాయం ఆ రెండు రచనల్ని చదివితే కలగక తప్పదు.

'ఒక రచయితనుంచి రసజ్ఞుడు కోరుకొనేది అచ్చమైన కవితా హృదయాన్నే కాని వాడి విశ్వాసాలను కాదు' అన్న సోమసుందరే మరణించిన విశ్వనాథమీద తన అక్కసును వెళ్ళబోసుకున్నారు. "కరపత్రాల భాగోతం..." సమీక్షలో తనకి నచ్చని, తను నమ్మని సిద్ధాంతాల్ని దుయ్యబడ్తూ, ఆ ఆవేశంలో సంయమనాన్ని కోల్పోయి, 'చెక్కభజన బలగం', 'నికృష్ట స్మృతి', 'కుక్కచావు' మొదలైన చవుకబారు పదాల్ని ప్రయోగించారు. ఆయన సమీక్షలో దూషణ ఎక్కువగా చోటుచేసుకుంది ఆయన చెప్పినట్టు వినక, 'ఇది పరిశోధనా పత్రమే' అనుకొంటే అతను 'అర్భకుడా?' ఎందుకీ మితిమీరిన ఆవేశం? దేనివలన 'కిం ప్రయోజనం?' తన అభిప్రాయాల్ని పాఠకులమీద బలవంతంగా రుద్దాలనా? దూషణ లేకుండా సంయమనంతో తన అభిప్రాయాల్ని సౌమ్యంగా చెప్పలేరా? ఓసారి సోమసుందర్ 'ఆత్మవిమర్శ' చేసుకుంటే మంచిది.

శ్రీ ద్వా. నా. శాస్త్రి

## కులాలుడు - రజకుడు

ఆగష్టు 'భారతి'లో 'కులాలుడు—రజకుడు' అను శీర్షికగల రెండు లేఖలూ చూచాను. ఆ లేఖారచయితల విమర్శలు ఎంతో సమంజసముగా ఉన్నవి. వారి ఊహలు కొనియాడదగినవి.

కాని రివతరగతి ప్రభుత్వపాఠ్యగ్రంథమును పరిశీలించండి. అందు 'మిత్రభేదము' అనుపాఠమున—

1)వారణాసియందు ధావకముల్లుడను చాకివాడు గలడు (పేజి56)

2)అంత నా మడివేలు మేలుకొని...(పేజి57)

మరియు అదేతరగతి తెలుగు ఉపవాచకమున 'మంగళకైశికి' అనుపాఠమందు మాల దాసరి ప్రస్తావనకలదు. అటులనే తొమ్మిదవ తరగతి పాఠ్యగ్రంథమున 'నీలపెండ్లి' అను పాఠమందు గొల్లపెద్దలు, ఒజ్జబాపనయ్యమొదలగు పదములున్నవి.

రెండవతరగతి పాఠ్యగ్రంథమందు 'కుమ్మరి, చాకలి' ప్రవేశ పెట్ట వలదనిన ప్రభుత్వము పై పాఠ్యగ్రంథములలో ఆ పదాలను ప్రచురించడంలో గల యంతరార్థమేమిటో?

పోనీ ఆ గ్రంథాలు పూర్వము ముద్రింపబడినవి కనుక సంస్కరింపబడలేదనుకొందము. నేటి పదవ తరగతి పాఠ్యగ్రంథము చూడండి దానిలో శ్రీ విద్వాన్ విశ్వం గారి 'చీకటిపల్లె' శీర్షిక గల కవితయందు 'కోమటి', 'సరాబు' వంటి ప్రయోగములు కన్పించు చున్నవి. పైపదాలు కొన్ని ప్రాంతములందలి వైశ్యులకు; విశ్వ బ్రాహ్మణులకు బాధను కలిగించును. మరి యీ పదాలుగల పాఠ మును ప్రచురించుటలో గల పండితుల భావమేమిటో?

అగ్రకులస్తులకీనాడు ప్రభుత్వోద్యోగావకాశాలు తక్కువ. ప్రభుత్వంనుండి అట్టివారికి ఆర్థిక సహాయం కూడ అందడంలేదు. కాబట్టివారుతక్కువ కులస్తులమైతేనే బాగుండునని భావిసున్నారు.

వెనుకబడిన కులాలవారికే అన్నివిధాల బాగుంటున్న యీ రోజుల్లో వెనుకబడిన కులాల జాబితాలో గల చాకలి, కుమ్మరి వంటి పేర్లే వారికి శ్రీరామరక్షకదా! అటువంటప్పుడు వెనుకబడిన కులాల జాబితాలో లేని, నిఘంటువులలోని మారుమూల పేర్లను ఆయా కులస్తులకు అంటగట్టాలని ప్రభుత్వం ప్రయత్నిస్తుందా? అలా ప్రయత్నిస్తే కులసంఘాలు మాత్రం ఒప్పుకుంటాయా?

కాబట్టి పై లేఖల నేపథ్యాంతరార్థాలు సరైనవి కావని తెలియుచున్నది.

ఇక ఒకటవతరగతి బాలునికి ''అమ్మ, ఆవు, ఇల్లు, ఈగ'' మొదలైన పదాలు పరిచయమైనవే. కనుక వాటిని ఒకటవతరగతి పాఠ్యగ్రంథమునందు చేర్చడమెందుకు? అని ఆలేఖలు ప్రశ్నిస్తున్నవి. కాని, ఒకటవ తరగతి బాలునికి అక్షరాలు నేర్చుకునే తరుణంలో పరిచయమైన పదాలతో అక్షర బోధ చేస్తే అతడు సులువుగా అక్షరాలు నేర్చుకోగలడు కనుక ఆ తరగతిలో అలాగే పరిచయమైన పదాలే ఉండాలనేది విద్యావేత్తలందరూ ఒప్పుకుంటారు. ఐతే రెండవతరగతిలో అట్లుకాదు. సంయుక్తాక్షరములు వ్రాయడం, చదవడం నేర్చుకున్న బాలునికి 'కులాలుడు, రజకుడు' మొదలైన పదాలతో పరిచయం చేయడంలో తప్పేమీకనిపించదు. తెలిసిన వాటినుండి తెలియనివి నేర్చుకొనుట భాషాలక్ష్యం. బట్టలుతుకువాడు చాకలియని విద్యార్థికి తెలియును 'రజకుడురంగయ్య ఇస్త్రీదుస్తులు తెచ్చెను' అను వాక్యమునుబట్టి, ఇస్త్రీ దుస్తులు తెచ్చువాడు చాకలే కాబట్టి రజకుడనగా చాకలియని విద్యార్థి తెలిసికొనును. అట్లే కుమ్మరినిగూర్చి కూడ!

ఐనప్పటికీ ఆ లేఖల్లో మొదటి లేఖ ఎత్తిచూపిన పాఠ్య గ్రంథాలలోని లోపాలు విచారణీయములే! కాదనలేను. కాని పిడుగుకీ బియ్యానికి ఒకే మంత్రంలా వాటిని యీ తరుణంలో పేర్కొనడం సమంజసంగా లేదు.

ఇక్కడ నూతన ఇవాల్యుయేషన్ విద్యా విధానం ప్రకారం విద్యార్థి యొక్క ఆలోచనకు, అవగాహనకూ అవకాశమిస్తూ పండితులు పాఠ్యగ్రంథమున నూతన పదపరిచయమును గావించినారను టయే సమంజసముగా తోచుచున్నది.

శ్రీ ఎన్నార్ ప్రసాద్

మే 'భారతి'లో శ్రీ మరుపూరి కోదండరామిరెడ్డిగారి సమీక్ష కొత్తపాళీలుమీద చదివాను. అందులో చిన్న పొరపాటు జరిగింది. (శిల) నాగేయములో భావము ఉదాత్తముగ ఉన్నదని వ్రాస్తూ వేరే గేయము పేరు కుండలీకరణమున గుర్తించారు. కించిత్ బాధ అయ్యింది. ఈ విషయము గురించి ఎందుకు వ్రాయాలిలే అని మిన్నకున్నాను. నా అసంతృప్తిని ఈ విధంగానైన తృప్తిపొందాలని వ్రాశాను. మిగతా పత్రికలంటే ఆయన సమీక్ష భిన్నంగా మాలాంటి యువరచయితలకు ఆశాజనకంగా ఉంది. మీకు నా కృతజ్ఞతలు.

శ్రీ బద్వేలి రమేష్

## అభ్యర్థన

ప్రకాశం జిల్లా కందుకూరుగ్రామంలో పాత బస్సుస్టాండు వద్ద ఒక శాసనము వాయుభక్షణ చేయుచున్నది దాని నానుకొనియే ఒక దేవతాయతన మున్నది. దానిని 'తోటమ్మ' అని పిలుచు చున్నారు. శాసనభాష ప్రాచీన తెలుగులిపి దానిపై ఒకనైపున



ఈ ఆకారముకల బొమ్మ యున్నది. శాసన పరిశోధకులు కాని, పురా శాస్త్రవేత్తలు కాని నా యెరిగిన ఇరువది వత్సరాలనుండి దానిని చూచిన పాపాన పోలేదు. ఏనాడైనా 'హైవేసు' వారికి దానిపై ఆగ్రహము కలిగిన ఏ కాలువ బ్రిడ్జికో పోటీకో, తరలింతురు. ఆ దశ రాకపూర్వమే ఈ శాసనమున పరిరక్షింపయత్నము శాసన పరిశోధకులు కాని, పురావస్తుతత్త్వవేత్తలు కాని, ప్రభుత్వమువారు కాని చేయుదురుగాక అని అర్థించుచున్నాడను.

శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు
—అధ్యక్షుడు, తాలూకా రచయితల సంఘము,
కందుకూరు, ప్రకాశం జిల్లా.

## సమగ్ర సమీక్షలు అవసరమే

ఏప్రియల్ 'భారతి'లో వెలువడిన 'తరంతరం' సంకలనంపై శ్రీ సోమసుందర్ సమీక్షను ఆక్షేపిస్తూ సెప్టెంబరు సంచికలో శ్రీ చొప్పకట్ల లేఖ చదివాను.

సమీక్షను 'సమీక్షాత్మకంగా' 'పూర్వాపరాలతో' కూడి వున్నదని ప్రశంసిస్తూనే, అన్యోద్దేశ్య పూరితమని 'లంబా చౌడా' అని విమర్శించారు. ఆధునిక సాహితీ సమీక్షలు మూడుముక్కల సుందర ముదనష్టాల్లా ఉంటున్నాయి. 'కావ్యం అందంగా వుంది. అట్టమీది బొమ్మ బాగావుంది. అందరూ చదువతగింది' అనే ఫక్కీ సమీక్షలు సాహిత్య వ్యాపారానికి దోహదం చేస్తాయి కాని సాహిత్య వ్యవసాయానికి కాదు. శ్రీ సోమసుందర్ సమీక్ష సమగ్రంగా, సముద్రంగా వుంది. సంకలనకర్తల కృషిని ఆయన పదేపదే ప్రశంసించారు కూడా. కాకుంటే ఒక కవి కవితలను ఎన్నిక చేసేప్పుడు 'మేగ్నమ్ ఓపస్'లను స్వీకరించాలన్న మౌలిక సంప్రదాయం సంకలనకర్తలు పాటించలేదన్నది వాస్తవం. దానికి ఆయన సోదాహరణంగా తన అభియోగాన్ని వ్యక్తం చేసారు. శ్రీ సోమసుందర్ 'ఏదో దృష్టిలో పెట్టుకుని' అలా రాసారనుకునివుంటే శ్రీ చొప్పకట్ల వివరించి వుండవలసింది.

సమీక్షల పొడవు వెడల్పులమాట అటుంచి ఒక కవిని కించపరచటానికి, మరో సామాన్యునికి పెద్ద పంక్తిలో పీటవేయటానికి సంకలనాల్లో తావుంటుంది. ఈ పొరపాటు 'తరం — తరం'లో జరిగింది.

ఇహ పొడవు వెడల్పుల సంగతంటారా — 'బ్రెవిటీ'కి మారుపేరైన చలం మహాప్రస్థానానికి 'యోగ్యతా పత్ర'మిస్తూ ఆరు అచ్చుపేజీల సమీక్ష వ్రాసాడు! కావ్యాలు స్వయంప్రకాశాలు ఎన్నడూ కావు. విమర్శల శరీరాల్లో బ్రతికే పరాన్నభుక్కులు. దూషణ భూషణ తిరస్కారాలేవీ కావ్యాలకు, సంకలనాలకు ఆయువుపోస్తాయే తప్ప హాని చెయ్యవు. కావ్యం ఆత్మహత్య చేసుకుంటేతప్ప.

*శ్రీ చందు సుబ్బారావు*

## సమీక్షా సమీక్ష

సెప్టెంబరు 'భారతి'లో పాకాల వెంకటకృష్ణయ్యగారి విమర్శకాహంకారం చూచాను. బాగుంది. 'భారతి' పాఠకుల్ని పాటక జనం కింద లెక్కగట్టి విమర్శల పేరుతో వట్టి నాన్‌సెన్స్ రాస్తున్న సమీక్షక శబ్దవాచ్య కేవలులకు ఎక్కడికక్కడ గట్టిబుద్ధి చెప్పాలని నా అభిప్రాయం కూడాను.

కాని వెంకటకృష్ణయ్యగారు, ''76 అక్టోబరు నెల 'భారతి' నావద్ద లేదు. నేను దాన్ని చదవనూలేదు. కాబట్టి 'తోటి — తోడి', శబ్దాలపై నాగరాజుగారు చేసిన చర్చ ఏమిటో, కోదండరామరెడ్డిగారి సమీక్ష ఏ తీరున సాగిందో నాకు తెలియదు'' అని రాయడం అనవసరం. అవసరమైతే ఒక 'భారతి'సంచిక తనవద్ద లేకపోయినా, అందులో ఏముందో చూడాలన్న జిజ్ఞాస లేకపోవడం విమర్శకుడికి లక్షణంకాదు. సంవత్సరం కిందటి 'భారతి' సంచిక ఒకటి సంపాదించి చూడలేకపోవడం అలసతకాదా? అది సరైన సంజాయిషీ కాదు.

తర్వాత, ''నెల్లూరి మాండలికాలకు ఒక నిఘంటువునే తయారుచేసిన పెద్దమనిషి'' అని మరుపూరు కోదండరామరెడ్డిగారిని పేర్కొనడం జరిగింది. ఆయన నెల్లూరు మాండలికాలకే గాదు; అన్ని మాండలికాలకు సంబంధించి నలుగురు పెద్ద పరిశోధకుల (వారిలో ఒకరు డాక్టరేటు) పర్యవేక్షణకింద, పందొమ్మిది మంది పదాలు సేకరించగా, మరొక యిరవైనలుగురు సేకరించి (ఆంధ్రప్రభలో) ప్రచురించివుండిన పదాలతో కలుపుకొని కూర్చిన మాండలిక పదకోశకర్త. ఆయన్ని మరీ అంత చులకన చెయ్యడం వెంకటకృష్ణయ్యగారికి మర్యాదకాదు!

ఆయన పదకోశంలో 'తోటి' వున్నది. కాని బింకానికి తప్పంటున్నారు, అంతే!

*శ్రీ బండి నాగరాజు*



# గ్రంథ విమర్శలు

## భరత వర్షము

[పరిశోధక గ్రంథము. గ్రంథకర్త : శ్రీబొడ్డు—ప్రకాశం. కోబాల్డుపేట, గుంటూరు-2 క్రౌను సైజు 88 పుటలు. వెల : రూ 4. లు.]

భారతదేశంలో నివసించే వారందరూ ఒకే భారతజాతి అని నిరూపిస్తూ, దేశభక్తితో, సహోదరభావంతో ఒకరితో ఒకరు కలిసి మెలిసి ఉండి, భారతరాజ్యాభివృద్ధికీ, నవసమాజ సృష్టికీ తోడ్పడా లనే ప్రబోధం ప్రధానంగా యీ పుస్తకం వ్రాయబడిందని రచయిత ప్రస్తావననుబట్టి తెలుస్తున్నది. ఇందులో మొదటిది ''నేను''అనే గద్యభాగం. రెండవది ''ఆది ఆంధ్రులు'' అనే పద్యభాగం. గద్యం, పద్యం రెండూ ఉన్నందున ఇది చంపూకావ్యమని రచయిత భావి స్తున్నారు. గద్యపద్యములు రెండూ కలగా పులగంగా ఉన్నదే చంపు వవుతుంది. దేనికదిప్రత్యేకంగా ఉంటే చంపువు కాదు. ఇంతకూ ఇది పరిశోధన గ్రంథంకాని కావ్యం కాదుగదా!

ఎంతో పరిశోధన చేసి తామీ గ్రంథాన్ని రచించినట్లు ప్రకాశంగారు అంటున్నారు. ఇప్పుడు ఆది ఆంధ్రులు, ఆదిద్రావి డులూ అనే చెప్పబడేవార్యూ, గిరిజనులూ మాత్రమే అనాదినుండీ భారతదేశంలో ఉండేజాతులనీ, ద్రావిడులూ, ఆర్యులూ పైదేశాల నుండి భారతదేశానికి వచ్చి, దానిని ఆక్రమించి అసలు భారతీయులని అణగద్రొక్కారనీ, క్రమంగా వారిని అస్పృశ్యులుగా చేశారనీ, ఆదిమ జాతులకు ఎంతోఅన్యాయం జరిగిందనీ, డాక్టర్ భీమారావ్ అంబే త్కర్ మున్నగు మహనీయులు వారిని ఉద్ధరించడానికి పూనుకున్నా రనీ వారిని ప్రశంసించారు. వీరు ఇందులో వివరించిన కొన్ని విష యాలకు మనుస్మృతినుండి కొన్నిశ్లోకాలనుకూడా ఉదాహరించారు. ఇప్పుడు ప్రభుత్వం హరిజనులకు కలిగించే సౌకర్యాలను క్రైస్తవు లకు కూడా కలిగించవలెనని ఉద్ఘాటించారు.

''నేను'' అనే మొదటిభాగంలో ఆదిమ భారతీయులు, తర్వాత మనదేశానికి వలసవచ్చి దేశాన్ని ఆక్రమించిన ద్రావిడులు, ఆర్యులు, వర్ణవిభాగం, వర్ణసాంకర్యం, మాంసాహారం, ఆదిమ భార తీయుల హీనస్థితి మొదలైన విషయాలు చర్చించబడినవి. ఆత్మ కథచెప్తున్న భరత సితామహుడు నాభి(బొడ్డు) తనవృత్తాంతం చెప్పడం మూలంగా రచయిత తమ వంశం వారాదిమవాసులని సూచిస్తున్నారు.

పలనాటియుద్ధాన్ని ప్రస్తావిస్తూ ఒక వింతవిషయం ఇందులో చెప్పబడినది. గురజాల రాజైన నలగామరాజు మంత్రి బ్రహ్మ నాయుడు వర్ణ వ్యవస్థను నశింపజేసి, అందరినీ సమానం చెయ్యాలని సంకల్పించాడట! అందుకోసం అతడు సర్వజాతుల యువతులనూ పెండ్లాడాడు. అతని అస్పృశ్య భార్యకొడుకే కన్నమదాసు. నలగామ రాజు మంత్రిణి రెడ్డినాయ్మకు ఇది కిట్టలేదు. ఆమెవర్ణవ్యవస్థ ఉండాలంటుంది. అందువల్ల రెండు పక్షాలేర్పడి యుద్ధానికి దారి తీశాయి. నలగామరాజుకూ, మలిదేవాదులకూ యుద్ధం జరిగినట్లూ బ్రహ్మనాయుడు, నాగమ్మ ఆయారాజులకు మంత్రిత్వంనడిపి, సంధి కుదరకపోగా యుద్ధం జరిగినదనీ, దీనికి కుటుంబ కలహమేకారణ మనీ చరిత్ర చెప్తున్నది. ప్రకాశంగారి పరిశోధన ఫలితాలు వేరుగా కానవస్తున్నవి. వీటి సత్యాసత్యాలను చరిత్రకారులే నిర్ణయించాలి.

''ఆది ఆంధ్రులు'' అనే రెండోభాగంలో ఆది ఆంధ్రకవి అఫీషియల్ పనులు ముగించి ఉద్యానవనంలో శిలాతలంపై పానుపు మీద పరుండి నిద్రపోగా, కలలో డాక్టర్ అంబేత్కరు కనబడి ''కవీశ్వరా! మానవజాతి కుతంత్రమున్, దీనులపైన జూపెడు విధిన్ దలపోసితివా?'' అని ప్రశ్నించాడు. ఆమీద ఆ కవి ఆది ఆంధ్రుల గోడు అతని పుట్టుపూర్వోత్తరాలనుంచీ వివరంగా తెలిపాడు. మొదటి భాగంలో గద్యంలో చెప్పిన విషయాలే చర్విత చర్వణంగా ఇందులో పద్యరూపంలో వెల్లడించబడినవి. కవివాక్యం పూర్తిఅయిన తర్వాత భీమారావ్ అంబేద్కర్ కూడా అతని భావాలతో ఏకీభవించి ఆది ఆంధ్రుల స్థితికి చాలా విచారించాడు. ఇంతలో గ్రంథంపూర్తి అయింది. చివర వేమనకవి ప్రశంస ఉన్నది. అతడు కావ్యాలల్లి సౌభ్రాత్రాన్ని ప్రకటించాడట! అతని కావ్యాలేవో చెప్పబడలేదు. ఇందలి పద్యకవిత ప్రశస్తంగా ఉందని చెప్పలేము. కవిత్వం కంటె విషయమే ఇందు ముఖ్యమని గ్రహించాలి.

విశ్వమానవ, సౌభ్రాత్రం, సర్వమానవ సమానత అందరూ కోరదగినవే! అవి కావాలని అందరూ చెప్తారేకాని, ఆచరణలో పెట్టేవారు అరుదు. జాతిని సమైక్యపరచినా అందులోనూ అంత ర్విభేదాలు తప్పవు. ధనిక దరిద్ర భేదం నశించి, ఆర్థికంగా సర్వ సమానత్వం వచ్చినపుడే భేదాలన్నీ అంతరిస్తాయి. అట్టికాలం రావా లనే అందరూ ఆశింపవలసి ఉన్నది.

—"ఆంగీరస"

## సంస్కృతాంధ్ర పదార్ణవము

[కూర్పరి — శ్రీ విక్రాల — శేషాచార్యులు. డెమ్మీ సైజు 16+233పుటలు. గట్టిబైండు. వెల 8రూ. ప్రకాశకులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, సైఫాబాదు. హైదరాబాదు—4.]

పద పదార్థనిర్ణయానికి మనకు నిఘంటువుల అవసరం ఎంతైనా ఉన్నది. ప్రాచీనకాలంలో నిఘంటువులను కంఠస్థం చేసే పద్ధతే ఉండేది. అందువల్లనే అమరకోశం, మేదినీకోశం, వైజ యంతీ నిఘంటువు మున్నగు సంస్కృత నిఘంటువులు, ఆంధ్ర

నామ సంగ్రహం, ఆంధ్రభాషార్ణవ మొదలైన తెలుగు నిఘంటువులు పద్యాలలోనే కూర్చబడినవి. అకారాది క్రమంలో వుండే గద్య నిఘంటువులు గత శతాబ్దం నుంచీ వస్తున్నవి. సంస్కృత–ఆంగ్ల నిఘంటువులు, తెలుగు ఇంగ్లీషు నిఘంటువులు, శబ్ద రత్నాకరాదులు ఈ పద్ధతిలో ఉన్నవే! ఇప్పుడు నిఘంటువులు కూర్చే వారందరూ ఈ పద్ధతినే అవలంబిస్తున్నారు.

శ్రీ విక్రాల శేషాచార్యులుగారు సంస్కృతాంధ్రాలలో గట్టి పండితులు. ఎన్నోయేండ్లుగా కృషి చేసి, పెక్కు సంస్కృతాంధ్ర నిఘంటువులను పరిశీలించి ఈ నిఘంటువును కూర్చారు. ఇది అకారాది నిఘంటువు కాదు. విషయ ప్రధానమైనది. ఒక్కొక్క విషయానికి సంబంధించిన పదాలను తీసుకుని, వాటికి సంస్కృతాంధ్రాలలో ఉండే పర్యాయపదాలను ఇవ్వడం జరిగింది. తెలుగు పదాలకు సంస్కృత పదాలు, సంస్కృత పదాలకు తెలుగు పదాలూ ఇయ్యబడినవి. అకారాది నిఘంటువులలో అయితే ఆయా పదాలకు నామాంతరాలు తెలుసుకోవాలంటే ఎంతో శ్రమపడవలసి ఉన్నది. ఇందులో అట్టి శ్రమలేదు. ఒకపదం పర్యాయ పదాలన్నీ ఒక్కచోటనే లభిస్తాయి. శేషాచార్యులుగారు ఇంతతో తృప్తిపడక గ్రంధంచివర అకారాది క్రమంలో పదాల పట్టికను ఆయా పుటల సంఖ్యతో కూడా ఇచ్చారు. ఇది శ్రమ సాధ్యమైన పని. ఈవిధంగా కూర్చడానికి పాండిత్యంతో పాటు ఓపిక కూడా ఉండాలి.

కొత్త పద్ధతిలో వచ్చిన ఈ నిఘంటువు ఎంతో ఉపయుక్తమై ఉంటుంది. శేషాచార్యులుగారి శ్రమను గుర్తించి, దీనిని ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు కృతికర్తతో పాటు ప్రశంసనీయులు.

*—శ్రీ బులుసువేంకటరమణయ్య*

## మహారాణి

[దిషాన్ జర్మనీ దాసు లఘులేఖనాలకు రాకీష్ భాన్ దాసు గ్రంధరూపక రచన; ఆంగ్లమూలానికి డాక్టర్. పి. వి. చలపతిరావు ఆంధ్రానువాదము.

క్రౌన్ 1/16–250 పుటలు. వెల రు. 10–50. ప్రతులకు: బాలాజీ బుక్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ; 3-3. 864/7. ఆర్యసమాజ్ ఎదుట; సుల్తాన్ బజార్ – హైదరాబాదు–27]

మన పూర్వ సంస్థానాధీశులు, ఇతర ధన మదాంధులు సాగించిన కామలీలలతో నిండిన గ్రంధం ఇది సంఘ సంస్కర్తలు ప్రచురించిన సాంఘిక దురాచారాల రిపోర్టుగా వున్నది. జర్మనీదాసు చాలా దేశాలు పర్యటించి, అక్కడ కన్నది విన్నది ఇందు పొందు పరచినాడు. మహారాజుల వికృత ప్రేమ గాధలు అనంతాలు. యాభై ఏండ్లకు ముందు ఇంగ్లీషు రీనాల్డ్స్ నవలలు లండన్ రాజమందిరాల ప్రేమ గాధల వర్ణించి ఎక్కువ ప్రజామోదాన్ని పొందినవి. మనదేశంలో కన్నైలాల్ గిబా–H.H.-"The Pathology of Kings" అని వ్రాసి బాగా డబ్బు సంపాదించుకున్నాడు.

ఇందులోనివిగాక కాశ్మీర్ రాజు–హరిసింగ్ (మిస్టర్ హెచ్; మిడ్ల్యాండ్ బ్యాంక్ కేసు) ప్రణయగాధ; ఇండూరు హోల్కార్ రాజు బావలా హత్యకేసులో కిరీటాలు పోగొట్టుకున్న ఉదంతాలు గూడా ఉన్నవి.

ఈ పుస్తకం కొత్తవాటిని బయట బెట్టుతున్నది. దొరసానులను ప్రేమించడం కపుర్తాలా మహరాజు మొనగాడు. పాకిస్థాన్ స్థాపకుడు–జిన్నా మధ్యస్థతో ఒక ఆంగ్లేయ స్త్రీకి ఈ రాజు తిత్తికాసులు చెల్లించుకొనిన కధ రసవత్తరముగాఉన్నది.

ఈ పుస్తకం దేశదేశాల పెద్దనారి ప్రేమోన్మాద లీలలతో నిండి ఉన్నది. జపాను రాజు ఈ కోటివాడే. అక్కడక్కడ దౌర్జన్య కాండల వర్ణనలు గూడ ఉన్నవి.

అనువాదం, చక్కగా, వేగంగా ఆసక్తిపూర్ణంగా చదువును సాగింపజేస్తున్నది. అనువాదకుడు– చలపతిరావు, అనువాద విధానాన్ని గూర్చి ఇట్లా చక్కటి మాటలన్నారు:– "అనువాదం ఒక కళ. రెండు భాషలు వచ్చినంత మాత్రాన అనువాదం సులభసాధ్యం అవుతుందని భావింపరాదు. ఈ కళ బాగా తెలిసినవాడు, రెండు భాషలు వచ్చినవాడు భాషాచ కరణం చక్కగా చేయగలడు." నిజమైన మాట. భావ మెరిగి అర్థమెరిగి రసాన్ని పోషించాలనుట తిక్కనాది మహామహులు ఇందు ఆరితేరిన వారు కాబట్టే మహా కవులైనారు.

*శ్రీ మధుపూరు కోదండరామరెడ్డి*

## ఆంధ్రప్రదేశ్ లో గ్రంథాలయోద్యమం

స్వయంభువుగ నుటంకింపబడిన ఆంధ్రదేశ గ్రంధాలయోద్యమము అన్యరాష్ట్ర మార్గదర్శకమైనది. విజ్ఞాన వ్యాప్తికి, జాతీయోద్యమ వ్యాప్తికి, వయోజన విద్యా ప్రచారమునకు గ్రంథాలయములు నిర్వహించిన పాత్ర గుణగణనీయమైనది. ఇది ప్రజల ఉద్యమము.

Where as the Library Movement in Baroda was patronised by Gaekward him self, the Library Movement in Andhra Desa was entirely a people's Movement. 1

The Andhra Library Association was affiliated to the National University of Dr. Anni Besant. She advised Gandhiji (who on arrival from South Africa touring India before entering the country's politics) to see Ayyanki the Secretary of the Andhra Library Association to study the Village Library Movement. Gandhiji did so2.

భారత జాతికి 'మార్గదర్శకుడైన మహాత్మునికే ఆంధ్ర గ్రంథాలయోద్యమము మార్గదర్శకముగుట ఒకచారిత్రకవిషయము' ఏత దుద్యమ భాగస్వామి అయిన శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య వ్రాసిన * ఈ 'ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయోద్యమం' అను 35 పుటల పుస్తకము సంక్షిప్తముగ కనబడినను, బహు విషయ నిక్షిప్తమై, ఉద్యమ చరిత్ర ప్రధానాంశములను ఉత్తేజకరముగ గుర్తుచేయుచు, వర్తమాన స్థితిగతులను తెలుపుచు భవిష్యకార్యక్రమములకు సహేతుక సూచనలు గలిగినటు వంటిది.

ఇందే శీర్షికయు లేకనే 15 పుటలు అనేక విషయములు తెలుపును. వెంబడిని ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయ శాసనాలు; గ్రంథాలయ సిబ్బందీ — సేవలూ; వ్యవస్థ; రాష్ట్ర గ్రంథాలయ నిర్వాహకుడు; పుస్తకాల ఎంపిక బాలసాహిత్యం, ఆర్థిక విషయాలు; సంఘాల గుర్తింపు; శిక్షణ కార్యక్రమాలు; వ్యవస్థను నిర్వహించే వ్యక్తికి ప్రాముఖ్యం; నేటి కర్తవ్యం అనుశీర్షికలతో రచన సాగినది. 14, 17, 19, 20, 21 పుటలలో రచయిత చేసిన గ్రంథాలయ సంబంధ సేవయు నుదహరింపబడినది. నాటి ఉద్యమమున పాల్గొనిన పెద్దలందఱును నేడు సేవా భావము కొరవడినదని, ఆశించినంతగ జరుగుటలేదని భావించుటకలదు. శ్రీ వావిలాలకూడ వారిలో ఒకరు.

"ఆ రోజుల్లో గ్రంథాలయోద్యమం ఏదో చెదురు మదురుగా బలహీనంగా జరిగింది కాదు" (పుట 3)

"ఆ రోజుల్లో గ్రంథాలయం అనేది ప్రజా జీవన స్రవంతికి దూరంగావున్న ఏకాంత హర్మ్యం" అని ప్రజలు భావించలేదు (పుట 5).

"ప్రజలను ఉర్రూత లూగించిన ఆనాటి ఆ మహోద్యమం నామ మాత్రంగా మాత్రమే యిప్పుడు మిగిలివుంది" (పుట 22).

ఈ వాక్యములలోని తపనను మనము అర్థము చేసికొనవలసి వున్నది. శ్రీ అయ్యంకి, శ్రీ పాతూరి, శ్రీ టేకుమళ్ళ మున్నగువారు సైతము తమ వుపన్యాసములలో ఇట్టి తపన వ్యక్తము చేయుటలు చూడగా జరుగవలసిన దెంతయో వున్నదనిపించును.

"సంప్రదాయిక విద్యకు ఇప్పుడు 140 కోట్లు ఖర్చుపెట్టినట్లుగా గ్రంథాలయాలకు కూడా నిధులు కేటాయించాలి. రాష్ట్ర ప్రభుత్వ విరాళంతో సమానంగా విరాళం ఇవ్వాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరాలి. ఇందుకు అవసరమైన విధంగా చట్టాన్ని సవరించాలి" (పుట 26) అన్నారు శ్రీ వావిలాల. ఇవి జరిగినప్పుడు గ్రంథాలయ వ్యవస్థ మెరుగుపడుతుంది. జిల్లా గ్రంథాలయ సంస్థలకు తగిన నిధులు కావలసి వున్నవి. 'రాజమహేంద్రవరంలోని గౌతమీ గ్రంథాలయాన్ని ప్రభుత్వం తీసికొని దానిని పరిశోధనా గ్రంథాలయంగా నిర్వహించవచ్చు'నని సూచించారు. 1919 లో విశాఖలో జరిగిన గ్రంథాలయ సభలో ఆంధ్రదేశ కేంద్ర గ్రంథాలయమున్నకు రాజమహేంద్రవరం అర్హ స్థలమని సూచింపబడింది. 1922 లో శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు "పరిశోధకులు తరచుగ చెన్నపురి వెడలునవసరము దీర్చుటకు, ఆంధ్ర వ్యక్తి వికాసమునకు దీనినాంధ్రదేశ కేంద్రగ్రంథాలయముగ రూపొందించవలెనను అభిలాష వ్యక్తపరచిరి. ఇదియనికాదు ఇట్టి వెక్కుఢ మున్నను వృద్ధిచేయవలసి వున్నది. ప్రయివేటు గ్రంథాలయముల గురించి ఈ పుస్తకమున రచయిత కొంత వ్రాసి వుండవలసినది ఈనాడు పాత గుంటూరులోని తిక్కన గ్రంథాలయం మున్నగు ప్రాచీన గ్రంథాలయములు రాష్ట్ర మందచ్చుటచ్చుట జీర్ణస్థితిలో నుండుట దురదృష్టకరము. వ్యవస్థ శీర్షిక క్రిందగల విషయములు ప్రభుత్వము ప్రజలు ఆలోచించవలసినవి. గ్రంథాలయోద్యమ సేవకుల అనుభవాలూ జ్ఞాపకాల కలబోతలతో, వివిధ మండలములలోని అనేక గ్రంథాలయముల నివేదికలు, చరిత్రల ఆధారములతో సమగ్రమైన 'ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర' వ్రాయబడవలసిన అవసరమున్నది. అట్టి దానికి స్ఫూర్తి నీయగల పుస్తకములలో నిదియు ముఖ్యమైనది. సూక్ష్మమున మోక్షమను దానికీ పుస్తకము తగియున్నది శ్రీ వావిలాల సూచనలు తప్పక ఆలోచింపవలసినవి.

## అథో జ్ఞాపికలు :

1. Dr. S R. Ranganathan (Page 16) The Light of the Library

2 Tekumalla Rama Chandra Rao; 'Iyyanki Venkata Ramanayya-The Architectof Public Library Movement'.

The Hindu Sunday June 3rd 1971.

---

*రచన: వావిలాల గోపాలకృష్ణయ్య, ప్రచురణ: సమాచార పౌర సంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు 35 పుటలు; వెలలేదు.

— శ్రీ సన్నిధానం నరసింహశర్మ

## వేమన

(223 వేమన పద్యాలకు ఉర్దూ, హిందీ అనువాదం: ప్రకాశకులు: ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమి, హైదరాబాదు. 1975. డిసెంబరు. మొదటికూర్పు: 500 ప్రతులు. పుటలు 223. వెల: పదిరూపాయలు. సంపాదకులు: సర్వశ్రీ ఎం. రామప్ప. డా|| గోపాలకృష్ణారావు, డా|| శ్రీరామశర్మ)

ఈ పుస్తకానికి 'ఆద్యక్షరం' వ్రాస్తూ "వేమనను సర్. విల్యంజోన్స్ భారతదేశపు 'ఆఫ్లాతూన్‌ప్లాటో'గా అభివర్ణించినాడు.

డా॥ జి. యు. పోప్, మేజర్ మెక్డొనాల్డ్ వంటి ప్రాచ్యవిషయాభిజ్ఞులు వేమనపై పరిశోధనలు జరిపినారు. ఈపుస్తకంవల్ల తెలుగుమహాకవి వేమనను అర్థంచేసికోటానికి హిందీ, ఉర్దూ భాషీయులకు అవకాశం లభిస్తుంది అని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఉర్దూ కమిటి సభ్యులైన శ్రీ అబిదాలీఖాన్ అన్నారు.

ఈ పుస్తకానికి ప్రధాన సంపాదకులైన శ్రీఎం. రాముప్ప తమమున్నుడిలో శతకసాహిత్యాన్ని ప్రస్తావిస్తు శతకకవులలో వేమనకు ప్రత్యేకత కలదన్నారు. ఉర్దూ కవి నజీర్ అక్బరాబాదీలో వేమన పోలికలున్నవి. మహాకవుల పద్యాలు పద్యరూపంలో అనువదించటం కష్టసాధ్యం కాబట్టి వచనంలోనే అనువదించడం జరిగిందన్నారు. నిజమే. పద్యాన్ని పద్యంతో అనువదించడం కష్టమే. కాని అసాధ్యం మాత్రం కాదు అని శ్రీ రాఘవేంద్రరావు జబ్ (ఆలంపూరీ), నల్లగొండలోని 'సాగర్'గారలు నిరూపించినారు.

అయితే 'ఆద్యక్షరం'లో శ్రీ ఆబిదలీఖాన్‌గాని పరిచయంలో శ్రీదే. రామానుజీరావు గాని చివరకు మున్నుడిలో శ్రీ రాముప్పగానీ ఇదివరకు ఉర్దూ భాషలో వేమనను గూర్చిగాని, ఇతర శత కాలను గూర్చిగాని జరిగిన కృషిని ప్రస్తావించలేదు.

ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు భాషాధ్యక్షులుగా ఉన్నకాలంలో, వారి ప్రేరణ వలన, వారి సహచరులైన ఆచార్య ఈశ్వరనాథటోపాగారు వేమన తత్వాన్ని గూర్చి 'ఇస్రారెహయాత్' అనే పేరుతో ఉర్దూలో ఒక ఉద్గ్రంధాన్ని వ్రాసినారు. దానికి ఆచార్య రాయప్రోలువారి సుదీర్ఘమైన పీఠిక, గ్రంధానికొక విశిష్టత చేకూర్చింది. ఇక రెండవది, నల్లగొండ వాస్తవ్యులైన ఉర్దూకవి 'సాగర్; వేమనపద్యాలను చక్కని ఉర్దూనజం (పద్యరూపం) లో అనువదించినారు. ఇటీవలనే వీరు వేమన పద్యాల ఉర్దూ అనువాదాన్ని వరంగలులోని విద్వద్గోష్ఠులలో వినిపించినారు. సభలకధ్యక్షత వహించిన శ్రీ కాళోజి రామేశ్వరరావు 'షాద్' వేమనను గూర్చి రచించిన సుదీర్ఘ ఉర్దూ కవిత వాని కదే సాటి అని చెప్ప వచ్చు.

వేమన పద్యాల తర్వాత ప్రతి తెలుగు నాటకాలమీద ఆడేవి సుమతి పద్యాలు. సుమతి శతకానికి 1958నాటికే శ్రీరాఘవేంద్రరావు జబ్‌గారు పద్యరూపము ధరింపజేసినారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు, ఉత్తమ అనువాదమని, బహుకరించినారు. 1966లో 'దబిస్తానెత ఖయ్యులాత్' అనేపేరుతో అచ్చుపడ్డది. దీనికి బహుభాషాకోవిదులు శ్రీ బూర్గులరామకృష్ణారావు వంటి మహామహులు పీఠికవ్రాస్తు జబ్‌గారు 'రుబాంయా'లలో సుమతిశతకాన్ని సమర్థవంతంగా ఉర్దూపాఠకులకు అందజేసిధన్యులైనారని ప్రశంసించినారు. అది వరకె జబ్‌గారు అనేక సంస్కృతకావ్యాలను ఉర్దూలోకి అనువదించిన ఘనత పొందినారు. 'సు మ తి' శ త కా న్ని అనువదించినందుకు ప్రశంసించిన అకాడమీవారు, 'వేమన పద్యాలనువదించవలసినదిగా కోరవలసి వుండిరి. శ్రీ రాఘవేంద్రరావుగారి వంటి ఉభయ భాషా ప్రవీణులు, "ఉర్దూలో రుబాంయాలు వ్రాయడంలో దిట్ట" అని రుబాంయాల రచనలో అంతకు మించినవాడు లేడనిపించుకున్న "అంజద్" హైదరాబాదీగారే జబ్‌గారిని ప్రశంసించినారు. రాఘవేంద్రరావుగారు దివంగతులగుటతో, ఉర్దూ తెలుగు ఆదాన ప్రదాన కార్యానికి అఘాతం కలిగింది.

ఇక అనువాదాల గుర్చించి వచనంలో చేసిన అనువాదాలు చాలా సరళంగా, మూలానికి విధేయంగా ఉండిసాగినవి. ఒక్కచోట మాత్రం ఉర్దూఅనువాదంలో పొరపాటు జరిగింది. 62వ పద్యంలో ద్రౌపదిని అవమాన పరచిన సింహబలుని వావుకు అంటే కీచకుని మరణానికి సంబంధించినది. కాని ఉర్దూ అనువాదంలో 'దుశ్శాసనుడు నిండు దర్బారులో కొప్పుబట్టి ఈడ్చుట' అని తెలుపబడ్డది. అది సరికాదు. సమకాలిక సింహబలులు భీముడు, కీచకుడు, దుర్యోధనుడు, జరాసంధుడు. దుశ్శాసనుడు కాదు. ఇక 'నోట్' అన్న 'దుశ్శాసనుడు కురురాజు తమ్ముడు' అని పేర్కొనబడినది. కౌరవ చక్రవర్తి దుర్యోధనుని తమ్ముడని తెలుపవలసి వుండేది.

మొత్తానికి చక్కని అనువాదాన్ని అందజేసిన సంపాదకులు వందనీయులు.

శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**